శ్రీః

# ఆంధ్రవాఙ్మయచరిత్ర

## ప్రథమసంపుటము

రచయిత్రి : డా॥ గోగినేని యోగప్రభావతీదేవి
ఎమ్.ఏ. (తెలుగు), ఎమ్.ఏ. (సంస్కృతమ్), పిహెచ్.డి. (తెలుగు),






తెలుగుగోష్ఠి
రాంనగర్, హైదరాబాదు

శ్రీః

# ఆంధ్రవాఙ్మయచరిత్ర

ప్రథమసంపుటము

రచయిత్రి : డా॥ గోగినేని యోగప్రభావతీదేవి
ఎమ్.ఏ. (తెలుగు), ఎమ్.ఏ. (సంస్కృతమ్), పిహెచ్.డి. (తెలుగు),





తెలుగుగోష్ఠి
రాంనగర్, హైదరాబాదు

శ్రీః

# ఆంధ్రవాఙ్మయచరిత్ర

## ప్రథమసంపుటము

డా॥ గోగినేని యోగప్రభావతీదేవి,

ఎమ్.ఏ. (తెలుగు), ఎమ్.ఏ. (సంస్కృతమ్), పిహెచ్.డి. (తెలుగు),

పృష్ఠ సఙ్ఖ్యా : 116
మూల్యము : రూ.30/-
ప్రథమ ముద్రణము: సర్వజిన్నామ సంవత్సరము - ఉగాది 20-3-2007



ప్రాప్తి స్థానమ్ : 1) తెలుగు గోష్ఠి,
C/o. V.V. Subramanya Sarma,
201, Land Mark Apartments,
West Marredpally, Secunderabad - 500 026.

2. డా॥ గోగినేని యోగప్రభావతీదేవి,
ఎమ్.ఏ. (తెలుగు), ఎమ్.ఏ. (సంస్కృతమ్), పిహెచ్.డి. (తెలుగు),
హెడ్, తెలుగు & ప్రాచ్యభాషా విభాగం
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జున నగర్ - 522 510



D.T.P. at : విక్రమ్ గ్రాఫిక్స్,
ఆంధ్రరత్న రోడ్ - చీరాల.
☎ 08594 - 233242

Printed at : సూర్య ఆఫ్‌సెట్,
స్టేషన్ రోడ్, చీరాల
Cell : 9346911249

# మున్నుడి

వాఙ్మయచరిత్ర అవశ్యకతను గుర్తించి గ్రంథములను వెలయించిన వారిలో 'ఆంధ్రవాఙ్మయ చరిత్రము' (1920) ను రచించిన వంగూరి సుబ్బారావుగారు, 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము' (1928)ను రచించిన కవిత్వవేది కె. వేంకటనారాయణరావుగారు, 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర'ను రచించిన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, 'ఆంధ్రవాఙ్మయచరిత్ర సర్వస్వము' (ప్రథమ సంపుటము-1957)ను రచించిన శిష్టా రామకృష్ణశాస్త్రిగారు, 'ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము' (1949)ను రచించిన ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, 'ఆంధ్రసాహిత్య చరిత్ర'ను రచించిన పింగళి లక్ష్మీకాంతంగారు, 'సమగ్రాంధ్రసాహిత్య' కర్తలు ఆరుద్రగారు, 'తెలుగుసాహిత్య చరిత్ర'కారులు కొర్లపాటి శ్రీరామమూర్తిగారు ప్రఖ్యాతినొందిరి. ఈ సాహిత్య చరిత్రకారుల గ్రంథముల సారభూతమైన గ్రంథము డా॥ గోగినేని యోగప్రభావతీదేవిగారి 'ఆంధ్రవాఙ్మయచరిత్ర'.

పది యుగములుగా విభజింపబడిన 'ఆంధ్రవాఙ్మయచరిత్ర'లో ప్రాఙ్నన్నయ, నన్నయ, శివకవి, తిక్కన, ఎఱ్ఱన యుగములతో ప్రథమ సంపుటము ఆకృతి దాల్చినది.

**ఉపోద్ఘాతము**

భాషోత్పత్తి, వాఙ్మయ వికాసము, సాహిత్యాధ్యయన పద్ధతులు, వాఙ్మయమునకు దేశచరిత్రకు గల అవినాభావ సంబంధము, వాఙ్మయచరిత్రాధారములు, ఆంధ్రవాఙ్మయచరిత్రలు, ఆంధ్రకవుల చరిత్రలు, పలువురు సాహిత్యచరిత్రకారులు చేసిన యుగవిభజనము, యుగకర్తృత్వము, ఆంధ్రము-తెనుఁగు-తెలుఁగు శబ్దముల వ్యుత్పత్తి ఉపోద్ఘాతమున వివరింపబడినవి.

**ప్రాఙ్నన్నయ యుగము**

శాతవాహనుల నుండి తూర్పు చాళుక్యుల వరకు తెలుఁగు దేశము నేలిన రాజవంశముల వారి శాసనములాధారముగా, హాలుని గాధాసప్తశతిలోని తద్భవ, దేశ్య పదములాధారముగా నాటి తెలుగుభాషా స్వరూపము, శాసనములలోని పద్యరచనను బట్టి నన్నయకు ముందే కవితా మార్గము ప్రారంభమగుట, లోకుల రసవలె యాకులుగా వెలసిన పదకవితా సృష్టి ప్రాఙ్నన్నయ యుగముననే ఆరంభమగుట వివరింపబడినది. ప్రాఙ్నన్నయ యుగమునాటి శాసనభాషా స్వరూపము ప్రముఖముగా భాషాచరిత్రకు చెందిన అంశమగుటచే సంక్షిప్తీకరింపబడినది.

**నన్నయయుగము**

తూర్పు చాళుక్యరాజగు రాజరాజనరేంద్రుని ఆస్థానమలంకరించిన నన్నయభట్టు, అతని యాదేశమున, నారాయణభట్టు తోడుగా నిలువగా, భారతాంధ్రీకరణకు పూనుకొనిన సన్నివేశమును, భారతాంధ్రీకరణావశ్యకతను, నన్నయ భారతానువాద పద్ధతిని, నన్నయ కవితారీతులను వివరించుట ఆంధ్రశబ్దచింతామణి నన్నయకర్తృకము కాదని నిరూపించుట, గణితశాస్త్ర కావ్యకర్త పావులూరి మల్లన గురించి వివరించుట నన్నయయుగము నందలి ప్రధానాంశములు.

**శివకవి యుగము**

నన్నయ, తిక్కనల నడిమి కాలమున ఆంధ్రులను శైవము ప్రబలముగా ఆకర్షించుట, మానవల్లి రామకృష్ణకవిగారు చేసిన నన్నెచోడుని కాలనిర్ణయము, నన్నెచోడమహాకవి కవితా సిద్ధాంతములు జాను తెనుఁగు, వస్తుకవితలు, కుమారసంభవ కావ్య విశేషములు, మల్లికార్జున పండితారాధ్యుని శివతత్వసారము, గోనబుద్ధభూపాలని రామాయణ రచనమును, కాచవిభుడు, వినవిట్ఠలరాజు పూరించుట శివకవి యుగము నందలి ప్రధానాంశములు.

**తిక్కన యుగము**

తిక్కన నిర్వచనోత్తర రామాయణము నందలి కవితా లక్షణముల నిరూపణము, శివకేశవా భేదమును పాటించి మహాభారత రచనకుపక్రమించి లోకహిత నిష్ఠతో పదునైదు పర్వములను తెనిఁగించుట, కేతన దశకుమారచరిత్రానువాదము, లక్షణగ్రంథమైన ఆంధ్రభాషాభూషణరచనము, ధర్మశాస్త్రమైన విజ్ఞానేశ్వరీయ రచనము, అధర్వణుని ఛందశ్శాస్త్ర రచనము, బద్దెన సుమతి శతక రచనము, వీరశైవాంధ్ర వాఙ్మయమునకు ప్రతిష్ఠ చేకూర్చిన పాల్కురికి సోమనాధుని రచనలు, మారన మార్కండేయ పురాణ రచనము, మంచన కేయూర బాహుచరిత్ర రచనము ఈ యుగము నందలి ప్రధానాంశము.

**ఎఱ్ఱన యుగము**

హుళక్కి భాస్కరుడు, మల్లికార్జునభట్టు, కుమార రుద్రదేవుడు కర్తలుగా వెలసిన భాస్కర రామాయణ రచనము, ఎఱ్ఱన అరణ్య పర్వశేషరచనము, లక్ష్మీనృసింహావతార రచనము, హరివంశ రచనము, చిమ్మపూడి అమరేశ్వరుని విక్రయ సేన కావ్య రచనము, విన్నకోట పెద్దన అలంకారశాస్త్ర గ్రంథమైన కావ్యాలంకార చూడామణి రచనము, నాచన సోముని ఉత్తర హరివంశ రచనము, రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము – ఈ యుగమునందలి ప్రధానాంశములు.

తెలుగుగోష్ఠి అధ్యక్షులు శ్రీ వి.వి.యస్.సుబ్రహ్మణ్యశర్మగారు సాహిత్యపిపాసులు. పెక్కు ఆంధ్రగ్రన్థములను పుస్తక రూపములోనికి తెచ్చిన తెలుగువెలుగు శ్రీ శర్మగారు. ఈ గ్రన్థము తెలుగుగోష్ఠి ప్రచురించుట కడు ముదావహము. సహకరించిన శ్రీ బందా రాఘవేంద్రరావుగారికి నమస్సుమాంజలులు.

ఆంధ్రవాఙ్మయ చరిత్ర గ్రంథములు ఆంధ్రకవుల చరిత్రలు మాత్రమే గాక, భారతి, ఆంధ్ర సారస్వత పరిషత్పత్రికలు, ఆంధ్రపత్రిక ఉగాది సంచికలందలి పండితుల వ్యాసము లెన్నియో ఈ గ్రంథ రచనమున రచయిత్రికి ఉపకరించినవి. త్వరితగతిన ద్వితీయ సంపుటమును సాహితీ ప్రియులకందింతునని తలంతును.

–సంపాదకుడు
రావి మోహనరావు, ఎం.ఎస్.సి., జియాలజీ, ఎం.ఏ., సంస్కృతం
లెక్చరర్, వి.ఆర్.యస్.&వై.ఆర్.ఎన్. కళాశాల, చీరాల

శ్రీః

# వాఙ్మయము

వాక్+మయము=వాఙ్మయము. వాక్కునకు 'మయట్' ప్రత్యయము చేర్చగా వాఙ్మయమయినది. 'మయట్' అనగా వికారము. కావున వాఙ్మయమనగా వాగ్వికారమని యర్థము.

అవయవార్థమును బట్టి విచారించినచో "వాఙ్మయము" అనుపదమునకు శబ్దకృతములయిన రచనలన్నియు లక్ష్యభూతము లగును. అనగా మానవుడు నోటితో మాటలాడెడి భాషనంతను చేతితో వ్రాసినచో ఆ భాష తాల్చెడి స్థిరమైన వాక్యరూపము వాఙ్మయశబ్ద వాచ్యము కాదగును. కాని శాస్త్రకారులా శబ్దమునకు ఇంత విపులార్థము నంగీకరింపరు. మానవుడు వ్రాసెడి ప్రతివాక్యమును వాఙ్మయమగుననుట శాస్త్రకారునకే కాదు; సామాన్యునకును వింతగానే తోచును. అట్టి పరిగణన అనుచితమగుట చేత ఆలంకారికులు వాఙ్మయశబ్దార్థములైన రచనలకు కొన్నిలక్షణములను నిర్దేశించి, ఆ లక్షణములలో ఏ యొక్కటి యున్నను ఆ రచనను వాఙ్మయముగనే స్వీకరింపవలయునని సిద్ధాంతీకరించిరి.

వారు నిర్దేశించిన లక్షణములతో ముఖ్యమైనవి రెండు. అందులో మొదటిది – ఆ రచన మనకు విజ్ఞానమును ప్రసాదించునదియై యుండవలెననుట. రెండవది – విజ్ఞానముతోపాటు ఆనందమును గూడ ప్రసాదింపవలయుననుట. కొన్ని రచనలు రెండు లక్షణములను గలిగియుండవచ్చును. ఈ వివరణమును మనసులో పెట్టుకొనియే రాజశేఖరుడను నాలంకారికుడు – "ఇహా గి వాఙ్మయ ముభయథా శాస్త్రం కావ్యం" అని రెండుగా వింగడించెను.

వైదిక, పురాణ, కావ్యభేదముచే వాఙ్మయము పూర్వులచే త్రిథా విభక్తము. వైదిక వాఙ్మయము, పురాణ వాఙ్మయము, కావ్య వాఙ్మయము అని పిలుచునపుడు వాఙ్మయ శబ్దము పరిమితార్థమునగ్రహింపబడినది.

ఆంధ్రవాఙ్మయచరిత్ర = ఆంధ్రకావ్యగ్రంథచరిత్ర. ఇచటను వాఙ్మయము పరిమితార్థమున గృహీతము.

'పంకజ' శబ్దమెట్లు పద్మార్థమున పరిమితార్థమందు గ్రహింపబడుచున్నదో యట్లే 'వాఙ్మయము' ను.

Literature=Letters నకు సంబంధించినది. కావున Europeans (పాశ్చాత్యులు) కూడా మన పద్ధతి యందే వాఙ్మయార్థము చెప్పికొనిరి.

**"ఆదిరాజయశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయం తేషా మసన్నిధానేపి న పశ్య స్వయం నశ్యతి"** ఇచట వాఙ్మయమనగా కావ్యమనియే.

సారస్వతము:– సరస్వతి వాగ్దేవత. అనగా వాక్కు. సరస్వతి శబ్దమునకు పెంపుదలయే సారస్వతము. సరస్వతీ భావార్థక వృద్ధిరూపమే సారస్వతము. అనగా వాఙ్మయమనియే యర్థము గలుగుచున్నది. వాఙ్మయ శబ్దమువలె నిదియు విశాలార్థద్యోతకము.

కాని యీ పదము పలువురు శాస్త్రకారులచేత పరిమితార్థమును ప్రయుక్తమయినది. ఈ పదమును ముమ్మొదట విద్యానాథుడు తన ప్రతాపరుద్రయశోభూషణ మందు ఇష్టదేవతాస్తుతి యందు సరస్వతీ ప్రార్థన సలుపుచు, సారస్వత శబ్దమును ప్రయోగించెను.

"విద్యాకైరవ కౌముదీం శ్రుతి శిరస్సీమంత ముక్తామణీం
దారాన్ పద్మభువస్త్రిలోక జననీం వందే గిరాం దేవతామ్
యత్పాదాబ్జ నమస్క్రియాః సుకృతినాం సారస్వత ప్రక్రియా
బీజన్యాస భువో భవంతి కవితానాట్యైక జీవాతవః॥"

మల్లినాథసూరి మనుమడు కుమారసోమపీఠి వ్యాఖ్యాన మందు "సారస్వత ప్రక్రియానాం" అని కలదు. దీనికి "కావ్య ప్రబంధ విశేషము" లని యర్థము.

పండితరాయలు తన భామినీ విలాసమందు – "సారస్వత జలధి మథన సంభూతా" అని సారస్వత శబ్దమును ప్రయోగించెను.

మురారి "బహవహో సారం తు సారస్వతాం" అని ప్రయోగించెను.

సాహిత్యము:– ఈ సాహిత్య శబ్దమును తొట్టతొలుతగా భామహుడు ప్రయోగించెను.

"శబార్థౌ సహితం కావ్యమ్" "సహితయో ర్భావః సాహిత్యమ్" అని నిర్వచనము. సహిత భావమే సాహిత్యమని తాత్పర్యము. శబ్దార్థ సహిత భావమని గ్రాహ్యము.

కాలక్రమమున రుయ్యకుని "సాహిత్యమీమాంస", విశ్వనాథుని "సాహిత్య దర్పణము" అను గ్రంథములు వెలసినవి. అలంకారము, కవిత్వము, కావ్యము – వీనికి పర్యాయపదముగా సాహిత్యశబ్దము మొదట వాడబడినది. కాని తరువాత కేవల కావ్య గ్రంథార్థద్యోతకమయినది.

"సంగీత సాహిత్య విద్యావిహీనాః సాక్షాత్పశుః" "రస సంయుక్తం తదేవ సాహిత్యమ్" – అని నిర్వచనము. స+హిత అని పదవిభాగము చేసి హితయుతము సాహిత్యమనియు చెప్పనగును.

"హితేన నిరతిశయ ప్రేమాస్పదేన" – హితకరమే కాక రససంయుతము నయినది సాహిత్యము.

"హితేన సహితం సాహిత్యం" అని యొక నిర్వచనము.

వాఙ్మయ, సారస్వత, సాహిత్య శబ్దములు తొలుత విస్తృతార్థ ద్యోతకములుగా ప్రయుక్తములు. వాఙ్మయము, సారస్వతము మాత్రము విస్తృత, సంకుచితార్థ బోధకములుగా ప్రయోగింపబడుచున్నవి. ఉదా:– వైదిక వాఙ్మయము, వైదిక సారస్వతము కాని సాహిత్య శబ్దము మాత్రము రాను రాను సంకుచితమై కావ్యజాల పర్యాయపదముగా మాత్రమే వాడబడుచున్నది.

పిండితార్థమేమనగా సుందరమైన రచనయు, సార్వజనీన ప్రయోజనము కలిగి, భావనాత్మకమైన అహ్లాదము నిచ్చుచు, కర్తయొక్క ఆత్మీయతను స్ఫురింపజేయు గ్రంథము కావ్యము, ఆ కావ్యజాలమే సాహిత్యము' – పింగళి లక్ష్మీకాంతం.

వేదము – పురాణము – కావ్యము

"ఆదిరాజ యశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్ తేషా మసన్నిధానేపి న స్వయం పశ్య నశ్యతి" (వాఙ్మయము అదర్శము (అద్దము) వంటిది. వాఙ్మయాదర్శమున తొలిరాజుల యశస్సనెడు బింబము ప్రతిఫలించును. ఆ రాజుల యొక్క యసన్నిధానము నందును – అనగా వారి మరణానంతరము నను – వారి యశస్సు నశింపదు).

ఇచట వాఙ్మయమనగా కావ్యమనియే. ప్రాచీన కాలమున మన దేశమందు వేద, పురాణ,

శాస్త్ర, కావ్య భేదములచే చతుర్విధమయిన వాఙ్మయము వర్థిల్లినది. దాని నుండి కావ్యమును వేఱు చేసి చూడవలయును. ప్రతాపరుద్ర యశోభూషణమందు తద్భేదము నిరూపితము.

యద్వేదాత్ప్రభుసమ్మితాదధిగతం శబ్దప్రధానాచ్చిరం
యచ్చార్థప్రవణాత్పురాణవచనాదిష్టం సుహృత్సమ్మితాత్।
కాంతా సమ్మితయా యయా సరసతా మాపాద్యకావ్యశ్రియా
కర్తవ్యే కృతుకీ బుధో విరచితః తస్యై స్పృహాం కుర్మహే॥ – విద్యానాథుడు

వేదము విధి నిషేధరూపము. అది 1) ప్రభు సమ్మితము. ప్రభుశాసనము వంటిది. "సత్యం వద, ధర్మం చర" "న సురాం పిబేతి, న పరదారాం గచ్ఛతి" మఱియు వేదము 2) శబ్ద ప్రధానము. అనగా వేదము నందలి శబ్దము (స్వరము) మార్చుటకు గాని, అన్యవిధముగ నుచ్చరించుటకు గాని తగదు. ఇంకను వేదము 3) చిరకాలావబోధము (చిరం అధిగతం). మీమాంసాశాస్త్రము కడముట్ట నెఱిగిన గాని వేదమర్థము కాదు.

పురాణము 1) అర్థ ప్రధానము. ఇందు శబ్దమునకు కాక అర్థమునకే ప్రాముఖ్యము. 2) సుహృత్సమ్మితము. అనగా స్నేహితుని బోధవలె నుండును. నిదర్శనపూర్వకముగా ప్రబోధించును. 3) నాతి చిరకాలావబోధము.

కాగా కావ్యము 1) కాంతా సమ్మితము. భార్యవలె మృదువుగా బోధించును. 2) వ్యంగ్య ప్రధానము. 3) సరసము. రసహీనము కావ్యము కాదు. సులభముగా పఠితను రంజించుటకు సరసత మిక్కిలి యవసరము.

పురాణమునందు హరిశ్చంద్ర కథ చెప్పబడియున్నది. దానినే గౌరన "హరిశ్చంద్రోపాఖ్యాన"మను కావ్యముగా విస్తరించి వ్రాసెను. ఈ కావ్యమునకును, పురాణోక్తమయిన హరిశ్చంద్రకథకును భేదముండును.

"ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కళాసు చ
కీర్తిం చ ప్రీతిం చ సాధుకావ్య నిషేవణమ్" – భామహుడు

(ధర్మార్థ కామమోక్షములయందు విచక్షణాజ్ఞానము కొఱకు సత్కావ్యసేవనము అవసరము. ఆ సత్కావ్యము కీర్తిని ప్రీతిని గల్గించును.)

"కావ్యం యశసేఽర్థకృతే, వ్యవహారవిదే, శివేతరక్షతయే
సద్యః పర నిర్వృతయే, కాంతా సమ్మిత తయోపదేశయుజే" – మమ్మటుడు

ఈ ప్రయోజనములు కావ్య గర్భితములు. ఇన్నిటియందును సద్యః పరనిర్వృతియే మున్నెన్నదగినది. ఉపదేశమానుషంగిక ప్రయోజనము. ఇది ప్రామాణికాలంకారికుల నిర్ణయము.

"ఆనంద ఏవ పారమార్థిక ఫలమ్" – ఆనందవర్ధనుడు.

సాహిత్య చరిత్ర – యుగవిభజనము – యుగకర్తలు

మన వాఙ్మయమందలి కావ్యజాలము నెల్లనొక జీవనదిగా నూహించి, యది యెక్కడ ఏ సన్నపాయగ నుద్భవించినదో, ఏ కొండసందులలో సన్నగిల్లినదో, ఏ పచ్చ బయళ్ళలో విశాలముగ ప్రవహించినదో, మధ్యేమార్గమున దానికే యుపనదులు కలసినవో, తత్తీరములందు సుక్షేత్రములను, తీర్థములను ప్రతిష్ఠించిన కర్తలెవ్వరో విచారించి చర్చించుటయే వాఙ్మయ చరిత్ర.

ఆ వ్యవస్థాంతరములకు కర్తలే యుగకర్తలనియు శకకర్తలనియు వ్యవహరింపబడుచున్నారు.

ఎవని పేరనొక కాలమున కవి వంశము ప్రతిష్ఠ సంపాదించినదో, యెవడు త్రొక్కిన మార్గమును తరువాతివారు శిష్యధర్మముగ ననుసరింతురో, యెవడు కారణజన్ముడగునో, యెవడు సూత్రధారుడై భాషా సరస్వతిని నూతనాలంకారములతో రంగమున ప్రవేశపెట్టునో, యెవడు రూపుమాయుచున్న సాహిత్యమునకు జీవము పోయునో అట్టివాడే యుగకర్తగా నుండుట కర్షుడు. ఒక మహావంశమున వంశకర్త లెట్టివారో, వాఙ్మయమున యుగకర్త లట్టివారు. వీరు ఒక యుగమునకు ఆదిపురుషులై యుండనక్కరలేదు. ఆ యుగమునందు ఆది మధ్యాంతములలో యెటనున్నను, తలమానికములైయున్న చాలును. యుగకర్త యుగమునకు ప్రథముడు కానక్కరలేదు. ప్రధానుడై యున్న చాలును. ఆ విధముగా వాఙ్మయసేవవలన కీర్తి నొంది సాహిత్యరూపవికాస పరిణామములకు దోహదమిచ్చిన మహాపురుషులను దృష్టియందుంచుకొని, వాఙ్మయమందలి ఆయాదశలను చూపుటకు యుగవిభజనము చేసి ఆ యుగములకట్టి మహాపురుషులను యుగకర్తలనుగా నిర్ణయించుట సహేతుకము. ఆ యుగములను వారిపేరుల మీద వ్యవహరించుటయు సమంజసము.

సాహిత్యములో యుగవిభజన కొన్ని సంవత్సరముల పరిమితితో కూడినది. కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ ఆంధ్రకవుల చరిత్రలో కవులను మూడు తెగలుగా విభజించియున్నారు.

1) పూర్వకవులు - నన్నయ మొదలు పెద్దన వఱకు (క్రీ॥శ॥ 1100 - 1500)
2) మధ్యకవులు - పెద్దనాదులు (క్రీ॥శ॥ 1500 - 1700)
3) అధునిక కవులు - కూచిమంచి తిమ్మనాదులు (క్రీ॥శ॥ 1700 - 1900)

పై వర్గీకరణము నిర్దుష్టము గాదు. మనకుపాదేయమును గాదు. ఇందు యుగకర్తలకు ప్రాధాన్యము లేకపోవుట దోషము. పూర్వకవులలో నన్నయ మొదలు పెద్దన వఱకు గల కవులనెల్లనొక గుంపుగా చేర్చినచో వారి కవిత్వమంతయు నొకజాతి కవిత్వమను భ్రమ కలుగును. నన్నయ కవిత్వమునకు శ్రీనాథుని కవిత్వమునకు నెంతయో భేదము కలదు. కావున పై వర్గీకరణమున వాఙ్మయావస్థాంతరములు విస్మరింపబడినవి. మధ్యకవులనగా కందుకూరి వారి దృష్టిలో ప్రబంధకవులని యర్థము. కాని విజయనగర ప్రబంధములకు, తంజావూరు ప్రబంధములకు చాల భేదము కలదు. మఱియు తంజావూరు గేయ, గద్య, యక్షగానాది వాఙ్మయ ప్రక్రియలకు సుక్షేత్రముగ వెలసినది. కావున పై వర్గీకరణమున వాఙ్మయరూపవికాస పరిణామములకు ప్రాధాన్యము లేదు. అధునిక కవులలో కూచిమంచి తిమ్మనాదులు చేరిరి. కూచిమంచి తిమ్మన కవిత్వములో అధునిక కవిత్వము నేతిబీరకాయ. మన దృష్టికి కందుకూరి వారే నవీనులలో ప్రథములు. కావున కందుకూరి వారి యుగవిభజనము స్థూలము. వర్జ్యము. అంతమాత్రమున వారిని కొఱత పరచుచున్నామని యర్థము కాదు. చారిత్రిక సామగ్రి చాలని ఆ రోజులలో వారి ప్రయత్నము వారి ప్రతిభకు కీర్తితెచ్చినది.

వాఙ్మయప్రక్రియా విశిష్టతను బట్టి కొందఱు చరిత్రకారులు వేరొక విభజనము చేసిరి. స్థూలదృష్టితో వాఙ్మయమును పురాణ యుగము, ప్రబంధయుగము నని విభజించి వీనికి పర్యాయపదములుగ భాషాంతరీకరణయుగము, స్వతంత్రయుగము నని క్రమముగా నుడివిరి. ఈ యుగ విభజనము బహుస్థూలము, పాక్షికమును.

ఆంధ్ర సారస్వతము రాజాశ్రయముచే వికసించెనను నంశమును పురస్కరించుకొని మఱికొందఱు చరిత్రకారులు ఆయారాజుల పేర్ల మీద చాళుక్యయుగము, కాకతీయయుగము, రెడ్డియుగము నని యుగవిభజనము చేసిరి. ఈ విభజనమందు మహాకవుల నామములు మఱుగుపడును. ఏ

రాజవంశమునందైన ఒక రాజు ప్రశస్త కవియై, కవి పోషకుడైనచో నాతని యుగము నతని పేర బిలువవచ్చును. కాని యుగము నెల్ల నతని వంశము పేర పిలుచుట సముచితము కాదు. కావున ఈ విభజన మసమ్మతము.

"కవిత్వవేదికృత ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము" న చాళుక్య చోడయుగము – పురాణ కవిత్వము, రెడ్డి, నాయక, కర్ణాట యుగము – కావ్య ప్రబంధ కవిత్వము, అర్వాచీన కవిత్వము, నవ్య కవిత్వము నని రాజవంశములను, కావ్య భేదములను కలిపి విభాగము చేయబడినది. ఈ విభజనము కూడ సముచితము కాదని పైని చెప్పిన యంశముల వలన తెలియుచున్నది కదా! కాశీనాథుని వారు ఆంధ్ర వాఙ్మయమును అజ్ఞాత యుగము (క్రీ॥శ॥ 1050 వఱకు), ఆదియుగము (క్రీ॥శ॥ 1050 – 1450), మధ్యయుగము (క్రీ॥శ॥ 1500 – 1700), ఆధునికయుగము (క్రీ॥శ॥ 1750 – – –) నని నాలుగు విధములుగా విభజించిరి. ఈ యుగ విభజనము వారూహించి చేసినట్టిదే. కారణములను చూపరైరి. మఱియు వారు భావవ్యాప్తి ననుసరించి జ్ఞానయుగము, భక్తియుగము, శృంగారయుగము, సంకరయుగము నను విభజనము గావించిరి. ఈ విభజనము కాలక్రమముగ చేయుట ఆంధ్ర వాఙ్మయ వికాసమును సూచించుటకు తగినట్టిది కాదు. ఇది గ్రంథకాలములను గణింపక ఆయా తరగతులక్రింద గ్రంథములను వర్గీకరించుటకు మాత్ర మనుకూలించును. కాని వాఙ్మయచరిత్రలో క్రమ విభజనమున కనుకూలింపదు. కావున ఈ విభజనము దోషభూయిష్ఠము.

ఇక నిర్దుష్టయుగ విభజమెట్లు గావింపదగును? దీనికి సమాధాన మొసగుటకు ముందు మనము కొన్ని యంశములను, కొన్ని ప్రధాన సూత్రములను పరిగణింపవలయును.

1. యుగవిభజనములో మహాకవులకు ప్రాధాన్యమొసగి వారి పేర శకములను పిలుచుట.

2. వాఙ్మయ ప్రవాహమెచ్చట గుర్తింపదగిన మార్పులను పొందెనో అచ్చట నా యుగమునకు సరిహద్దు నేర్పరచుట.

3. సమాన ప్రతిపత్తి గలిగిన కవు లేకకాలమున అసమాన ప్రతిభల చూపినచో ఆ యుగమునకు ఆనాటి వాఙ్మయ ప్రక్రియను బట్టియో లేక రాజాశ్రయమును బట్టియో నామకరణము గావించుట.

4. రూపుమాయుచుండెడు వాఙ్మయమునకు జీవము పోసిన ప్రతిభా సంపన్నులకు కృతజ్ఞత చూపి వారి పేర యుగములను పిలుచుట.

పై సూత్రముల నాధారముగా గొని ఆంధ్ర వాఙ్మయ చరిత్రను ఈ క్రింది యుగములుగా విభజింపవచ్చును.

| | | | |
|---|---|---|---|
| 1) | ప్రాఙ్నన్నయ యుగము | – | క్రీ॥శ॥ 1000 దాక |
| 2) | నన్నయ యుగము | – | క్రీ॥శ॥ 1000 – 1100 |
| 3) | శివకవి యుగము | – | క్రీ॥శ॥ 1100 – 1250 |
| 4) | తిక్కన యుగము | – | క్రీ॥శ॥ 1250 – 1325 |
| 5) | ఎఱ్ఱన యుగము | – | క్రీ॥శ॥ 1325 – 1400 |
| 6) | శ్రీనాథ యుగము | – | క్రీ॥శ॥ 1400 – 1500 |
| 7) | శ్రీకృష్ణదేవరాయల యుగము | – | క్రీ॥శ॥ 1500 – 1600 |
| 8) | దక్షిణాంధ్ర యుగము | – | క్రీ॥శ॥ 1600 – 1775 |

9) క్షీణ యుగము - క్రీ॥శ॥ 1775 - 1875
10) నవీన యుగము - క్రీ॥శ॥ 1875 - ......

ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు పాటించిన ఈ యుగ విభజనమును నాటి నుండి నేటి దాక విద్వాంసులామోదించిరి.

ఆంధ్రము - తెనుఁగు - తెలుగు

ఆంధ్రము, తెనుఁగు, తెలుగు అను మూడు పేర్లు మన యాంధ్రభాషకు కలవు. ఈ మూడు పేరులు నేకార్థ బోధకములే. ఇవి సామాన్యజన వ్యవహారముననే కాక పండిత లోకము నందును, సాహిత్య ప్రపంచము నందును ఏకభాషా బోధకములుగా నున్నవి.

ఆంధ్రము:- ఈ మూడు శబ్దములలో మిక్కిలి ప్రాచీనమైనది ఆంధ్ర శబ్దము. ఈ యాంధ్ర శబ్దము ఋగ్వేదమందలి ఐతరేయ బ్రాహ్మణమున జాతిపరముగా నుపయోగింపబడినది. విశ్వామిత్రుడు శునశ్శేపుని తమ జ్యేష్ఠ సోదరునిగా అంగీకరింపని తన మొదటి ఏబదిమంది కుమారులను ఆర్యాశ్రమబాహ్యులనుగా శపించెను. అనగా వారిని ఆర్యాశ్రమము నుండి వెళ్ళగొట్టెనని యర్థము. తన కుమారుల వంశస్థులు పుళిందులు, శబరులు, పుండ్రులు, ఆంధ్రులు లోనగు వారగుదురని విశ్వామిత్రుడు శపించెను. వారధములు నగుదురనియు ననెను. దీనినిబట్టి ఆంధ్రు లొకజాతి జనులనియు, అధములనియు తేలుచున్నది. పైని చెప్పిన పుళిందాదులు ఆర్యేతరులు. కావుననే విశ్వామిత్రుడు తన సంతతి వారిని అనాగరకులు, ఆటవికులు నైన వారిలో కలసిపొండని శపించెను. క్రీస్తు పూర్వము 6, 7 శతాబ్దుల ప్రాంతములో ఐతరేయ బ్రాహ్మణకాలము నాటికి ఉత్తరాపథమున ఆదిమవాసులతోడి సంపర్కము వలన వేద వ్యతిరేకాచారము లవలంబించుటచే బహిష్కరింపబడిన ఆర్యులును, శాపహతులైన విశ్వామిత్ర సంతతి వారును కొందరు ఆర్యావర్త దేశమును వీడి వింధ్యకు దక్షిణ భాగమున నివాసమేర్పరచుకొని అచ్చటనున్న ఆంధ్రులు, పుళిందులు మున్నగువారితో కలసి నివసించుచుండిరి. మొత్తము మీద ఐతరేయ బ్రాహ్మణము రచించుటకు ముందే ఆంధ్రులు ఆర్యులకు పరిచితులనియు వారు పతితులయి ఆర్యజాతికి దూరులై ఆచార వ్యవహారము లందు ఆర్యుల కంటె భిన్నులైరనియు చెప్పవలయును. క్రమముగా సాహసవంతులు, యోధులు నైన యాంధ్రులు దండకారణ్యమున ప్రవేశించి, నివాస ప్రదేశములకై దక్షిణమునకు వెదకుచు వచ్చి, కృష్ణా గోదావరీ నదుల మధ్యనున్న సారవంతపు భూముల యందు స్థిరనివాసమేర్పరచుకొని అచ్చటి పూర్వనివాసులతో సఖ్యభావమున నివసించిరి. ఆ పూర్వనివాసులే నాగులు, రాక్షసులు, వానరులు మున్నగువారు.

మహాభారతము నందును, రామాయణమునందును పాండ్య, చోళ, కేరళులతో ఆంధ్రులు కూడ పేర్కొనబడిరి. అశోకుని పదుమూడవ ధర్మలిపి శాసనములో ఆంధ్ర శబ్దము జాతిపరముగా వాడబడినది. ఆంధ్రులు తన రాజ్యమున నివసించుచున్నట్లును బుద్ధ ధర్మము ననుసరించుచున్నట్లును అశోకుడా శాసనమున తెలిపెను. మనుస్మృతిలో కారావర స్త్రీయందు వైదేహునకు పుట్టి వేట వలన జీవించు వారాంధ్రులని చెప్పబడినది. మనుస్మృతిని బట్టియు ఆంధ్ర శబ్దము జాతిపరమే యని చెప్పక తప్పదు. పురాణములందు సయితము ఆంధ్ర శబ్దము జాతివాచకమే.

ఇంతవరకు చెప్పిన ప్రమాణము లన్నియు ఆంధ్ర శబ్దమును జాతిపరముగానే నిరూపించుచున్నవి గాని దేశమునకు గాని, భాషకు గాని సంబంధమును నిరూపించుటలేదు. ఇది మిక్కిలి ప్రాచీనావస్థ.

జాతిపరమైన ఆంధ్ర శబ్దము పిదపదేశవాచకమైనది. పల్లవ యువమహారాజగు శివస్కందవర్మ

వేయించిన మైదవోలు తామ్రదాన శాసనములో "అంధాపథీయో" అని కలదు. అంధపథ మనగా అంధ్ర పథము లేక ఆంధ్ర పథము అని యర్థము. అంధ్ర పథ మనగా ఆంధ్రదేశమని యర్థము. తరువాతి శాసనములలో ధారాళముగా ఆంధ్ర శబ్దము దేశవాచకముగా ప్రయోగింపబడినది. మల్లదేవనందివర్మ అను నాతడు వ్రాయించిన దానశాసనములో **"ఆంధ్ర మండలే ద్వాదశ సహస్ర గ్రామ సంపాదిత సప్తార్థ లక్ష విషయాధిపతేః"** అని యున్నది. శివస్కందవర్మ శాసనమున అంధ్ర పథ మనబడిన దేశము నందివర్మ శాసనమున ఆంధ్ర మండలమైనది.

అంధ్రము, ఆంధ్రము అను రెండు నామములును శాసనములలో కలవు. అంధ్ర పదమే మొదటిదనియు, ఆంధ్ర పదము తరువాతిదనియు నొకయూహ కలదు. క్రీ॥శే॥ 1072 లో నిర్మించిన యశః కర్ణదేవుని **"ఖైరా"** తామ్రశాసనములో **"ఆంధ్రాధీశమ్ అరంధ్ర దోర్విలసితమ్ భ్రూవల్లి గోదావరీ"** అని యున్నది. తరువాత ఆంధ్ర మనునదే సుప్రసిద్ధమై గ్రంథములకెక్కినది.

నన్నయ కాలము నాటికి ఆంధ్ర శబ్దము భాషావాచకమైనది. నన్నయ స్వయముగా రచించిన నందమపూడి శాసనము నారాయణభట్టును **"యః సంస్కృత, కర్ణాట, ప్రాకృత, పైశాచికాంధ్ర భాషాసు కవిశేఖర ఇతి ప్రథితః"** అని ప్రశంసించుచున్నది. తిక్కన నన్నయను **"ఆంధ్రకవిత్వ విశారదుండు"** అని ప్రశంసించెను. మఱియు నాతడే **"ఆంధ్రావళి మోదముంబొరయునట్లుగ"** మహాకవిత్వదీక్షతో వ్యాసభారతము తెనిగింతునని ప్రతిజ్ఞావించెను. తిక్కన రెండుమారులు ప్రయోగించిన ఆంధ్రపదములలో మొదటిది భాషావాచకము. రెండవది జాతివాచకము.

**తెలుగు:-** తెలుగు అనుపదమును ప్రాచీన కవులెక్కువగా నుపయోగించిరి. తిక్కన **"తెలుగు కవిత్వము చెప్పందలచిన కవి"** అని నిర్వచనోత్తర రామాయణములో ప్రాసస్థానమున ప్రయోగించెను. కేతన తన ఆంధ్రభాషాభూషణమున **"తెలుగునఁ గల భేదంబులు"** అని ప్రాసఘటితముగా వాడెను. **'తెలుగు'** అను శబ్దమును పాల్కురికి సోమనాథుడు ప్రాసస్థానమున నుపయోగించెను. కాని ఈ ముప్వురి కంటె ముందున్న వాడగు నన్నయభట్టు మాత్రము ప్రాసస్థానమున **'తెనుగు'** అను శబ్దమునే వాడెను. అంతమాత్రమున ఆనాడు తెలుగు శబ్దము వాడుకలో లేదని భావింపరాదు. క్రీస్తు పూర్వపు శాసనములలో తెలుగు శబ్దము "తిలింగ, తెలింగ" మున్నగు వికారములతో కన్పట్టుచున్నది. ఇక తెలుగు శబ్ద వ్యుత్పత్తిని గూర్చి విచారించవలెను.

తెలుగు శబ్దము త్రిలింగశబ్ద భవమనియు, ఆ త్రిలింగ శబ్దము దేశవాచకమనియు ప్రాచీనులు తలంచిరి. విద్యానాథుడు, విన్నకోట పెద్దన, అప్పకవి మున్నగువారు ఆంధ్రదేశమునకు త్రిలింగ దేశమను పేరు కలదని వక్కాణించిరి. మొదటి చూపులో ఈ త్రిలింగ శబ్దము నుండియే తెలుగు శబ్దము పుట్టినదేమో అను భ్రాంతి కలుగును. కాని కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారు తెలుగు శబ్దమే ప్రాచీన మనియు దాని నుండియే త్రిలింగ శబ్దము కృత్రిమముగా కల్పింపబడినదనియు స్పష్టముగా చెప్పిరి. ఏలయన తెలుగు పేరులను సంస్కృతీకరించు సంప్రదాయము ప్రాచీన కాలము నందే ఏర్పడినది.

త్రికళింగ శబ్దము నుండి తెలుగు శబ్దమేర్పడినదని కొందరు విద్వాంసులు తలంచిరి. గోదావరికి నుత్తరమున మహేంద్రగిరి వరకు నున్న దేశమునకు కళింగమను పేరు పూర్వకాలము నందే కలదు. కళింగములు మూడనియు అవి ఉత్కళింగము, మధు కళింగము, కళింగము ననియు చరిత్రకారులు నిరూపించిరి. త్రికళింగ శబ్దమే భిన్నరూపములను పొంది తెలుగు కావచ్చును. త్రికళింగ = తి అలింగ = తెలింగ = తెలుంగు

మఱికొందరు తెళి + అగు = తెలుగు అని అనిరి. తెళియనునది ద్రావిడభాషాధాతువు. దానికి తెలియు, తేట అని అర్థములు. తేట యగునది తెలుగు అయినదన్నమాట.

మఱికొందఱు తిలలవలె నుండు గోవులు, సహస్ర సంఖ్యాకములుగా ఏ దేశమున నున్నవో ఆ దేశము తెలుగు దేశమని చెప్పిరి.

ఇంక కొందఱు "తేల్" అనునది యొకటి కలదనియు, దాని యొద్దున కొంతకాలము నివసించి తరువాత ఈ దేశమునకు జనులు వచ్చుటచే వారు తెలుగు వారైరనియు చాటిరి. ఈ వ్యుత్పత్తు లన్నియు పాండిత్యస్ఫోరకములే కాని సత్య సన్నిహితములు కావు.

"టాలెమీ" యను గ్రీకుదేశపు భూగోళశాస్త్రజ్ఞుడు తన గ్రంథములో ఈ దేశమును వర్ణించుచు "ట్రీ లింగాన్" అని అనెను. ఈ శబ్దము త్రిలింగ శబ్దమునకు దగ్గరగా నున్నది. ఈ త్రిలింగ శబ్దమే "తిరిలింగ" అను రూపమును కూడ పొందినది. క్రీ॥శ॥ 1027 సంవత్సరమున ఇంద్రవర్మ వేయించిన పుర్లీ తామ్రశాసనములో "తిరిలింగ వాస్తవ్యాయ" అని కలదు.

ఇటీవలి పరిశోధనల వలన తెలుగు శబ్దము యొక్క ప్రాచీనార్థమును తెలిసికొనుటకు వీలగుచున్నది. ప్రాచీన కాలమున ఈ దేశమునందు "తలైంగ్" అను శూరజాతి నివసించెను. వీరు సముద్రములు దాటి బర్మాది దేశములలో వలసలు స్థాపించిరి. తలైంగ్ జాతివారి నివాసభూమియే తెలుంగు దేశమని వ్యవహరింపబడి యుండును. ఈ శబ్దమే తిల్లింగ, త్రిలింగ శబ్దములకు మూలమని యూహింపవచ్చును. తలైంగ్, తలేంగ్ అనగా నేమి? తల యనగా శిరస్సు. తల స్థానము నాక్రమించినవారు అనగా నాయకులైన జనులు తలయింగులు, తలేంగులు అగుదురు. వీరే పిదప తెలుంగులు, తెలుగులు నైరి.

**తెనుఁగు:-** ఇక తెనుఁగు శబ్దమును గూర్చి చర్చింపవలయును. నన్నయ ఆదిపర్వాదినే "తెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్" అని నకారము ప్రాసఘటితముగా నుపయోగించెను. తిక్కనయు విరాటపర్వాదిని 'తెనుఁగుంబాస', తెనుఁగు బాస వినిర్మింపఁదివురుటరయ" అని ప్రయోగించెను. నన్నయ తన గ్రంథమున ప్రాసస్థానమున నకారము వచ్చునట్లు తెనుఁగు శబ్దమును వాడుటయు, తిక్కన వాడుకలో తెనుఁగు అను రూపము కనుపట్టుటయు, తెలుగు అను శబ్దము లకారముతో ప్రాసస్థానమున కనుపట్టకుండుటయు చూడగా 'తెలుఁగు' శబ్దము కంటె 'తెనుఁగు' శబ్దమే ప్రాచీనమేమో యను ఊహ కలుగును.

ఇట్టి యూహ కలుగుటకు కారణము లేకపోలేదు. ద్రావిడభాషలలో నకారము లకారమగుట, లకారము నకారమగుట చూపట్టును.

మునగ - ములగ, మునుగు - ములుగు, పనవు - పలవు

కాని ఈ మార్పును బట్టి తెనుఁగు ప్రాచీనమని చెప్పుట యుక్తము కాదు. తెనుఁగు తెలుగైనదని యననేల? తెలుగు తెనుఁగు కావచ్చును కదా!

తేనె+అగు అను శబ్దముల కూడిక వలన తెనుఁగు శబ్దమేర్పడెనని కొందరు విద్వాంసులొక వ్యుత్పత్తిని చెప్పిరి. ఈ వ్యుత్పత్తిని మొదట నెవ్వరు చెప్పిరో తెలియదుగాని ఇది గ్రియర్ సన్ రచించిన "లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా" (.....) అను బృహద్గ్రంథములో తార్కాణింపబడినది. దీనినే పండిత ప్రోక్తముగా కాల్డ్వెల్ దొర ఉదాహరించెను. ఈ వ్యుత్పత్తికి ప్రామాణ్యము లేదు.

"త్రినగ" మను శబ్దమును బట్టి తెనుంగు పదము కలిగినదను వాదము కలదు. ఈ వాదము నంగీకరించినచో మూల శబ్దమునందు లేని ఖండబిందువు వికృతిలోనెట్లేర్పడినదో నిరూపింపవలయును. ఈ నిరూపణము సాధ్యము కాదు. అదియును గాక త్రినగ శబ్దమునకు ప్రాచీన వ్యవహారముగాని, గ్రంథప్రామాణ్యముగాని లేదు. అందాక నీ వ్యుత్పత్తి నంగీకరింపజాలము.

ద్రావిడభాషలలో "తెన్" అనుపదము కలదు. దీనికి దక్షిణ దిక్కు అని యర్థము. ఈ పదము దిక్కు అను అర్థమును ఆంధ్రభాషలో లేదు. కాని కర్ణాట, మలయాళ, తమిళ భాషలలో ఈ పదము అనేక రూపములతో విస్తృత ప్రచారములో కలదు. ఈ పదమును బట్టి తెనుగు అనురూపము ఏర్పడినదని కొందరు పండితులు చెప్పిరి.

విశ్వామిత్ర సంతతివారు ఆంధ్రాది కిరాతజాతులలో కలసిపోయిరని ఐతరేయ బ్రాహ్మణము చెప్పుచున్నది గదా! ఆ ఆంధ్రులు సాహసులై దక్షిణా పథమునకు వచ్చి ఇక్కడ నున్న దేశీయులను జయించి రాజ్యములను స్థాపించిరి. అనగా ఆంధ్రులు పాలకులైరి. వారు ఉత్తరాపథము నుండి వచ్చిరి. ఇక పాలితులలో మొదటి నుండియు దక్షిణ దిక్కునందే యున్నారు కదా! ఆ పాలితులు తమ్ము పరిపాలించునాంధ్రుల నుండి భిన్నముగా చూపుటకై తమ్ము దక్షిణ దిక్కున నున్న వారు అను నర్థమున తెనుంగు- వారుగా వ్యవహరించు కొనుచుండిరని యూహింపవచ్చును. అప్పుడు తెన్ అను దిక్కున నున్నవారు తెనుంగు వారగుదురు. అట్టిచో మొదట తెనుంగు శబ్దము మొదటి జాతి వాచకమై పిదప భాషా, దేశవాచకమైనదని చెప్పవలయును. సారాంశమేమనగా దిగ్వాచియగు 'తెన్' అను మూలద్రావిడ భాషాపదము నుండి తెనుంగు శబ్దమేర్పడినది.

-0-

14




నన్నయ యుగము పదునొకండవ శతాబ్ది నుండి ప్రారంభమగుచున్నది. తత్పూర్వము అనగా శాతవాహనుల కాలము నుండి నన్నయ వరకు గల కాలమును ప్రాఙ్నన్నయ యుగమని వ్యవహరించుచున్నారు. ఈ యుగమునందలి వాఙ్మయమును గూర్చి మనకేమియు తెలియదు. కాన దీనిని కొందఱు అజ్ఞాతయుగమని కూడ పిలుచుచున్నారు. ఈ యుగమున గల వాఙ్మయస్థితి ఏమి అనునదియే మీమాంస.

ప్రాఙ్నన్నయ యుగము నందలి వాఙ్మయగ్రంథము లేవియు మనకు లభింపలేదు. జైనులు, బౌద్ధులు రచించిన గ్రంథములను వైదికులు నాశము చేసిరను వాదము కలదు. కాని ఇట్లనుటకాధారములు శూన్యము. శాతవాహనులు, బృహత్ఫలాయనులు, ఇక్ష్వాకులు, పల్లవులు, శాలంకాయనులు, తూర్పుచాళుక్యులు మున్నగువారే యాంధ్రదేశము నేలిరి. ఈ రాజవంశములవారి శాసనములు మనకు లభించుచున్నవి. వీనిని బట్టియే ప్రాఙ్నన్నయయుగమందలి యాంధ్ర సాహిత్యస్థితిని గూర్చి మనము కొంత యూహింపవచ్చును. దీనికి తూర్పుచాళుక్యుల వఱకు నాయారాజవంశములవారు వేయించిన శాసనముల సముదాయమును ఒక ఘట్టముగా భావింపవచ్చును.

శర్వవర్మతోడి వివాదమున గుణాఢ్యుడు సంస్కృత ప్రాకృత దేశభాషలను త్యజింతునని ప్రతిజ్ఞ చేసెను. ఆ దేశభాష ఆంధ్రము కావచ్చునని యొక యూహ కలదు. ప్రతిజ్ఞానుసారము గుణాఢ్యుడు భాషాత్రయమును వీడి పైశాచి ప్రాకృతము నందు బృహత్కథను రచించెను. వింధ్యపర్వత ప్రాంతము నందలి యనాగరికజాతుల భాషయే పైశాచియనియు, అదియే ఆంధ్రభాషకు మాతృకయనియు కొందఱు పండితులు చెప్పుదురు.

శాతవాహనచక్రవర్తి యగు హాలుడు మహారాష్ట్రి ప్రాకృతము నందు "గాథాసప్తశతి" అనుపేరు గల సుందర ప్రాకృతకావ్యమును సంకలించెను. దానిలో ఏడువందల గాథలు గలవు. ఈ గాథాసప్తశతిలో తద్భవములు, దేశ్యములు నగు తెలుఁగు పదములు గలవు.

| తద్భవములు | దేశ్యములు |
|---|---|
| అందము | అత్త |
| రోసము | అమ్మ |
| మొహము | పాడి |
| జరము | పొట్ట |
| నిక్కువము | పిల్ల |

ఈ తద్భవములు, దేశ్యములు తెలుఁగు మాటలే కదా!

తూర్పుచాళుక్యుల వఱకు తెలుగు దేశము నేలిన రాజవంశముల వారి శాసనములలో గ్రామనామములు, సీమానామములు తెలుఁగు మాటలు. ఈ మాటలు కూడ లభింపనిచో ప్రాచీనాంధ్రభాషా స్వరూపము సంపూర్ణ సూర్యగ్రహణమైయుండెడిది.

సామాన్యముగా తెలుగు గ్రామనామముల చివర ఊరు, పఱ్ఱు, మఱ్ఱు, పాడు, పూడి, చెఱువు మొదలగు పదములుండును. తూర్పుచాళుక్యులకు ముందు తెలుగుదేశము నేలిన

రాజులశాసనములలో గ్రామనామములు పైపదములతో కూడియుండుట చూతుము. విఱిపఱ, తాన్టికొన్డ, ఱెందులూరు, కంబురాం చెఱువు మున్నగు గ్రామనామము లిందుకు తార్కాణములు. పురుషనామములలో కూడ తెనుఁగు దనము దోబూచులాడుచున్నది. గొలశర్మ, కొట్టిశర్మ వంటి నామములు తెలుఁగునకు చాల సమీపమున నున్నవి. మహోతలవర, తగవర శబ్దములు తలారి రూపమందినది. ప్రాచీన కాలమున దానికి సేనాపతి, నాయకుడు అని యర్థములు. తగవర శబ్దము న్యాయాధీశుని సూచించుచున్నది.

ఈ శాసనములలో మఱియొక విశేషమేమనగా దేశ్యపదములలో వినవచ్చిన ప్రత్యేక ధ్వనులను కూడ చెక్కుటకు శ్రద్ధవహించుట ఆ కాలమున "డి, ఱ, ఙ, ళ" యను వర్ణములు విశేషముగ వాడబడుచుండెను. వీనిలో మొదటివర్ణము వాడుక నుండి తొలగిపోయినది. అది ద, డ వర్ణములుగా మారినది. తాన్డికొన్డ అను రూపము తాడికొండగా పరిణమించినది. డెందులూరు అను పదము దెందులూరుగా పరిణమించినది. విష్ణుకుండినుల శాసనములలో నొకదాని యందు "విజయరాజ్య సంవత్సరంబుళ్" అని కలదు. ఇందలి తుది ళకారము ఇప్పుడు మనము బహువచన ప్రత్యయముగా వాడుచున్న 'లు' వర్ణకము యొక్క పూర్వరూపము. మహద్వాచక శబ్దములకు తుదిని ఏకవచనము నందుఁడు వర్ణకము చేరుచున్నది. ఈ డు వర్ణకము యొక్క ప్రాచీనస్థితి వింతగా కనుపట్టును. పూర్వశాసనములందిది "న్డు" అనురూపములో నుండెను. ఉదా:- సత్యాదిత్యన్డు, మగన్డు.
'న్డు' అనురూపము మొదట 'ణ్డు' గా మారి పిదప డు వర్ణకముగా రూపొందినది.

తూర్పుచాళుక్యులు క్రీ.శ.625 నుండి ఆంధ్రదేశమును పాలించిరి. వీరు తెనుఁగును రాజభాషగా చేసిరి. అంతేగాక రాజశాసనములను తెలుఁగు భాషయందే వ్రాయించిరి. ఈ కాలముననే రేనాటి చోళులనువారు కడప, కర్నూలు మండలములలో కొంతభాగము నేలుచుండిరి. క్రీ.శ.6వ శతాబ్దియందే వీరు కూడ తెలుఁగు నందే శాసనములు వ్రాయించిరి. మొత్తము మీద 7వ శతాబ్ది నుండి ఆంధ్రభాషయునికిని గూర్చి నిర్వివాదమైన సాక్ష్యము మనకు లభించుచున్నది. 7వ శతాబ్దినుండి నన్నయభట్టు కాలము వఱకు వెలువడిన శాసనములను రెండు రకములుగా విడగొట్టవచ్చును. కుబ్జవిష్ణువర్ధనుని కుమారుడు జయసింహవల్లభుని కాలము నుండి గుణగవిజయాదిత్యుని వఱకు వెలువడిన శాసనము లొకతెగకు చెందినవి. గుణగవిజయాదిత్యుని కాలము నుండి రాజరాజనరేంద్రుని వరకు గల శాసనములు మఱియొక తెగకు చెందినవి. గుణగవిజయాదిత్యుని కాలము నుండి రాజరాజనరేంద్రుని వఱకు గల శాసనములు మఱియొక తెగకు చెందినవి.

మొదటిదశలోని శాసనములు గద్యరూపములోనున్నవి. శబ్దజాలమును బట్టి చూచినచో ఇవి ప్రాకృతభాషాప్రభావమునధికముగా చూపించును. రెండవదశ యందలి శాసనములు గద్యపద్యాత్మకములుగా నున్నవి. నన్నయ అదరించిన చంపూ మార్గమిదియే. వీనిలో సంస్కృతభాషా ప్రభావమధికముగా కనపడును. సంస్కృత పదములు, దీర్ఘసమాసరచన, తత్సమ క్రియా ప్రయోగము మున్నగు లక్షణములు గోచరించును. ఈ తెగకు చెందిన అద్దంకి శాసనమునందు తరువోజయు, బెజవాడశాసనమున మధ్యాక్కరయు, ధర్మవరశాసనమున సీసపద్యమును లిఖింపబడినవి. దీనినిబట్టి నన్నయకవితామార్గము అయనకు ముందు రెండు శతాబ్దులనాడే ప్రారంభమైనదని చెప్పవచ్చును.

ఈ శాసనముల భాషయు దురవగాహముగా నున్నది. 'న' వ్రాయవలసినచోట 'ణ' వ్రాయుట కనబడును.
ఉదా:- పని-పణి, ఆనతి-ఆణతి
ఇప్పటి బహువచన ప్రత్యయమును 'లు' వర్ణము కదా! శాసనములలో అది "ళ్", "ళు" అను రూపములతో నున్నది.

ఉదా:- సంవత్సరంబుళ్, చెఱువుళు
అనాడు దీర్ఘమునకు హ్రస్వము, హ్రస్వమునకు దీర్ఘము వాడుచుండిరి.
ఉదా:- సాక్షి-సక్షి, మహారాజులకు-మహారాజులాకు.
దీనిని నిల్పి అనుటకు దెన్నిల్పి అని యనిరి. దీనికి అనుటకు బదులు తేనికి అని వాడిరి. రెడ్లు అనుటకు రట్టగుళ్లు అని వాడిరి. పాఱుడు (బ్రాహ్మణుడు) అనియనుటకు ఎఱుంబొది అనియు రూపములుండెను. ఇవి శాసన లేఖక ప్రమాదములుగావచ్చును. పూర్ణానుస్వారము వ్రాయుచోట ప్రాచీనశాసనములలో వర్గపంచమాక్షరము వ్రాయబడుచుండెను.
ఉదా:- పఞ్చమి, కార్తికేయుణ్ణు, వసన్తీశ్వరము.

నన్నయకు పూర్వము రసవత్కావ్యరచన లేకపోయినను పద్యరచన మాత్రము కలదని శాసనములను బట్టి స్పష్టమగుచున్నది. శాసనములందలి పద్యములే కాక ఇతర వాఙ్మయమీకాలమున నేమైన కలదా! ఉన్నదనియే చెప్పవచ్చును. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్రములో తుమ్మెదపదములు, పర్వతపదములు, ఆనందపదములు, శంకరపదములు, గొబ్బిపదములు, వెన్నెలపదములు మున్నగు వానిని పేర్కొనెను. ఆ కావ్యమున పర్వతప్రకరణమునందు శివభక్తులు శ్రీశైలము నెక్కుచు భక్తి రసోత్కర్షములైన పదములను పాడినట్లు కలదు. ఇవి కేవలము సోమనాథుని కాలము నాటివే కావు. తరతరముల నుండి వచ్చుచున్నవని చెప్పవచ్చును. ఈ పదములలో కొన్నియైన నన్నయకు పూర్వము నుండియు ప్రజల నోళ్లలో నలుగుచున్నవచ్చును. కావున ప్రాఙ్నన్నయ యుగమునందే పదకవిత్వము గలదని యూహింపనగును.

అపదకవిత్వము 'లోకుల రసనలెయాకులు'గా వెలసినదగుటచే గ్రంథస్థము కాకపోవుటచే దాని స్వరూపస్వభావమిట్టిదని చెప్పుట కష్టము. పదకవిత్వమే కాదు, పద్యకవిత్వమును ప్రాఙ్నన్నయయుగమున కలదనుటకు పండరంగని అద్దంకి శిలాశాసనాదులే ప్రమాణము. చంపూ రచనాధోరణియును అద్దంకి శాసనమున కన్పట్టుచున్నది.

అర్జునుడు దక్షిణదేశయాత్రను సలుపు సందర్భమున శ్రీపర్వత, దక్షారామక్షేత్రప్రసక్తి నన్నయభారతమున నున్నది. కావున నన్నయనాటికే ఈ క్షేత్రములు సుప్రసిద్ధములని తెల్లము. ఆ కాలమునకు పూర్వము నుండియే భక్తులు శ్రీపర్వతమున కేగుచున్నట్లు తెలియును. ఇందుచే ప్రాఙ్నన్నయ యుగము నందే భక్తులు పై పదములను పాడుచు శ్రీపర్వతము నెక్కినట్లూహింపనగును. కావున ప్రాఙ్నన్నయయుగము నందే పదకవిత్వము కలదని యూహింపనగును. దీని వలన భక్తి కారణముగను పదకవిత్వము ప్రాఙ్నన్నయయుగమున వెలసినదని తెలియుచున్నది.

-0-




**నన్నయ-అతని సమకాలికులు**

ఆంధ్ర సాహిత్యమునకు జనకుడని చెప్పదగిన నన్నయభట్టు తూర్పుచాళుక్యరాజగు రాజరాజనరేంద్రుని ఆస్థానము నలంకరించెను. రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరము రాజధానిగా క్రీ.శ. 1022 మొదలుకొని 1063 వఱకు వేంగీసామ్రాజ్యము నేలెను. ఇతని తండ్రి విమలాదిత్యుడు. తల్లి కుందమాంబ. రాజరాజనరేంద్రుడు చోళచక్రవర్తియైన రాజేంద్రచోళుని కుమార్తెయగు అమ్మంగదేవిని వివాహమాడెను. బలాఢ్యులైన చోళచక్రవర్తులతో వైవాహికసంబంధములుండుటచే నీతనిరాజ్యమునకు బలమధికమాయెను. ఇతని సవతి తమ్ముడగు విజయాదిత్యుడు రాజ్యకాంక్షియై పశ్చిమ చాళుక్యుల సహాయము పడసి ఇతనిపై దండెత్తెను. రాజరాజు చోళుల సాహాయ్యమున రాజ్యమును తిరిగి సంపాదించుకొనగలిగెను. ఈ సన్నివేశము క్రీ.శ.1030 ప్రాంతమున జరిగెను. రాజరాజ నరేంద్రుని రాజ్యావసాన కాలమున కూడ విజయాదిత్యుడిట్లే మఱియొకమాఱు చేసెను. చోళుల సహాయము పొందినను రాజరాజు స్వతస్సిద్ధముగ బలపరాక్రమశాలి. అందువలననే వైరివీరులీతనిని తలయెత్తి చూడలేకపోయిరి.

ధారానగరము రాజధానిగా మాళవదేశమునేలిన భోజమహారాజునకే రాజరాజనరేంద్రుడు సమకాలికుడు. ఈతడు తన కాలమంతయు పరరాజ్యాపహరణమునకై వినియోగింపక భోజరాజువలె కావ్యగీతిప్రియుడై సుఖతరముగ కాలము గడపెను. పూర్వచాళుక్యులు దాదాపుగా నందఱును వైదికమతావలంబులు. నాస్తికమతములైన జైనబౌద్ధములు నిలువనీడలేక తెలుంగు దేశమునుండి తొలగినవి. అందుచేత మతకలహము లేవియు ప్రజలను కలత పెట్టుట లేదు. దేశమునకు శాంతియు, రాజునకు మనస్స్వాస్థ్యమును చేకూరెను. దేశోపద్రవకరమగు సంఘటనలేవియు సంభవింపకపోవుటచే దేశమంతయు సుభిక్షముగ నుండెను. తన పూర్వులు ప్రారంభించిన వైదిక మతోద్ధరణమును, ఆంధ్రభాషోద్ధరణమును కొనసాగించుటకు దేశకాలపరిస్థితులు రాజరాజునకనుకూలముగ నుండెను.

రాజరాజనరేంద్రుడు వైదికమతమునకు మూలమైన "సమస్త వర్ణాశ్రమధర్మరక్షణ మహామహిమన్ మహినొప్పి" వేదవిద్యావ్యాప్తికై బ్రాహ్మణులకు అనేకాగ్రహారములిచ్చెను. చంద్రగ్రహణ పుణ్యకాలమున చీదమార్యుడను బ్రాహ్మణునకు రాజరాజు "కోరుమిల్లి" గ్రామమును దానము చేసెను. సంస్కృత, ప్రాకృత, కర్ణాట, పైశాచి కాంధ్ర భాషా కవిశేఖరుడగు నారాయణభట్టునకు నందంపూడిగ్రామమును, సంస్కృతభాషలో వీరాచార్యులు రచించిన 'గణితసారసంగ్రహము'ను తెనిగించిన పావులూరి మల్లనకు "నవఖండవాడ" యనుగ్రామమును దానము చేసెను. ఇట్లు రాజరాజు కవులను, పండితులనాదరించి యగ్రహారములిచ్చి భాషామతములను పోషించిన వాడగుటచే నన్నయభట్టు భారతములో నాతనిని

"...............................

అగ్రజన్ములకు ననుగ్రహమునఁ

ఆ.వె. జారుతర మహాగ్రహారంబులిచ్చుచు

దేవ భోగముల మహావిభూతి

దనరఁజేయుచిట్లు మనుమార్గుఁడగువిష్ణు

వర్ధనుండు వంశవర్ధనుండు."

అని వర్ణించెను.

## నన్నయభట్టు

రాజరాజనరేంద్రుని యాస్థానమున బహుశాస్త్రకోవిదులు, ఇతిహాసపురాణమర్మజ్ఞులు, సాహిత్యసరస్వతులు నెందరోయుండిరి. అందరిలోను నన్నయ యగ్రగణ్యుడు. ఆయనయే భారతావతారికలో తన్ను గూర్చి యిట్లు చెప్పికొనెను.

సీ॥ "తనకులబ్రాహ్మణు, ననురక్తు, నవిరళ
జపహోమతత్పరు, విపులశబ్ద
శాసను, సంహితాభ్యాసు, బ్రహ్మాండాది
నానాపురాణవిజ్ఞాననిరతు
పాత్రు, నాపస్తంబసూత్రు, ముద్గలగోత్ర
జాతు, సద్వినుతావదాత చరితు
లోకజ్ఞు, నుభయభాషా కావ్యరచనాభి
శోభితు, సత్ప్రతిభాభియోగ్యు

ఆ.వె. నిత్యసత్యవచను, మత్యమరాధిపా
చార్యు, సుజను, నన్నపార్యుఁజూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా
భరణుఁడిట్టులనియెఁగరుణతోడ."

ఇట్టి నన్నయభట్టారకుని

కం. జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధనిరూపితార్థమేర్పడఁ
దెనుఁగున రచియింపుమధిక ధీయుక్తి మెయిన్.

అని రాజరాజనరేంద్రుఁడడిగెను. నన్నయ తన శక్తిని శంకించుచు

చం॥ "అమలిన తారకాసముదయంబుల నెన్నను, సర్వవేదశా
స్త్రముల యశేష సారము ముదంబునఁబొందను, బుద్ధిబాహువి
క్రమమున, దుర్గమార్థజల గౌరవభారతభారతీ సము
ద్రముద్రతియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే.

అని పలికెను. పలికియు

"అయినను దేవా! నీయనుమతంబున, విద్వజ్జనంబుల యనుగ్రహంబునఁజేసి నా నేర్చు విధంబున నిక్కావ్యము రచించెద". అని ఇష్టదేవతాస్తుతి ప్రారంభించెను.

రాజరాజు, నన్నయ సత్సంకల్పము కలవారైనప్పటికి పూర్వాచారపరాయణులైన సంస్కృత పండితులు పంచమవేదమై, భగవద్గీత సహితమైయున్న మహాభారతమును దేవభాష నుండి దేశభాషకనువదింప నంగీకరించియుండరు. సంస్కృతపండితులు ప్రతిఘటించు సమయమున ఏకాకియైన నన్నయకు రాజరాజనరేంద్రుడే కాక నన్నయసహాధ్యాయి, సంస్కృత, ప్రాకృత, కర్ణాటాంధ్రాది బహుభాషలలో విద్వత్కవిశేఖరుడును, కవీభవజ్రాంకుశ బిరుదము కలవాడునగు నారాయణభట్టును తోడ్పడిరి. నారాయణభట్టును గూర్చి నన్నయ

ఉ॥ "పాయకపాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు, వాణసధరామరవంశవిభూషణుండు నా

రాయణునట్లు, వాఙ్మయ ధురంధరుఁడున్, దనకిష్టుడున్ సహా
ధ్యాయుఁడు నైనవాఁడభిమతంబుగఁదోడయి నిర్వహింపఁగన్

అని చెప్పెను.

భారతయుద్ధమున నాయుధమును పట్టకయే శ్రీకృష్ణుడు అనేకోపాయముల నెఱింగించి అర్జునునకు జయమబ్బజేసినట్లుగా, నారాయణభట్టు కూడ గంటము పట్టకయే ఉచితసమయంబులందు భారతాంధ్రీకరణమున నన్నయకు తోడ్పడియుండును. భారతావతారిక ప్రథమ పురుషలో నుండుటచే దానిని నారాయణభట్టు రచించెనని కొందరూహించుచున్నారు. కాని యిట్లు ప్రథమపురుషలో చెప్పికొనుట వినయసంప్రదాయార్థములను చాటును. భాగవత, రంగనాథరామాయణములలో కూడ ఇట్లే కలదు. నారాయణభట్టు భారతమును రచించియున్నచో అవిషయమును నన్నయ స్పష్టముగా చెప్పి యుండెడువాడుకాని, దానిని దాచునంతటి కృతఘ్నుఁడు కాడు. నారాయణభట్టు కర్ణాటాది బహుభాషలయందు పండితుడై, అయాభాషలలో భారతానువాదమెట్లు సాగినదో తెలిసినవాడగుటచే, ఔచిత్యపోషణమునకై భారతమునందేయే భాగములను పెంచి వ్రాయవలయునో, ఏయే భాగములను కుదింపవలయునో మున్నగు విషయములను చర్చించునపుడు శబ్దముల సాధుత్వాసాధుత్వములను నిర్ణయించునపుడు, ఛందో విషయమున, చంపూ మార్గరచనావిధానము నవలంబించినపుడు నన్నయకు మిత్రోపదేశము చేసి యతని పక్షమవలంబించియుండును గాని గంటమునుబట్టి భారతము వ్రాసి యుండడని నిశ్చయముగ నమ్మవచ్చును.

వేదవ్యాసుడు సంస్కృత భారతము నించుమించుగ నంతయు పద్యమయముగ రచించెను. కాని యాంధ్రమున నన్నయభట్టు భారతమును గద్యపద్యాత్మకముగ వ్రాసెను. ఈ మార్గమునే తరువాత అంధ్రకవులందరు ననుసరించిరి. నన్నయకు పూర్వమునందే "పెరిందేవనారు" అనునతడు తమిళమున భారతముననువదించెను. పంప, పొన్న, రన్న యను కవులు కర్ణాటభాషలో భారతాదిగ్రంథములు రచించిరి. వీరందరు చంపూ మార్గమునే చేపట్టిరి. మరియు నన్నయకు పూర్వము నందలి తెనుఁగు శాసనములు కూడ కొన్ని చంపూమార్గముననే వ్రాయబడినవి. కాబట్టి ఈవిధమైన రచన జనులయాదరమును బడసినదని గ్రహింపవచ్చును. బహుభాషావేదియైన నారాయణభట్టు అంధ్రమహాభారతమును గూడ చంపువుగ వ్రాయుమని నన్నయకు సూచించియుండవచ్చును. ఇన్ని కారణములచే నన్నయభారతమును చంపువుగా వ్రాసియుండును.

సంస్కృత భారతము

వ్యాసమహర్షి సంస్కృతభాషలో భారతమును రచించెను. ఆ మహర్షియే భారతమును 'జయ' అనియు, భారతమనియు, సంహిత అనియు వ్యవహరించెను. ధర్మార్థకామమోక్షములకు సాధనమైన గ్రంథముగాన ఇది 'జయ' అనబడినది. పూర్వమొకసారి దేవతలు భారతమునొకవైపున, చతుర్వేదములను మఱియొకవైపున నుంచి తులతూచినపుడు భారతమే ఎక్కువ బరువు కలిగియుండుటచే వ్యాసుడీగ్రంథమునకు భారతమని నామమిడెను. భరతవంశజుల చరిత్రమును చెప్పుటచేనిది భారత మయ్యెను. పూర్వము జరిగిన కథక్రమముగ నిందు చెప్పబడుటచే ఇతిహాసమనియు, వేదతుల్యత్వమును వేదార్థబోధకత్వమును దీనియందుండుటచే సంహితయనియు నామములు చెల్లినవి.

సంస్కృత మహాభారతమే అంధ్రమహాభారతమునకు మూలము కదా. కాలప్రవాహమున సంస్కృతభారతము బహువిధములగు కూర్పులకు, మార్పులకు లోనైనది. సంస్కృతభారతావతరణము నందు మూడు దశలున్నట్లు విమర్శకులు గుర్తించిరి.

వ్యాసుడు 'జయ' అను పేరుతో భారతేతిహాసమును సంస్కృతమున రచించెను. అది

యెనిమిదివేల యెనినిమిదివందల శ్లోకములు కలిగి నీతిబోధక గ్రంథముగ కాక చరిత్రగ్రంథముగ నుండెను. ఈనాడు మనకు లభించుచున్న భారతములో 57వ అధ్యాయముతో వ్యాసరచితభారతము ప్రారంభమైనదని విమర్శకులు గుర్తించిరి. C.V. వైద్య అను విద్వాంసుడు భారతమును గూర్చి ఇట్లు చెప్పెను.

"The original epic was probably in its nature a history and not a didactic work."

ఈ గ్రంథము రానురాను ప్రక్షిప్తముల కారణముగా వృద్ధి చెందినది. 8,800 శ్లోకములతో కూడిన మొదటి రూపమునకు 'జయ' అనియు, 24,000 శ్లోకముతో కూడిన దానికి 'భారత' మనియు, శతసహస్రశ్లోక సహితమైన దానికి 'మహాభారత' మనియు నామములుండెనని తెలుపు పండిత సంప్రదాయ మొకటి కలదు.

వ్యాసుడు మొదట జయేతిహాసము రచించి తన శిష్యులగు పైల, సుమంత, వైశంపాయన, జైమినులకు, పుత్రుడగు శుకునకు బోధించి వారిని లోకములో ప్రచారము చేయనియమించెను. వారు ఆయాలోకములకు వెళ్ళిరి. మనుష్యలోకములో జనమేజయ మహారాజునకు వక్కాణింపగా వ్యాసుడు వైశంపాయనుని నియమించెను. వైశంపాయనుడు సర్పయాగసమయమున జనమేజయునకు భారతమును వినిపించెను. అప్పుడే వ్యాసశిష్యుడైన రోమహర్షణునకు కుమారుడగు సౌతి మహాభారతమును విని నైమిశారణ్యమున శౌనకాది మహామునులకు వైశంపాయనుడు జనమేజయునకు వినిపించిన భారతమే మనకు సౌతి మూలమున లభించినది.

భారతపఠనవేళ జనమేజయుడు అనేక విషయములను గూర్చి వైశంపాయనుని ప్రశ్నించుటయు, వైశంపాయనుడాప్రశ్నలకు ప్రత్యుత్తరముగ దీర్ఘోపన్యాసములు చేయుటయు భారతమున కలదు. ఇట్లు వైశంపాయనుడు జనమేజయుడు వేడగా తెలిపిన విషయములు వ్యాసభారతమున నుండియుండవుగదా. కావున వైశంపాయనుడు వ్యాసభారతమును కొంతవరకు విస్తరించెను. వైశంపాయనుని భారతము 24000 శ్లోకములతో కూడియున్నదని విమర్శకుల యభిప్రాయము. ఇపుడు లభించుచున్న భారతము నందలి 54,55,56 అధ్యాయములను ఉపోద్ఘాతముగ వైశంపాయనుడు జనమేజయునకు చెప్పెనని పండితులు గుర్తించిరి.

వైదికధర్మప్రచారము, విజ్ఞానబోధ ప్రయోజనములుగ రచింపబడుటచే మహాభారతములో అనేక నూతనవిషయములు ప్రక్షిప్తమగుటకు అవకాశము కలిగినది. లభించుచున్న భారతమునకు కర్తయు, ప్రఖ్యాత పౌరాణికుడునగు సౌతి నైమిశారణ్యమున శౌనకాదిమునుల ప్రశ్నములకు ప్రత్యుత్తరముగ ననేకవిషయములను తెలిపియున్నాడు. సౌతి వక్కాణించిన విషయములు వ్యాస, వైశంపాయన భారతములలో నుండియుండవు గదా. అందువలన భారతము లక్షశ్లోకవిస్తృతిని పొందినది. ఈభారతములో మొట్టమొదటి 53 అధ్యాయములను ఉపోద్ఘాతముగ సౌతి చేర్చెనని పండితులు చెప్పుచున్నారు. మరియు భారతమును 18 పర్వములుగ సౌతియే విభజించెనని భారతమునందే సాక్ష్యము కలదు. కాబట్టి మనకు నేడు లభ్యమగుచున్న లక్షశ్లోకవిస్తృతి గల భారతమునందు వ్యాసభారతమెద్దియో స్పష్టముగ నిరూపించుట సాధ్యము కాదు. ఇంతకు ప్రథమావస్థలోనే వ్యాసభారతమునకు మూడు రూపాంతరములున్నట్లు మనకు తెలియదగిన ప్రధాన విషయము.

నన్నయ సౌతిభారతమునే ఆంధ్రీకరించెను. కాని భారతదేశమునగల భారతగ్రంథతాళపత్ర ప్రతులు బహువిధములుగ నున్నవి. ఈ ప్రతులలో శ్లోకసంఖ్య వ్యత్యాసము మాత్రమేకాక కథాఘట్టము లందును భిన్నత యున్నది. లేఖకుల ఇష్టానిష్టములవలన భారత ప్రతులలో శ్లోకసంఖ్య పెరిగి

కథాఘట్టములు మారినట్లూహింపవచ్చును. అట్టియెడ నన్నయ ఏప్రతిని మూలముగ గొనియుండునో నిర్ణయించుట కష్టము. మరియు నన్నయ కడ నుండిన ప్రతినే తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడలు గ్రహించి భారతానువాదము ముగించిరనుట పొసగదు. అందువలన ఆంధ్రమహాభారతమునకు మాతృకను నిర్ణయించుట అసాధ్యము.

కాని స్థూలముగ భారతదేశమునందలి మహాభారతప్రతులను రెండు వర్గములుగ విభజింపవచ్చును. ఉత్తర దేశమున లభ్యమైన భారతప్రతులనొకవర్గముగను, దక్షిణదేశమున లభ్యమైన భారతప్రతులనొకవర్గముగను విభజింపవచ్చును. ఇట్లు విభజించుట ఉత్తర దక్షిణ భారతప్రతులకు నెక్కువ భేదము కలదని కాదు. మొత్తము మీద ఉత్తరభారత ప్రతులకు కొంత ప్రాచీనతను, దక్షిణభారతప్రతులకు కొంత నవీనతను అపాదించుటకు వీలున్నది. ఉత్తరభారతప్రతుల కన్న దక్షిణదేశప్రతులలో సామాన్యముగ శ్లోకములు, ఉపాఖ్యానములు నెక్కువగా నున్నవి.

దక్షిణభారతప్రతులనెల్ల నొకచోటచేర్చి పోల్చి సరిచూచి పి.పి.ఎస్.శాస్త్రి గారు ఒక ప్రామాణిక ప్రతిని కుంభకోణమున ముద్రించిరి. పూనా యందలి భండార్కర్ ప్రాచ్యపరిశోధనా సంస్థవారు సుక్తాంకరు మహాశయుని అధ్వర్యమున భారతదేశమునందలి మహాభారతతాళపత్ర గ్రంథములనెల్ల పరిశీలించి ఒకమహా సంశోధిత సంస్కృత భారతమును ముద్రించిరి.

నన్నయ దక్షిణభారత దేశీయుడు కావున అయన దక్షిణభారతప్రతినే అనుసరించి యుండునను అభిప్రాయము కలుగవచ్చును. కాని విమర్శకులు ఆమహాకవి ఉత్తరదక్షిణభారత ప్రతులను రెండింటిని ఆంధ్రానువాద సమయమున సంప్రతించెనని నిర్ణయించిరి. దాక్షిణాత్య ప్రతులందెచ్చటను కానరాక ఉత్తరభారతప్రతులలో మాత్రమే కనబడు కొన్ని భాగములు నన్నయభారతమున కనబడుచున్నవి. అయన ఆదిపర్వము ననువదించునపుడు దాక్షిణాత్య ప్రతిని, సభాపర్వము ననువదించునపుడు ఉత్తరభారత ప్రతిని, అరణ్యపర్వము ననువదించునపుడు ఉత్తరభారత ప్రతిని అధికముగ సంప్రతించెనని అంతస్సాక్ష్యమును బట్టి చెప్పవచ్చును.

### భారతాంధ్రీకరణావశ్యకము

నన్నయ భారతమునే ఏల తెనిగింపవలయును. సంస్కృత సారస్వతమున భారతము కంటె ప్రఖ్యాతి ప్రచారములను పొందిన కావ్యనాటకముల నాంధ్రీకరించియుండరాదా? అను ప్రశ్నములు తప్పక పుట్టును. పై ప్రశ్నములకు నూహించియైన సమాధానములు తెలిసికొనవలెనన్న నన్నయకాలపు దేశకాలసాంఘిక పరిస్థితుల పరిచయము కొంతయుండవలయును. చారిత్రకదృష్టితో పరిశీలించిన నన్నయ వ్యాసభారతమును తెలిగించుటకు ప్రబలకారణములు కలవని తెలియును.

దేశచరిత్రకును, వాఙ్మయవికాసమునకును సన్నిహిత సంబంధము కలదు. సంఘమే వాఙ్మయమునకు నెలవు. సంఘనిమ్నోన్నతములే వాఙ్మయనిమ్నోన్నతములను నిర్ణయించుచుండును. అట్టి సాంఘిక పరిస్థితులే కొన్ని వేలయేండ్ల తరువాత నాంధ్రదేశమున భారతానువాదమునకు దారితీసినవి. నైతికపతనము, ధర్మాచరణమునందు ఉదాసీనత, లౌకికాసక్తి, క్షుద్రవస్త్వాకాంక్ష ప్రబలి ధర్మాధర్మములకు పోరు సంభవించిననాడు సంఘమున ఐక్యమాపాదించి ఉన్నత జీవితాదర్శములను నెలకొల్పగ వ్యాసమహర్షి సంస్కృతమున భారతమును రచించెను. అట్టి పరిస్థితులే నన్నయకాలమునందు కూడ అంధ్ర జాతియందు విజృంభించి జాతి జీవనమునకే ముప్పువాటిల్లునట్లుండెను. ఆ భిన్నశక్తులు రాజకీయముగా మాత్రమే కాక మతపరముగా, సాంఘికముగా పరిణమించి యుండెను.

అంధ్ర దేశమున అదినుండియు జైనబౌద్ధమతములు పాదుకొనియుండినవి. అవి వైదికమతాభిమానులచే పాషండమతములుగ తృణీకరింపబడుచుండెను. కాని రాజాదరణము వలన

ఆ రెండు మతములును ప్రాబల్యము వహించియుండెను. వేంగీ చాళుక్యుల రాకతో ఆంధ్రదేశమున వైదికమతమునకు దోహదక్రియ జరిగెను. చాళుక్యులు చంద్రవంశక్షత్రియులమని చెప్పికొని యజ్ఞముల నొనరించి వర్ణాశ్రమ ధర్మముల నెలకొల్ప ప్రయత్నించిరి. 7వ శతాబ్దమున కుమారిలభట్టు జైమిని సూత్రములకు భాష్యము వ్రాసి పూర్వమీమాంసా పరమై కర్మప్రధానమగు వైదిక మతమును బోధించెను. వేదములందు వర్ణింపబడిన యజ్ఞాది కర్మములను చేయుటవలన ముక్తి లభించునని ఇతని సిద్ధాంతము. ఇతడు కర్మవాది. పూర్వచాళుక్యుల ప్రాపున నితడు జైనమతనాశము చేసి వైదికమతమును ప్రతిష్ఠించెను. ఈ కాలమున ఆంధ్రదేశమునందు సంచారముచేసిన యువాన్‌చాంగ్ జైనమతము క్షీణించియున్నదని బ్రాహ్మణదేవాలయములు నిర్మింపబడినవని తెలిపియున్నాడు.

9వ శతాబ్ది అరంభమున శంకరాచార్యులుద్భవించి పరమతఖండనమును, స్వమతప్రచారమును చేయుచు ఆసేతుహిమాచల పర్యంతము సంచరించి ధర్మవ్యవస్థకై బదరీనారాయణ, శృంగేరి, జగన్నాథ, ద్వారావతులందు ముఖ్యపీఠముల స్థాపించి నాస్తికులను సిద్ధాంతములందోడించి జైనబౌద్ధమత నిర్మూలనము గావించెను. కుమారిలభట్టు తెలుగునాట ప్రారంభించిన పనిని శంకరాచార్యులు పూర్తి చేసెను. వైదిక మతమునుద్ధరింపబూనిన చాళుక్యులు జైనబౌద్ధులవలె దేశభాషను ప్రచారసాధనముగా గ్రహించిరి. కాని అనాడాంధ్రభాషకొకవ్యవస్థ లేదు. చాళుక్యులు పండితుల నియమించి, పరిషత్తుల నెలకొల్పి భాషాసంస్కారమును ప్రోత్సహించిరి. అట్లు సంస్కరింపబడినభాషలో గ్రంథరచనకు చేయూతనిచ్చిరి.

మఱియు నన్నయ మహాభారతమును వ్రాయుటలో నొక పవిత్రోద్దేశము గోచరించును. నన్నయకాలము వరకును పురాణములు, రూపకములు, కావ్యములు, శాస్త్రములు అన్నియు సంస్కృతముననుండెను. దీనివలన తెలుఁగు వారిని మానసికాంధకారమావరించి యుండెను. ఆ గ్రంథములు ప్రజాసామాన్యమునకు తెలిసిన భాషలో లేకున్నచో వారి యజ్ఞానము తొలగదు. తెలుఁగు వారినలముకొనియున్న అజ్ఞానాంధకారమును తొలగించి వారిని విజ్ఞానవంతులనుగ చేయుటకే నన్నయ పంచమవేదమైన భారతమును దేశభాషయగు తెలుఁగున వ్రాయుటకు దీక్షవహించెను. నన్నయ, అతనిని ప్రోత్సహించిన రాజరాజు ఆంధ్రజాతి ప్రథమ నిర్మాతలనుట స్పష్టము.

నన్నయ భారతావతారికయందే భారతాంధ్రీకరణ హేతువులు కొన్ని కలవు. పురాణశాస్త్ర కావ్యనాటకము లెన్ని చూచినను రాజరాజునకు "శ్రీమహాభారతము నందలి యభిప్రాయంబు విననభిలాష పెద్దయై" యుండెను. రాజరాజునకు భారత శ్రవణాసక్తి మెండు. అతడే యిట్లు చెప్పెను.

మ. **"ఇవియేనున్ సతతంబు నాయెడఁగరంబు లిష్టంబులైయుండుఁబా**
**యవు భూదేవకులాభితర్పణ మహీయః ప్రీతియున్ భారత**
**శ్రవణాసక్తియుఁభారతీపతి పదాబ్జధ్యానపూజామహో**
**త్సవమున్ సంతత దానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్."**

రాజరాజు చంద్రవంశీయుడు. ఆవంశముననే పుట్టి సుప్రసిద్ధులై విమలసద్గుణశోభితులైనవారు పాండవోత్తములు. వారి చరిత్రమే భారతము. కావున రాజరాజునకితరగ్రంథములందు కంటె మహాభారతముపై నాదరమధికముగా నుండుట సహజము.

అనాడాంధ్రదేశమున ప్రజలలో సంస్కృత భారతము ప్రచారమున నున్నది. భారతకథలను విననివారు లేరు. ఆంధ్రదేశమున మహాభారతమును పురాణముగ చెప్పుటయే వృత్తిగా గలవారు నాడుండిరని తెలియుచున్నది. సనాతన ధర్మమును చిరస్థాయిగ స్థాపించుటయే చాళుక్యుల ఆశయము. దానికై ప్రజల భాషలో ధర్మప్రచార గ్రంథములు వ్రాయించుట అత్యవసరమయ్యెను. వేదములు

అపౌరుషేయములు గాన ఆంధ్రీకరణమునకు నందనివి. రామాయణము తదితరకావ్యనాటకములు లౌకిక వాఙ్మయమునకు చెందినవి. వానిని తెనిఁగించుట వలన తెలుఁగు వారిలో విజ్ఞాన ప్రచారము కలుగదు. ఇక మిగిలినది భారతము. అప్పటికే సంస్కృత భారతము పురాణముగా చెప్పబడుటచేత ప్రజలలో భారత కథలు విశేష ప్రచారమును పొందినవి. అదియునుగాక భారతము పంచమ వేదము. చతుర్వేద సారమంతయు భారతమున నిండియున్నది. కావున భారతాంధ్రీకరణము వలన ప్రజలలో ధర్మమతవ్యాప్తియు, విజ్ఞానబోధయు సాధింపచాళుక్యులు సమకట్టిరి. మఱియు భారత పారాయణము చాళుక్యుల యాస్థానమున విధిగా నిర్వహింపబడెడిది.

రాజరాజు బహుభాషలలో, బహువిధములుగ, బహుజనులచే భారతకథను వినెను. అతని కాలము నాటికే తమిళమున పెరిందేవనారు భారతమును చంపూ కావ్యముగ రచించెను. కర్ణాటభాషలో పంపమహాకవి విక్రమార్జునవిజయమనియు, రన్నకవి సాహసభీమవిజయమనియు మహాభారతము ననువదించియుండెను. ఇరుగుపొరుగు భాషలలో భారతమనువదింపబడుటయు అది తెలుఁగుభాషలో అనువదింపకుండుటయు తెలిసి రాజరాజు వగచియుండును.

నన్నయయు నభ్యుదయ దృష్టి కలవాడు. పూర్వాచారపరాయణుడయ్యు తార్కికజ్ఞాన రహితుడగు జడుడు కాడు. భారతానువాదముతో నాంధ్రజాతికి శ్రేయస్సు కలుగునని యెంచిన ప్రజాకవి నన్నయ. ఆంధ్రజాతిశ్రేయోభిలాషియై ధర్మమతవ్యాప్తికి, విజ్ఞాన ప్రచారమునకు హృద్యము, అపూర్వము, అఘనిబర్హమునగు భారతమును ఆంధ్రుల చేతికందిచ్చిన ధన్యజీవి నన్నయ. దేశకాలపరిస్థితుల పరిశీలించి యొకానొక ఆదర్శమును సాధింపచాళుక్యులప్రాపున నన్నయ భారత రచనకు పూనుకొనెను. పరిసరముల ప్రాబల్యమే భారతాంధ్రీకరణమునకు దారితీసినది. కాలప్రభావమే ఆనాటి కవిని భారతమును తెనిఁగింపనుద్బోధించినది. సంస్కృతభారతమువలె నాంధ్రభారతము కూడ ప్రచారమునకై సృష్టింపబడినది. వ్యాస, నన్నయలు విశ్వశ్రేయస్సునాకాంక్షించిన కవులు. ఇరువురును విశ్వకల్యాణమునకై వాఙ్మయమును సాధనముగా గ్రహించిన ప్రజాకవులు.

**నన్నయ భారతానువాదము :**

ఏదైననొక కావ్యమును అన్యభాషనుండి యనువదించునపుడు ప్రధానముగ మూడు పద్ధతుల నవలంబింప వచ్చును. వానిలో మొదటిది కథానువాదపద్ధతి. ఇందు అనువాదకుడు మూలగ్రంథము నందలి కథను గ్రహించి యందలి వివిధ సన్నివేశములను విడువకుండగ, వివిధపాత్రలను నిర్వహించు కార్యములనుజ్జగింపకుండ, వర్ణనాదులను రసపోషణమును తనయిచ్ఛవచ్చినట్లొనర్చుచు రచన సాగించును. ఈ పద్ధతియందు మూలమునకు, ననువాదమునకు కథావిధానమున మాత్రమే సన్నిహిత సంబంధముండును. అందుచేనిది పేరునకనువాదమయ్యును తత్వమును బట్టి స్వతంత్రగ్రంథమువలె భాసించును. రెండవది భావానువాదపద్ధతి. ఇందు భాషాంతరీకర్త మాతృకయందలి కథనే కాక భావములను కూడ సన్నిహితముగా ననుసరించును. అతడు మూలకర్త వెలువరించిన భావములను ఉచితమైనభాషలో రమణీయమైన శైలితో వ్యక్తముచేయును. ఇది అతి స్వతంత్రమును, అతివిధేయమును కాని మధ్యస్థ పద్ధతి. మూడవది పదానువాదపద్ధతి. ఇందుమూలము నందలి కథాభావములేకాక పదములు గూడ ననువదింపబడును. ఇది మూలమున కతివిధేయమైన పద్ధతి. మాతృకయందలి పదమునకు పదము వేయుటకంటె భాషాంతరీకర్త వ్యక్తిత్వమేదియు గోచరింపదు.

ఆంధ్రవాఙ్మయము నందు ఈ త్రివిధములైన అనువాద రీతులు గలవు. కవిత్రయము వారిది కథానువాదము. శ్రీనాథాదులు భావానువాదము చేసిరి. ఇక ఆధునికులు నాటకములనువదించుచు పదానువాదము చేసిరి. ఈ త్రివిధానువాదములలో భాషాంతరీకర్త ప్రత్యేకతను, స్వాతంత్ర్యమును

దృష్టియందిడుకొని చూచినచో కథానువాదపద్ధతియే విశిష్టముగా నుండును. ఈ పద్ధతికి మార్గదర్శకుడు నన్నయభట్టు.

నన్నయ మాతృక యందలి కథను మాత్రము గ్రహించి భావవర్ణనాదులందు ఇచ్చవచ్చిన మార్పులు చేయుచు అనువాదమును సాగించెను. పదమునకు పదముగా గాని, శ్లోకము నకు పద్యముగా గాని భారతమును తెలిగింపవలెనను తలంపు నన్నయకు లేదు. రాజరాజుసైతము

కం. **"జననుత! కృష్ణద్వైపా**
**యన ముని వృషభాభిహిత మహాభారత బ**
**ద్ధ నిరూపితార్థమేర్పడఁ**
**దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్."**

అని మహాభారతము నందలి యర్థమునే తెలుఁగున వెల్లడింపగోరెను గాని, దానిని యథాతథముగ ననువదింపుమని కోరియుండలేదు. నన్నయయు రాజరాజు నభీష్టము నెఱింగి తదనుగుణముగ వ్యాసుఁడు నిరూపించిన యర్థమునకు భంగపాటు రాకుండ భారతాంధ్రీకరణమునకు పూనుకొనెను.

మాతృకయందలి వర్ణనములను, సంభాషణములను, ప్రశ్నోత్తరములను నన్నయ చాలవరకు సంక్షేపించెను. బృహస్పతి దీర్ఘతముని శపించుటకు కారణమైన వృత్తాంతము మూలమున 7శ్లోకములలో చెప్పబడినది. ఇది అసభ్యమైన శృంగారముతో కూడియున్నది. నన్నయ దీనిని మిక్కిలి యౌచిత్యపూర్ణముగా సంగ్రహించెను.

నన్నయ సంగ్రహించిన భాగములు ప్రధానకథకు గాక ప్రసక్తానుప్రసక్తముగ వచ్చిన ఉపాఖ్యానములకు సంబంధించినవే. పుర, నదీ, యుద్ధ, రాజగుణ, రాజ్యపాలనములును, ధర్మతత్త్వ నీతివిషయకోపన్యాసములును, వ్యక్తివస్తు నామముల పట్టికలును అతడు సంక్షేపించిన అంశములలో ముఖ్యములైనవి. మాతృక యందు కొన్ని కథలును, విషయములును రెండేసి మారులు చెప్పబడియున్నవి. నన్నయ అట్టి సందర్భములందు ఆ కథలెచ్చట నుండుట యుచితముగా నుండునో అచ్చట నొక్కమారే చెప్పుచుండును.

అనువాదము చేయునపుడు నన్నయ పూర్తిగా విడిచివేసిన భాగములు కూడ కొన్నియున్నవి. ప్రధానకథతో నంతగా సంబంధములేని హేతువుచే అనవసరములని తోచుట చేతనో, అనౌచిత్యములుగ కనవచ్చుట చేతనో వేదాంత విషయ బాహుళ్యముతో కూడినవై యుండుట చేతనో నన్నయ వానిని విడిచియుండెను. దుష్యంతుడు శకుంతలను తిరస్కరించు సందర్భమున మేనకా విశ్వామిత్రులను దూషించుట దుష్యంతుని శీలమునకు లాఘవము సంపాదించును. అందుచే నన్నయ ఈ దూషణమును త్యజించెను.

భారతమును తెనిగించునపుడు నన్నయ సంగ్రహించిన లేక విసర్జించిన భాగములున్నను అతడచ్చటచ్చట మూలమునకు పెంపు కలిగించిన భాగములు కూడ కొన్ని లేకపోలేదు. అతడు కలిగించిన పెంపు నయిదువిధములుగ వర్ణింపవచ్చును.

**1. మూలమున లేని వర్ణనములను చొప్పించుట :-** ఈ వర్ణనము లొక్కొక్కచోట మూడు, నాలుగు పద్యములతో కూడి ఇంచుక దీర్ఘముగా నుండును. ఉదంకుడు గావించిన నాగరాజస్తుతి, పాండురాజు మరణించుటకు ముందు చేసిన వసంతవర్ణనము మూలములో లేవు.

**2. అమూలకములైన భావములను వెల్లడించుట :-** ఇట్టివి సాధారణముగ నొక పద్యమునకే పరిమితమై యుండును. నన్నయ శంతనుడు చూచిన యోజనగంధిని "దాని శరీర సౌరభము దాని విలోల విలోకనంబులున్" అను పద్యమున వర్ణించెను. ఈ వర్ణనము మూలమున లేదు.

**3. మూలమున నున్న యొక పదమునో, పదసమూహమునో ఆధారముగా గ్రహించి యందలి భావమునే విపులీకరించుట :-** అగ్ని భృగువుచే శపింపబడినవాడై తాను ప్రతిశాపమీయగలిగియు శపింపలేదు. దానికి హేతువు "మాన్యాస్తు బ్రాహ్మణా మమ" అని అగ్ని చెప్పెను. నన్నయ ఈ చిన్న వాక్యమును ఒక చంపకమాలగా పెంచెను.

చం. **అడిచినఁదిట్టినన్, మతిమహాపరుషంబులు పల్కియల్కతోఁ**
**బొడిచిన, నుత్తమ ద్విజులు పూజ్యులు, వారలకెగ్గు సేసినన్**
**జెడు నిహమున్ బరంబు, నిది సిద్ధము కావుటెఱింగి, భక్తి నె**
**ప్పుడు ధరణీసురోత్తములఁబూజలఁదన్పుదు, నల్గనోడుదున్.**

**4. అలంకారికమైన పెంపు-అర్థాంతరన్యాసకల్పనము :-** మూలమున కొన్ని చోట్ల నిరలంకారములును, నీరసములునై కనుపట్టు భాగములకు నన్నయ అనువాదములో నాలంకారికమైన పెంపు కలిగించి ఎంతో వన్నె చేకూర్చుచుండును. మూలభారతములో శమంత పంచకాక్షౌహిణీ సంఖ్యాకథన సందర్భమున పరశురాముడు "శస్త్రభృతాం వరః" "జఘూనామర్షచోదితః" అను రెండు విశేషణములతో వర్ణింపబడెను. నన్నయ అమాటలనాలంకారికముగా పెంచి ఈవిధముగా పద్యము రచించెను.

శా॥ **త్రేతాద్వాపరసంధి నుద్ధత మదాంధీభూత విద్వేషి జీ**
**మూతోగ్ర శ్వస నుండు రాముఁడలుకన్ ముయ్యేడుమాఱుల్‌రణ**
**ప్రీతిన్, వైరిధరాతలేశ్వరులఁజంపెంబల్వురన్ దీర్ఘ ని**
**ర్ఘాత క్రూర కుఠార లూన నిఖిల క్షత్రోరు కాంతారుఁడై**

నన్నయ మూలమందు లేకున్నను పెక్కు పద్యము లందర్థాంతరన్యాసా లంకారములను కల్పించెను. సామాన్యముగా నన్నయ సామాన్యాంశములను కల్పించి అయలంకారమును సృష్టించెను.

1) గురుకార్యనిరతులగు సత్పురుషుల కగుటరుదె యధిక పుణ్యఫలంబుల్
2) పెద్దల చరితంబల్పులకు నెఱుగ శక్యమె యెందున్.
3) ఎందుఁగుడిచిన చోటికి నెగ్గుసేయ రెట్టి దుర్జనులైనను నెఱుక విడిచి.

**5. వ్యక్తులనుగాని, వస్తువులను గాని వర్ణించునపుడు విశేషణముల నధికముగ వాడుట :-** వ్యక్తులను వర్ణించునపుడు, అందును మొట్టమొదట వారిని కథలో ప్రవేశపెట్టునపుడు అయన విశేషణముల నధికముగ వాడును. మూలభారతమున గరుత్మంతుని వర్ణించునపుడు

"అగ్నిరాశిరివోద్భాసన్ సమిద్ధోఽతిభయంకరః
ప్రవృద్ధః సహసా పక్షీ మహాకాయో నభోగతః"

ఉ. **ఆతత పక్షమారుత రయప్రవికంపిత ఘూర్ణితాచల**
**వ్రాత మహార్ణవుండు బలవన్నిజదేహ సముజ్జ్వలత్ప్రభా**
**ధూత పతంగతేజుఁడుదితుండయి తార్క్ష్యుఁడు తల్లికిన్ మనః**
**ప్రీతి నొనర్చుచు న్నెగసె భీమజవంబున నభ్రవీధికిన్.**

అట్లే మూలమునందు "జనమేజయః పారిక్షితః" అని యుండగా నన్నయ తెనిఁగింపులో ఎన్నో విశేషణములు తలయెత్తినవి.

చం. **ప్రతిహత శత్రువిక్రముఁడు, పాండవవంశ వివర్ధనుండు, సు**
**వ్రతుడు పరీక్షిదాత్మజు డవద్య విదూరు, దుదారకీర్తి ని**
**ర్మిత వివిధాధ్వరుండు, జనమేజయుడన్ జనపాలుదుత్తమ**
**స్తుతమతి, దీర్ఘసత్రమజితుండొనరించె శుభాభికాంక్షియై.**

మూలమున కొన్నిచోట్ల ఇంచుకైన సూచన లేకుండ కథలు హఠాత్తుగా నారంభింపబడును. ఒక కథకును, మరియొక కథకును గల సంబంధ మస్పష్టముగ నుండును. కథారంభమునకు ముందు వేయు ప్రశ్నకును తరువాతి సమాధానమునకును సంబంధముండదు. ఇట్టిచోట్ల నన్నయ వానికి గల పరస్పర సంబంధమును సూచించుచు నొకవిధమైన క్రమమును కలిగించును. అతని కథారచన ప్రసన్నముగా కన్పించుట కిదియునొక హేతువని చెప్పవచ్చును.

మాతృకయందలి కొన్ని కథాంశములను నన్నయ తనకు ఉచితమని తోచినట్లు మార్చి వ్రాసెను. కాని ఇట్టివాని సంఖ్య చాల తక్కువ. కశ్యపుడు పుత్రకామేష్టి చేయు సందర్భమున వాలఖిల్యులు దేవేంద్రుని శపించిన వృత్తాంతమును శౌనకాదులు ప్రత్యేకముగ ప్రశ్నింపగా సౌతి చెప్పినట్లు మూలమున కలదు. నన్నయ గరుడాగమనమునకు ముందు అమర లోకమున గలిగిన ఉత్పాతములకు కారణములను చెప్పుచు బృహస్పతియే ఇంద్రునకావృత్తాంతమును చెప్పినట్లు వర్ణించెను. దీనినిచ్చట బృహస్పతి చెప్పుటయే ఉచితమై కథకు రామణీయకమును కూర్చుచున్నది.

మాతృకయందలి విషయము ఔచిత్య హీనముగా నుండుటచే నన్నయ అందలి అనౌచిత్యమును తొలగించి మార్చి వ్రాసిన భాగములనేకములున్నవి. ఇట్టి చోట్ల నన్నయ మూలమునకు వన్నె చేకూర్చెననియే చెప్పవలయును. ఈ మార్పులాతని కావ్యకళాదృష్టికి, ప్రతిభావిశేషమునకు నిదర్శనములు. కుమారాస్త్రవిద్యా ప్రదర్శనమున కర్ణుడు సూతపుత్రుడని తెలిసి భీముడు అతడర్జునునితో యుద్ధము చేయుటకు తగడనియు, అంగరాజ్య మతని కర్హము కాదనియు పలికెను. అంత కర్ణుడు ముఖము వెల్లనయి ఏమియు చేయనేరక నిట్టూర్పులు విడుచుచుండెను. దీనిని గని భ్రాతృమధ్యమున నున్న దుర్యోధనుడు భీమునితో “అనిలజ! నీకిట్లని పల్కను దలపను నగునె, లేడి కడుపున పులి బుట్టునె” అని పల్కినట్లు నన్నయ వ్రాసెను. ఇచట ‘అనిలజ!’ అను సంబోధనము సముచితమై భావగర్భితముగా నున్నది. అ సంబోధనము భీముని జన్మరహస్యమును వెల్లడించుచు అతనిని లెస్సగా ఉపాలంభించుచున్నట్లున్నది. ఈ సందర్భమున మాతృక యందు ‘వృకోదర! న యుక్తం తే” అని వృకోదర శబ్దము వాడబడినది.

నన్నయ సంస్కృత మహాకవుల కావ్యముల యందలి భావముల నెడనెడ స్వీకరించెను. అట్లే కన్నడ మహాకవుల కావ్యముల యందలి భావములను కూడ కొన్నిచోట్ల అనుసరించెను. నన్నయ భారత రచన కారంభించుచు “హరిహరాజ గజాననార్క షడాస్య మాతృ సరస్వతీ గిరి సుతాదిక దేవతా తతికిన్” నమస్కృతి యొనర్చెను. రత్న త్రయము నందలి పంప మహాకవి ఈ దేవతలతో పాటు మన్మథుని కూడ స్తుతించెను. పంప మహాకవి తన కవిత్వము నందలి ప్రధాన గుణములను పేర్కొనెను. అతడు చెప్పిన పద్యము లందలి ప్రసన్న కవితా గుణ, అ సకలార్థసంయుత, లలితపద, వాక్ర్మీ సుభగాది పదములే నన్నయ పేర్కొనిన ప్రసన్న కథా కలితార్థయుక్తి, అక్షరరమ్యత యైనవి. పంప భారతమునందలి సమాసములే కొలది మార్పులతో నన్నయభారతమున కనబడుచున్నవి.

1. సరళ తమాల తాళహరిచందన నందన భూజరాజియం (పంపకవి)
   సరళ తమాల తాళహరిచందన చంపక..................... (నన్నయ)
2. సకలక్ష్మాచర ఖేచరాంచిత మహామాణిక్యగాణిక్యహస్తి (పంపకవి)
   మదమాతంగ తురంగ కాంచన లసన్ మాణిక్యగాణిక్య సంపద (నన్నయ)

ఈ విధముగా నన్నయ ప్రధానముగా వ్యాసభారతము నందలి కథనే యనుసరించినను అటనట తనకు పూర్వమున్న సంస్కృత కర్ణాటకవుల కావ్యముల నుండి కూడ కొన్ని భావములు గ్రహించియు, సందర్భానుగుణముగా నూత్నకల్పనలు కావించియు, అనుచితములని తోచిన అంశములు పరిహరించియు, కొన్నివర్ణనములు పెంచియు, కొన్ని తగ్గించియు ఆంధ్రమహాభారతమును సర్వాంగ సుందరముగా వెలయించెను. అందుచేతనే అది స్వతంత్ర గ్రంథమువలె శోభిల్లుచున్నది.

## నన్నయ కవితారీతులు

నన్నయ భారతావతారికాంతమున

ఉ. సారమతింగవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తితో
నారసిమేలునా, నితరు లక్షరరమ్యత నాదరింప, నా
నా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్"॥

అను పద్యమున తన కవిత్వము నందలి ప్రధానగుణములను చెప్పెను. అవి 1.ప్రసన్నకథాకలితార్థయుక్తి 2.అక్షరరమ్యత 3.నానారుచిరార్థసూక్తి నిధిత్వము.

1. ప్రసన్నకథాకలితార్థయుక్తి:-

ప్రసన్నకథా కలితార్థయుక్తి యను సమాసమునకు ప్రసన్నకథాకవితార్థయుక్తి యను పాఠాంతరము కలదు. కాని పండితులు పెక్కురు ప్రసన్నకథాకలితార్థయుక్తి యను పాఠమునే యంగీకరించిరి. ఈ పాఠమున ప్రసన్న శబ్దమును కథాశబ్దమునకు గాని, అర్థ శబ్దమునకుగాని విశేషణముగా గ్రహింపవచ్చును. అప్పుడు పైసమాసమునకు ప్రసన్నములైన కథల యందు కూర్పబడిన యర్థము యొక్క యుక్తియని అర్థము చెప్పవచ్చును.

ప్రసన్నమనగా ప్రసాదగుణముతో కూడిన అని యర్థము. ఈ ప్రసాద గుణమును సంస్కృత లాక్షణికులు పలువురు నిర్వచించియున్నారు. దీనిని కొందరు శబ్దగుణముగను, కొందరు అర్థగుణముగను, కొందరు ఉభయాత్మకముగను, కొందరు రసగుణముగను చెప్పియున్నారు. నన్నయ ప్రసన్నకథా కవితార్థయుక్తి యని చెప్పుటచే ప్రసాదమును అర్థగుణముగనే గ్రహించినట్లు తోచుచున్నది. అయాసందర్భము లందు సముచితములైన విషయములను మాత్రమే చెప్పుచు, ఏకమాత్ర శ్రవణముననే అర్థమునెల్ల వ్యక్తము చేయుట అతని ప్రసన్నతకు లక్షణమని చెప్పవచ్చును. ఈ యర్థమునే కథలకు కూడ అన్వయించినచో కథా ప్రసన్నత లేక ప్రసన్నకథాత్వము అనగా నేమో తెల్లమగును. ఏవైన కథలను రచించునపుడు ప్రధానకథతో వానికి గల సంబంధమును, అందు వానికి గల స్థానమును వివరించుచు, ప్రయోజన రహితములైన సందర్భముల నుజ్జగించుచు, విన్నంతమాత్రమున అందలి తత్వమును స్ఫురింపజేయుట ఆ కథా ప్రసన్నతకు లక్షణము.

ప్రసాదము రసగుణము. అది సర్వరసములకు సమానమే. కాబట్టి ప్రసన్నమైన కథలనునప్పుడు నానా రసమయములైన కథలని స్ఫురించుచున్నది. ఈ విధముగా ప్రసన్న కథా కలితార్థయుక్తి యను సమాసమును నన్నయ రసదృష్టితో ప్రయోగించెనని వ్యక్తమగుచున్నది. సంస్కృతభారతమందలి కథారచనలో ధార్మికదృష్టి యధికము. అందలి కథలు రసవంతములగుట యానుషంగికము. నన్నయ కథారచనలో రసమున కధికమైన ప్రాధాన్యము నుండవచ్చును.

కథాప్రసన్నత రెండు విధములుగా నుండవచ్చును. 1.ఆత్మగతము 2.శరీరగతము. ఆత్మగతమైనప్పుడది రసభావములకు సంబంధించియుండును. శరీరగతమైనపుడు ఆరసభావములను వెల్లడించు శబ్దములకు సంబంధించి యుండును. మొదటిదానిని అర్థయుక్తియనియు, రెండవ దానిని అక్షరరమ్యత యనియు నన్నయ చెప్పెనని తలంపవచ్చును.

నన్నయ కథలను ప్రసన్నములుగా చేయుటకై అవలంబించు పద్ధతులు ఆఱు విధములుగా నుండును.

1. కథకనవసరములును, కథాగమనమున కడ్డు కల్గించునవియునగు వర్ణనములను,

నీతిధర్మతత్త్వవివరణములను తగ్గించుట-పాండవుల సభావైభవమును చూచి దుర్యోధనుడీర్ష్య వహించినప్పుడు శకునియాతనికి చేసిన ధర్మోపదేశము, హనుమంతుడు భీమునికి త్రయీవార్తా దండనీతులను గూర్చియు, వర్ణధర్మాదులను గూర్చియు వివరించు వృత్తాంతమును నన్నయ విడిచివేయుట దీనికి తార్కాణము.

2. కథాపునరుక్తిని తొలగించుట-ఒక కథ రెండు సారులు చెప్పబడినపుడు ఆ రెండు పట్టులందలి కథాంశములను పరిశీలించి వానిని ఉచితవిధమున నొకచోట సమ్మేళనము చేయుట-మూలభారతములో జరత్కారు వృత్తాంతము మున్నగు రెండు మూడు కథాభాగములు పునరుక్తములు చేయబడినవి. మఱియు ధర్మరాజాదులు తమ్ము విడిచి యరుగునప్పుడు ప్రజలు, విప్రులు విచారించిన సందర్భములు మూలమున వచ్చినచోట్ల నెల్ల విపులముగా వర్ణింపబడినవి. నన్నయ ఈ పునరుక్తులను తొలగించి ఉచితస్థలములందు మాత్రమే అయాసందర్భములను విపులముగా చెప్పుచు కథయందలి రక్తిని పెంచుచుండును.

3. ప్రధాన కథకును ఉపాఖ్యానములకును గల సంబంధమును వివరించుట-సంస్కృత భారతములో ప్రధానకథతో సంబంధము లేకుండ హఠాత్తుగ ఉపాఖ్యానము ప్రారంభమగును. మఱియు కొన్నిచోట్ల అడిగిన ప్రశ్నకు, చెప్పిన సమాధానమునకు సంబంధము మృగ్యమైయుండును. నన్నయ ప్రధానకథకు, ఉపాఖ్యానమునకు గల సంబంధమును చక్కగా ప్రదర్శించుచు కథను ప్రసన్న మొనర్చుచుండుటయేగాక కథయందలి ప్రధానాంశము పాఠకుని హృదయమున నూటిగా హత్తుకొనునట్లు కొన్ని ప్రశ్నలను కూర్చుచుండును.

తే. వర్ణధర్మముల్ గాచుచు వసుధయెల్ల
నసఘచరితుఁడై యేలిన యయ్యయాతి।
భూసురోత్తమ! భార్గవపుత్రియైన
దేవయానిని దానెట్లు దేవిఁజేసె?॥

అను ప్రశ్నయిట్టి వానికొక యుదాహరణము. యయాతి సకల సద్గుణరాశి. దేవయాని బ్రాహ్మణపుత్రిక. ఈకథవినగనే వర్ణాశ్రమ ధర్మరక్షణ మొనర్చు క్షత్రియుడు ఇట్టి విలోమ వివాహమున కెట్లు సమ్మతించెనను సందేహము పాఠకులకుదయించును. అందుచే నన్నయ అవిషయమును సూచించుచు ప్రశ్నమును సంఘటించెను. మూలభారతము నందలి ప్రశ్నములో మొదటి రెండు పాదములభావము కానరాదు. మఱియు జనమేజయుడు వైశంపాయనుని భూసురోత్తమ! యని సంబోధించుట సాభిప్రాయముగానున్నది.

4. మూలభారతములో భిన్నభిన్నాధ్యాయములుగ భిన్నభిన్న స్థలములలో చెప్పబడిన విషయములను కథలోనుచిత సందర్భములందు చొప్పించుట-బ్రాహ్మణ భార్య కల్మాషపాదుని శపించిన వృత్తాంతమును, అగస్త్యుడు నహుషుని శపించిన వృత్తాంతమును వేఱుగా చెప్పక నన్నయ వానిని ఉచితస్థానములందు వివరించుట దీనికి తార్కాణము.

5. మూలమున నిగూఢముగా నున్న కథారహస్యములను సముచితవ్యాఖ్యానముచే సువ్యక్తము చేయుట. రురుడు ప్రమద్వరను వివాహమాడ నిశ్చయించెను. వివాహముకాకమునుపే కాలువేసి పాముచేకరవబడి యామె మరణించెను. రురుడు శోకవ్యాకుల హృదయుడై దేవతలను, బ్రాహ్మణులను, మంత్రతంత్రజ్ఞులను అమెను బ్రతికింపుడని వేడుచు దీనవదనుడై యాక్రోశించెను. సామాన్యముగా శృంగారము అయోగశృంగారము, వియోగశృంగారము, సంయోగశృంగారము నని మూడువిధములుగ నుండును. ఈ కథలో సంయోగశృంగారము లేదు. అయోగ, వియోగ శృంగారములు రెండును వర్ణింపబడినవి. సాధారణముగా సంయోగము తరువాత వియోగము వర్ణింపబడినచో సార్థకముగా నుండును. ఇట వియోగము విచిత్రమైనది. ఇది కరుణరసభూయిష్ఠము. "మన్మనోనిలయకు నీప్రమద్వరకు" అను

విశేషణములో కరుణరసమునకు కారణము చెప్పబడినది. ప్రమద్వర రురుని గృహమున అడుగుపెట్టకపోయినను అతని మనస్సున సుప్రతిష్ఠితురాలైనది. కావుననే యాతడు తన అయుస్సున అర్ధభాగమొసగి యామెను బ్రతికించుకొనెను. ఇది మనోనిష్ఠితమైన అతని పవిత్రప్రేమను వేయివిధముల వెల్లడించుచున్నది.

6. స్థాయిభావములను విభావానుభావ వ్యభిచారి సాత్వికభావములచే పోషించి రసమును వ్యక్తము చేయుట-ప్రసాదగుణము సర్వరస సాధారణమగుటచే ప్రసన్నపద ప్రయోగమున నన్నయకు గల రసదృష్టి వ్యక్తమగుచున్నది. సందర్భోచితముగా మూలమున లేకపోయినను కథలలో రసానుగుణములైన విభావాదులను వర్ణించుచు నన్నయ రసములకు పుష్టి కలిగించుచుండును-శంతనుడొక్కనాడు యమునాతీరమున వేటలాడుచు అపూర్వసురభిగంధమాఘ్రాణించి అది వచ్చిన దిక్కునరయుచు వెళ్ళి యోజనగంధిని గాంచెను. అప్పుడు నన్నయ ఈ క్రింది పద్యమును వ్రాసెను.

ఉ॥ దాని శరీరసౌరభము, దాని విలోల విలోకనంబులున్
దాని మనోహరాకృతియు, దాని శుచిస్మితవక్త్రకాంతియున్।
దాని విలాసమున్ గడుముదంబునఁజూచి మనోజబాణ సం
తాన హతాత్ముడై నృపతి దానికి నిట్లనియెన్ బ్రియంబునన్॥

ఈ పద్యమునకు మాతృకలో నాధారము లేదు. ఇందలి శరీర సౌరభము, మనోహరాకృతి, శుచిస్మితవక్త్రకాంతి మున్నగునవి యుద్దీపన విభావములు. విలోల విలోకనములు అనుభావములు.

నన్నయకథలను ప్రసన్న మొనరించుటకు నవలంబించిన పద్ధతులలో పదప్రయోగమును కూడ పేర్కొనవలయును. అపరిచితములు, శ్రవణకటువులునైన పదములను వదలి యాతడు మృదుమధురములు, జాతీయములునైన పదములనే వాడుచుండును. ప్రాతపడిన పదములనాతడుపయోగింపడు. సంస్కృత సమాసములు వాడినను వానియందు క్లిష్టతయించుకేనియునుండదు. ప్రసాదగుణభరితములైన యిట్టి పదముల ప్రయోగము కూడ అతని కథాప్రసన్నతకు తోడ్పడుచున్నది.

నన్నయ తాను రచించిన కథాభాగములన్నిటి యందు నేదోయొక పరమార్థమును నిక్షేపించుచుండును. మూలభారతము నందు కూడ ఈ పరమార్థము స్పష్టాస్పష్టముగా నుండవచ్చును. దానినాతడు స్పష్టపరచి పాఠకులకు ప్రసన్నమగునట్లు కథారచన సాగించును. గరుడోపాఖ్యాన మందలి పూర్వభాగము సవతుల మనస్సులలో నొండొరులయెడ నెలకొనియుండు నీర్ష్యాద్వేషములపై నాధారపడియున్నది. గడుసరులైనవారు అమాయికలను వేధించుచు వారిపై నధికారము నిర్వహించుచుందురు. కద్రువ వినతపై నిట్టి యధికారము సాగించెను. ఆమెను దాసిగా చేసికొనుటకై కపటమార్గమవలంబించెను. దానికి ఫలముగా చివరకామె తన కొడుకులను తానే శపించుకొనవలసివచ్చెను.

నన్నయ కథ చెప్పుచు నాయా ఘట్టములందు కొన్ని వాక్యములకు, కొన్ని పదములకు నమితమైన ప్రాముఖ్యము కల్పించుచుండును. అవి ఆయా ఘట్టముల కాయువుపట్టులైనవగుటచే వానినాతడు రెండు, మూడు సారులుపయోగించి పాఠక హృదయము నాకర్షించుకొనునట్లుగా నొక్కిచెప్పుచుండును. అపదములను, అవాక్యములను చక్కగా అవగాహనము చేసికొన్నచో మనకు సందర్భమంతయు ప్రసన్నమగుచుండును. రోమపాదుడు పంపిన వేశ్యలు ఋష్యశృంగుని కొనితెచ్చిన ఘట్టమే దీనికి తార్కాణము. వేశ్య కందుక నర్తన మృదుగీతములందు తనకు గల నేర్పును చూపి మునిపతికి ముదము గావించెను. ఇచట నన్నయ "ఇట్లు ఋశ్యశృంగుఁబ్రబోధించి వేశ్యాపుత్రియరిగె" నని చెప్పెను. ఇందు 'ప్రబోధించి' అనుమాట గమనింపదగినది. రోమపాదుడు వేశ్యలను పిలిచి మీ

నేర్పువిధంబున ఋశ్యశృంగుఁబ్రబోధించి యిట తోడ్కొనిరండని పంచెను. వేశ్యావిలాసములకు చిక్కి కర్తవ్యమును మరచిన ఋశ్యశృంగుని తండ్రి కొడుకున్ 'బ్రబోధించి' యెప్పటియట్ల వన్యఫలంబులు తేరనరిగెను. ఇట మరల 'ప్రబోధించి' యను పదము వాడబడినది. తండ్రి కావించిన ఈ ప్రబోధము వేశ్యకావించిన ప్రబోధమునకు వ్యతిరేకమైనది. మొదటిది ప్రవృత్తికిని, రెండవది నివృత్తికిని ప్రబోధములు. తండ్రిలేని సమయమున మరల అవేశ్య ఋశ్యశృంగుని దర్శించి యాతని చిత్తమునకు 'వైకృతము' చేసెను. ఇది ఆమె కావించిన ప్రబోధమునకు రెండవ మెట్టు. ఈ ప్రబోధము ఫలించెను. ఋశ్యశృంగుడు ఆశ్రమమును విడిచి వేశ్యవెంట అంగదేశమున కేగెను. ఋశ్యశృంగకథకు "ప్రబోధించు, ముదము కావించు, వైకృతము చేయు" అను పదములు ప్రాణభూతములైనవి. ఇతర విషయమెంతయున్నను కథయంతయు వానిమీదనే నడచినది.

ఈవిధముగా నన్నయ ప్రసన్నకథాకలితార్థయుక్తి సహృదయుల హృదయములకు రసానందము కలిగించుచుండును. ఆయన కథను చెప్పుపద్ధతి అతిలోక రమణీయ మనక తప్పదు. కథను రచించుచు పోవునప్పుడు నన్నయ ఏపాత్రకు నేసన్నివేశమునకు నెచ్చట నెంత ప్రాధాన్యము కలదో నిర్దేశించి యాపాత్రకు నాసంఘటనము నచ్చట నంత ప్రాధాన్యమొసంగును. ఆ విషయము పాఠకునకు తెలియునట్లుగా దానిని నొక్కి చెప్పుచుండును.

అక్షరరమ్యత: -

ప్రసన్నకథా కలితార్థయుక్తి అనుగుణము అర్థమునకు సంబంధించినది. అక్షరరమ్యత శబ్దమునకు సంబంధించినది. వీనిలో మొదటిది బుద్ధిగ్రాహ్యము. అక్షరరమ్యత శ్రవణేంద్రియము వలన గ్రహింపదగినది. ప్రసన్నకథా కలితార్థయుక్తి కావ్యము యొక్క అంతస్తత్వమును గూర్చి చెప్పును. అక్షరరమ్యత బహిరంగమును గూర్చి చెప్పును. మొదటి దానిని పాకమనియు, రెండవదానిని శయ్య అనియు చెప్పవచ్చును.

పదమైత్రియే శయ్యయని సంస్కృతాలంకారికులు చెప్పిరి. అర్థమునుబట్టి ఏపదమునైన ఏపదము తరువాతనైన కూర్పవచ్చుననుట పొరపాటు. ఏశబ్దము తరువాత ఏశబ్దము వాడిన కర్ణపేయముగా నుండునో గ్రహించి వానినట్లు సముచితముగా నుపయోగింపవలయును. అట్లు పొందిక గల పదములను వాడుటకే శయ్య అని పేరు. అదియే అక్షరరమ్యత. ఒకప్పుడు వాక్యము యొక్క కూర్పు మార్చినను, ఒకపదమును తొలగించి దానిస్థానమున పర్యాయపదమును వాడినను కళాసౌందర్యముతో పాటు అర్థము కూడ చెడిపోవుట సంభవించును. పదప్రయోగము నందలి ఈ సౌష్ఠవమునే శయ్యయని చెప్పుచుందురు. ఆంగ్ల కవీంద్రుడైన వర్డ్స్‌వర్తు కవిత్వమును నిర్వచించుచు "The choice of the best words in best place" అని చెప్పెను. పింగళి సూరన

"పొసగముత్తెపు సరుల్ పోహళించిన లీలఁ
దమలోన దొరయు శబ్దములు గూర్చి"

అని యొకానొక సందర్భమున వక్కాణించెను. ఈ యిద్దరుకవుల మాటలు శయ్యకు సంబంధించినవే యని చెప్పవలయును.

అక్షరమనగా వర్ణము. వర్ణముల సముదాయము పదము. పదముల సముదాయము వాక్యము. వాక్యసముదాయము కావ్యము. ఇవి యెల్ల కావ్య సౌందర్యమునకు దోహదమొసంగునట్టివే. కాబట్టి విశిష్టమైన కూర్పుతో కూడిన పదసముదాయము కావ్యసమిష్టి సౌందర్యమునకు కారణమగును. ఆసౌందర్య మొక్కొక్క పదమున్న పుష్టినందును. అది లేకున్నలోపించును. అందుచే పదప్రయోగవిషయమున కవి అత్యంతశ్రద్ధవహింపవలయును. భామహుడీ విషయమునే

"మాలాకారో రచయతి యథాసాధువిజ్ఞాయమాలాం
యోజ్యం కావ్యేష్వవహిత ధియా తద్వదేవాభిధానమ్"

అని చెప్పియుండెను.

అక్షరముల నన్నిటినుచ్చరించునప్పుడు ధ్వనియంతయు నొక్కమాదిరిగా నుండదు. కొన్ని యక్షరములు పరుషములు. కొన్ని సరళములు. అన్ని యక్షరములు నన్ని రసములకు ననుగుణముగా నుండవు. వర్ణములు కూడ రసవ్యంజకములు. ధ్వన్యాలోకమున శ,ష వర్ణములును, రేఫ సంయుక్తములైన క్ర, ప్ర, బ్ర మున్నగు వర్ణములును, ఢకారమును శృంగారమునకు విరుద్ధములగుటచే అరసమును ప్రకాశింపచేయజాలవనియు, అవర్ణములే బీభత్సాదుల యందు ప్రయోగింపబడి రసపుష్టిని కలిగించుననియు చెప్పబడినది. శృంగారరసమునకు పనికిరాని వర్ణములు కరుణమునకును పనికిరావు. బీభత్సమునకు నుపయోగించు వర్ణములు రౌద్ర వీరములకు కూడ నుపయోగించును. పైని చెప్పిన సిద్ధాంతముల కనుగుణముగ నన్నయ కవితలో అక్షరరమ్యత తొణికిసలాడుచున్నది.

మ. పతదుర్వీధర ధాతు నిర్ఝర జలాభంబై మహాదేహ ని
ర్గత సాంద్రారుణ పూర మొక్క మొగినొల్కన్ ద్రెస్సి నారాయణో,
న్నత దోర్దండ విముక్త చక్రనిహతిన్ నా కద్విషన్మస్తక
ప్రతతుల్ ఘోరరణంబునన్ బడియె భూభాగంబు కంపింపగన్॥

ఈ పద్యమునందలి ర్వి, ర్ఝ, న్మ, ప్ర, ష మొదలైన వర్ణములు ఓజోగుణమును సూచించుచున్నవి. వీర, బీభత్స, రౌద్రరసములందు రచన ఓజోగుణ భరితమై ఉండవలయును. ఈ రసములందు దీర్ఘ సమాస యుక్తమైన రచన యింపుగా నుండును.

శృంగార కరుణ రసములందు దీర్ఘ సమాస రచన తగదు. వీని యందు దీర్ఘసమాసములు లేక సరసములగు పదములు ప్రయుక్తములైనచో మాధుర్యగుణమొప్పారును. "పృథక్ పదత్వం మాధుర్యం" అని వామనుడు నిర్వచించెను. గంగాదేవిని వర్ణించునపుడు సౌకుమార్యమును, శంతనుడు యోజనగంధితో మాటాడినపుడు మాధుర్యగుణమును నన్నయ లెస్సగా పోషించెను.

ఉ. గంగ నిజాంగ దీప్తు లెసగంజను దెంచి సంతతో
త్తుంగ పయోధర ద్వితయ తోయరుహానన చారునేత్ర ది,
వ్యాంగనయై ప్రతీప వసుధాధిపు శాల విశాల దక్షిణో
త్సంగము నందు మన్మథ వశంబున నుండెఁగరంబులీలతోన్॥

ఇచట పూర్ణబిందు పూర్వక వర్ణముల కూర్పు సౌకుమార్యమను గుణమును సూచించుచున్నది.

ఉ. ఎందుల దానవేకతమ యీ యమునా నది నోడసల్పుచున్
సుందరి! నీకునున్కియిది చూడగఁదానుచితంబెనావుడున్,
మంద మనోజ్ఞ హాసముఖ మండల మెత్తిమృగాక్షిచూచి సం
క్రందన సన్నిభున్ నృపతిఁగన్యక యిట్లని పల్కెఁప్రీతితోన్॥

ఇది శంతనుడు యోజనగంధితో పల్కిన పద్యము. ఇచట రసము శృంగారము. అరసముపై పద్యము నందలి మాధుర్యగుణముచే చక్కగా ప్రకాశించుచున్నది.

పాండవులరణ్యమున కేగునపుడు కుంతి సహదేవునితో పలికిన మాటలు మాధుర్యగుణముతో కూడి కరుణమును చక్కగా వ్యక్తము చేయుచున్నవి.

కం. "అన్న! సహదేవ నీవును
నన్నలతో నరిగెదయ్యయట యడవులకీ,

వున్నను సుతులందరు నిం
దున్నట్లుల నాకుఁజిత్తమూరడియుండున్॥

విన్నంత మాత్రముచే ఏరచన వలన అర్థము స్పష్టమగునో అరచన ప్రసాదగుణమును తెలుపుననియు, అది సర్వరస సాధారణమనియు ధ్వన్యాలోకము చెప్పుచున్నది. దీనికి తార్కాణములు నన్నయభారతభాగమున కలవు.

ఉ. నిందు మనంబు నవ్యనవనీత సమానము, పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు, నిక్కమి॥
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁడోపునో
పండతి శాంతుఁడయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపగన్॥

పద్యారంభము నందలి నకార వృత్త్యనుప్రాసము మార్దవమును, దారుణాఖండల శస్త్ర తుల్యమను సమాసమునందలి ఖ, శ అను వర్ణములు పారుష్యమును సూచించుచు శ్రవణమాత్రముచే నర్థము స్ఫురింపజేయుచున్నవి. కేవల మృదుసరళాక్షరములతో కూడిన పదముల కూర్పుచే అక్షరరమ్యత ఏర్పడునని తలంపరాదు. అక్షరరమ్యత యనునది పదములందున్నయక్షరముల సరళతా పారుష్యములపై కంటె రసానుగుణత్వముపై నెక్కువగా నాధారపడియుండును. కాబట్టి రసానుగుణముగ పదములను కూర్చుటయే అక్షరరమ్యత.

చ. "నలదమయంతులిద్దఱు మనః ప్రభవానల బాధ్యమానలై।
సలిపిరి దీర్ఘవాసర నిశల్ విలసన్నవ నందనంబులన్॥"

అను దానియందెంత అక్షరరమ్యత యున్నదో

"అనిన విని జరాసంధుండు సటా సముత్పాటన కుపిత కుంజరవైరియుంబోలెఁగడు నలిగి పటు కుటిల భ్రుకుటి ఘటిత నిటలుండగుచు" అనుదాని యందు కూడ నంతే యక్షరరమ్యతయున్నది.

ఈ యక్షరరమ్యతకు సంబంధించినదే నాద సౌందర్యము. నన్నయరచనలో సర్వత్ర నాదసౌందర్యము గోచరించుచుండును. ఈ నాదసౌందర్యముచే పద్యము వీనులకు విందుగా నుండును. వేదబుక్కులు సుస్వరముగా నుచ్చరింపబడినపుడు వాని యర్థము మనకవగతము కాకపోయినను అందలి ధ్వని గాంభీర్యము మానసముల నాకర్షించియలరించుచుండును. నన్నయ సంహితాభ్యాసుండు వేదస్వరముల ధ్వని యాతనికి సుపరిచితమైనది. అందుచేతనే కొన్ని ఘట్టములందాతని పద్యములు వేదబుక్కులవోలె ధ్వనించుచుండును. ఉదంకుడు నాగరాజుల స్తోత్రము చేసినప్పటి పద్యములే దీనికి తార్కాణములు.

చం. "బహువన పాదపాబ్ధికుల పర్వత పూర్ణ సరస్సరస్వతీ
సహిత మహా మహీ భరమజస్ర సహస్ర ఫణాళిఁదాల్చిదు।
స్సహతర మూర్తికిన్ జలధిశాయికిఁబాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁడనంతుఁడు మాకుఁబ్రసన్నుఁడయ్యెడున్॥

యయాతి దేవయానిని నూతి నుండి యుద్ధరించినపుడు నన్నయ రచించిన యీ పద్యమునందును నాదసౌందర్యము గంభీరముగా నున్నది.

చం. జలధి విలోల వీచి విలసత్కల కాంచి సమంచితావనీ
తల వహన క్షమంబయిన దక్షిణహస్తమునన్ దదున్నమ।
ద్గళదురు ఘర్మవారి కణకమ్ర కరాబ్జము పట్టి నూతిలో
వెలువడఁగో మలిందిగిచె విశ్రుత కీర్తి యయాతి ప్రీతితోన్॥

నన్నయ-నానారుచిరార్థసూక్తి నిధి:-

నన్నయభట్టు "సారమతింగవీంద్రులు....." అను పద్యములో తాను నానా రుచిరార్థసూక్తి నిధినని వక్కాణించెను. నానారుచిరార్థసూక్తి నిధియనగా నేమో యోజింతము.

నానా=అనేకములైన, విస్తారమైన, రుచిర=మధురమైన, అర్థ=అర్థములుగల, సూక్తి=సూక్తులకు, నిధి=గనివంటివాడు. ఇట రుచిమంతమైనది రుచిరమని చెప్పవలయును. రుచియనగా సహృదయాహ్లాదకరమైనది. దీనినే దండి 'ఇష్టార్థము' అని వ్యవహరించెను. "శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావలీ" అని యాతని కావ్యలక్షణము. నన్నయ రుచిరార్థము, దండి యిష్టార్థమును అభిన్నములనియే చెప్పవచ్చును. దీనినే తరువాతి వాడగు జగన్నాథుడు "రమణీయార్థము" అని పేర్కొనెను. దండి, నన్నయ, జగన్నాథుడు నొకకోవకు చెందినవారు.

రుచిరార్థము అనునది సూక్తికి విశేషణము. అప్పుడు రమణీయములై చదివినకొలది చవులూరించు నర్థములు గల సూక్తియని యర్థము చెప్పవచ్చును. భారవి "హితం మనోహారిచ దుర్లభం వచః" అని యనెను. కొన్ని వాక్కులు హితకరములయ్యును. మనోహరముగ అనగా రమణీయముగ నుండవు. ఆ రెండు గుణములు నొక్కచోగూడి యుండుట యరుదు. నన్నయ సూక్తులలో నా గుణద్వయము గోచరించుచుండును.

దేశికావ్యములందు సూక్తులకే అగ్రతాంబూలమని దండి చెప్పెను. సేతుబంధ కావ్యమును గూర్చి యాతని ప్రశంసావాక్యములు గమనింపదగినవి.

శ్లో॥ "మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః॥
సాగరః సూక్తి రత్నానాం సేతుబంధాది యన్మయమ్"॥

మహారాష్ట్ర దేశమాశ్రయముగా గల భాషను ప్రశస్తమైన ప్రాకృతముగా విజ్ఞులు తలంతురు. సూక్తి రత్నములకు నిలయమైన సముద్రమువంటి సేతుబంధాది కావ్యములిందే వెలసినవి-అని యాశ్లోక-తాత్పర్యము. అదిశబ్దముచే సప్తశతి వంటి యితర కావ్యములని వ్యాఖ్యాతలు వివరించిరి. ప్రాకృతకావ్యములకును, దేశికావ్యములకును సూక్తి సంపద ప్రత్యేకలక్షణముగా చెప్పినట్లైనది. నన్నయభట్టు కూడ ఈ భావమే కలవాడుగా తోచును. నన్నయభట్టే కాదు ప్రాచీనులైన ఆంధ్రకవులు కూడ ఈ భావమే కలవారుగా కనబడుచున్నారు. నన్నయకు సమీపస్థుడగు నన్నెచోడుడు "సూక్తులార్యులకుఁ గర్ణరసాయనలీలఁగ్రాలగాన్" అనియు, "మృదురీతి సూక్త లింపొదవింప" అనియు, "జంగమమల్లికార్జునుని నిసర్గకవి స్తవనీయ సూక్తి యుక్తిం గొనియాడి" అనియు కుమార సంభవపీఠికలో చెప్పెను. శ్రీనాథుడు కూడ కాశీఖండమునందు

"పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని శేవ
సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు"

అని సూక్తివైచిత్రి తన కవిత్వ లక్షణమైనట్లు చెప్పెను.

సూక్తియనగా రుచిరమై చమత్కారయుక్తమైన కూర్పు. పైని యుదాహరింపబడిన దండి శ్లోకమునకు వ్యాఖ్యాన మీక్రింది విధముగా నున్నది.

సూక్తిరత్నానాం-చమత్కారపూర్ణవచనానాం, నిధిః. యథా సాగరే మహార్ఘమణయో వసంతి. తథైవ మహారాష్ట్ర భాషా నిబద్ధే సేతు బంధాదౌ కావ్యవిశేషే చమత్కారోక్తయో బాహుళ్యేన ఉపలభ్యన్తే.

కావున సూక్తియనగా చతురోక్తి యని యర్థము. నన్నెచోడుడు చతురోక్తులను ప్రశంసించెను. మొత్తము మీద సూక్తి, చతురోక్తి, చమత్కార వచనము అనునవి పర్యాయపదములని గ్రహింపవలయును. చమత్కారము పదమునందు, పదబంధము నందు, సమాసము నందు, కారకము నందు, వాక్యమునందు

బహువిధములుగ సాక్షాత్కరించును. నన్నయ పేర్కొన్న నానా రుచిరార్థసూక్తులు ఇంత వైవిధ్యము కలవి. వానినొక్కొక్క దానిని పరిశీలింతము.

**1.పదగతసూక్తి:-**

"కౌరవరాజ్యంబు కడు వెలింగె" అని నన్నయ ప్రయోగము. లోకమునందు మండుచున్నది మాత్రమే వెలుగునిచ్చును. దహింపకయే వెలుగు నిచ్చుట యిచ్చటి చమత్కారము. కౌరవ రాజ్యము ప్రకాశించుచున్నది అని యర్థము. దీనిని బట్టి ఒకానొక పదమును వాచ్యార్థమున గాక మనోహరమైన అన్యార్థమున వాడుట పదగతసూక్తి యని చెప్పవచ్చును.

**2. పదబంధగత సూక్తి:-**

"ఈ వంశము విచ్ఛేదము గావచ్చిన" అని నన్నయ ప్రయోగము. ఇందు 'కావచ్చిన' అనునది పదబంధము. అగుటకు సిద్ధము కాగా అని దీని యర్థము. ఇప్పటికిని మనమీపద బంధమును వాడుచున్నాము. ఉదా॥పని పూర్తిగావచ్చినది.

ఒకటి కన్న ఎక్కువ పదములు గుత్తిగా నేర్పడి మనోహరార్థము నిచ్చుట పదబంధగత సూక్తి యగును.

'ఎవ్వరిని మెచ్చక' అని నన్నయ ప్రయోగము. ఇట మెచ్చక అనుదానికి లెక్కచేయక అని యర్థము. ఉదా॥ పాండురాజు పరాక్రమంబున నెవ్వరిని మెచ్చక.

ఇప్పుడు మనము దీనిని పొగడక, అంగీకరింపక అను నర్థములో వాడుచున్నాము.

**3. సమాసగత సూక్తులు:-**

నన్నయకు కొన్ని సమాసపు కూర్పులు మిక్కిలి యిష్టము. కుమారాయితశక్తిశాలి, జితశ్రముడు, కృతహస్తుడు, సంశ్రిత వ్రతులు మున్నగు సమాసములవంటివి నన్నయ కవిత్వములో నెక్కువగా గోచరించును.

**4. కారకగత సూక్తి:-**

కారకము నందును వాచ్యార్థ భిన్నమైన చమత్కారమున్నచో కారకగతసూక్తి యగును. "రాజసూయము ధర్మరాజు నునుచు" అని నన్నయ ప్రయోగము. ధర్మరాజును రాజసూయమునందు ఉనుచును అనగా ప్రతిష్ఠించును అని దీనికర్థము.

"నిన్నుఁగఁఅపుడు" అని నన్నయ ప్రయోగము. నీకుఁగఁఅపుడునని యిట నర్థము. ఇట షష్ఠికి బదులుగా ద్వితీయ వాడబడినది.

**5. వాక్యగతసూక్తులు:-**

ఒక సంపూర్ణవాక్యము నందు చమత్కారార్థము నిబద్ధమై యున్నచో వాక్యగతసూక్తి యనవచ్చును.

ఈ సూక్తులలో కొన్ని విభాగములను మనము గుర్తింపవచ్చును.

1. లోకవ్యవహార జన్యములు-అనగా లోకవ్యవహారము నుండి జనించినవి. వీనినే నానుడులు, జాతీయములునని యందురు.
2. అలంకారాశ్రయములు-దీనిలోనే అర్థాంతరన్యాసాదులు వచ్చును.
3. కవికల్పితసూక్తులు-ఇవి కవి లోకజ్ఞతపై, ప్రతిభపై ఆధారపడి లోకము నందు సువ్యాప్తి పొంది సామెతలా యను భ్రాంతిని కలిగించునంతగా ప్రాకిపోవును.

1) లోకవ్యవహారజములు:- సూర్యుడు కన్యయైన కుంతితో మాటాడునప్పుడు 'చూడకుండుము' అని యనును. దీనికి వెనుదీయకుము అని యర్థము.

ఏనుద్రోణుండనువాఁడ-ఇవి ద్రోణుడు భీష్మునితో నను మాటలు నేను ద్రోణుడనని చెప్పికొనుట

ప్రాచీనాచారము కాదు. నన్ను ద్రోణుడందురు అని యనుట యాచారము. ఈ నాటికిని పెద్దలీ సంప్రదాయము ననుసరింతురు.

"తనయుండేడ్చును పాలు నాకుఁబోయుండనుచున్"-ఇవి ద్రోణాచార్యుని మాటలు. ఇచట ఏడ్చుట యనగా మారాము చేయుట అని యర్థము.

2) అలంకారాశ్రయములు:-

"మున్గట్టిన కర్మ ఫలంబులు, నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్"-పాండురాజు పశ్చాత్తాపము పొందుచుననుకొనిన మాటలు.

పాపమో పుణ్యమో మూటగట్టుట అను వ్యవహారము నేటికిని గలదు. పాండురాజు నిర్వేదము నందే "జీవించిన, మృతిఁబొందిన నిర్విశేషము" అను వాక్యము కూడ కలదు. బ్రతికినను, చచ్చినను ఒక్కటే అని నేటివాడుక. ఇట్టి సూక్తులలో కొన్ని నీతిబోధకములు. మఱికొన్ని కర్తవ్యబోధకములు. ఇంక కొన్ని వేదాంత ప్రతిపాదకములు.

3) కవికల్పిత సూక్తులు:-

నన్నయ మూలమున లేకపోయినను పెక్కుచోట్ల సూక్తులను కల్పించి వ్రాసెను. కావ్యమునకు రసానందమే ప్రధాన ప్రయోజనమైనను అందు ధర్మోపదేశము కూడ ఉండుట మేలని అలంకారికు లంగీకరించిరి. అందుచే కవులు వ్యంగ్యమునే కాక వాచ్యముగ కూడ నీతిధర్మములనుపదేశించుచుందురు.

నన్నయ తాను కల్పించిన సూక్తులను విడివిడి పద్యములుగ వ్రాయుచుండును. ఆ సందర్భమున వానిని తొలగించినను కథ కాటంకము కలుగదు. కావలసినవారు వానిని వల్లించి యుచితసందర్భము లందు ఉదాహరించుకొనవచ్చును. అవి కథలను వ్రాయునప్పుడేదో యొక ప్రత్యేక సందర్భమునందే వ్రాయబడినను నిజమునకు సర్వజనీనములైనవి. అందుచేతనే నన్నయ విడిగాతీసి వివిధ సందర్భములందు వాడుకొనుటకనువుగ వానిని స్వయంసంపూర్ణములుగా వ్రాయుచుండును. వానికర్థము వివరించునపుడు ప్రత్యేక కథా సందర్భమునకై వెదకవలసిన పనిలేదు. నన్నయ సూక్తులనేకములు కందపద్యములందే యుండును. అది, సభా పర్వములందు కంటె నారణ్యపర్వమున వాని సంఖ్యహెచ్చు.

కం. **మఱిఁదలపగ సంసారం**
**బతి చంచలమెండమావులట్టుల, సంపత్‌।**
**ప్రతతు లతి క్షణికంబులు**
**గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్‌॥**

కం. **క్షమగల వానికిఁబృథ్వీ**
**సమునకు నిత్యంబు విజయ సంసిద్ధియగున్‌।**
**క్షమియైన వాని భుజ**
**విక్రమము కదున్ వెలయు సర్వకార్యక్షమమై॥**

నన్నయ సూక్తులందొక్కొక్కచోట కథకు సంబంధించిన ఎంతో యర్థమును ధ్వనింప జేయుచుండును. నలోపాఖ్యానమున నలుడు దమయంతిని విడిచి వెళ్ళిపోయిన తరువాత నామె యాతనికై చుట్టుపట్ల వెదకెను. అతడెచ్చటను గానరాలేదు. అప్పుడామె దుఃఖించుచు

కం॥ వగవగ సాంగోపాంగము
లగు నాలుగు వేదములయ్యునధ్యయనము పొ।

ల్పగ నొక సత్యముతో నెన
యగునే యెవ్వియును బోలవటె సత్యంబున్॥

అని పలికి యుండెను. ఇది పైకి సత్యము యొక్క మహిమను తెలుపు సూక్తిగా గోచరించును. కాని పరిశీలించినచో నిందు నలుని విద్యావైదుష్యములు చక్కగా ధ్వనితములగుచున్నవి. వేదములు, షడంగములు, మీమాంసాన్యాయపురాణధర్మశాస్త్రములు ననువానికి చతుర్దశ విద్యలని పేరు. నలుడు సాంగోపాంగముగ వేదాధ్యయనము చేసెను. కాని నన్నయ కథారంభమున నలుని వైదుష్యమును గూర్చి యేమియు చెప్పలేదు. మా వలె నరణ్యములలో కష్టములు పడినవారెవరైన నుండిరా? యని ధర్మజుడడిగిన దానికి సమాధానముగ బృహదశ్వుడు నలోపాఖ్యానమును చెప్పెను. ఇట నలుడు పడిన యిడుమలకే ప్రాధాన్యము. నన్నయ వానినే నలోపాఖ్యానమున వివరింపనెంచెను. అందుచే మొదట నలుని గుణగణములను గాని, విద్యావైదుష్యములను గాని వాచ్యముగ చెప్పలేదు. పైనుదాహరించిన సూక్తిని చెప్పుచు నన్నయ నలుని పాండిత్యవిశేషమును వ్యంగ్యముగ వెల్లడించెను. అతని సూక్తుల రుచిరార్థత్వమునకిది యొక మనోహరదృష్టాంతము.

## ఆంధ్రశబ్దచింతామణి కర్తృత్వము

నన్నయ ఆంధ్రశబ్దచింతామణియను నామాంతరము గల ప్రక్రియాకౌముది యను వ్యాకరణమును రచించెనని కొందరును, నన్నయ వ్యాకరణము వ్రాయలేదనియు, ఎలకూచి బాలసరస్వతియో, మఱియొకరో వ్యాకరణమును రచించి దానికి ఖ్యాతి వచ్చుటకై నన్నయపేరు పెట్టెననియు కొందరును వాదించుచున్నారు. నన్నయకు వాగనుశాసనుడనియు, శబ్దశాసనుడనియు బిరుదు ఆంధ్రశబ్దచింతామణి వ్రాయుటచే వచ్చెనని కొందరందురు. కాని నన్నయకు నా బిరుదము వ్యాకరణరచనము వలన రాలేదు. తన కాలమునందలి పదజాలమును చక్కగ సంస్కరించి మృదువుగ, సరస కవిత్వమున కర్హమగునట్లుగ చేయుటచే నన్నయకు శబ్దశాసనుడను బిరుదువచ్చినది. చింతామణియందలి "సకలభాషావాగనుశాసన నన్నయభట్ట విరచితాంధ్రశబ్దచింతామణి" అను గద్యము గ్రంథమునకు గౌరవము కలుగుటకై ఇతరులచే చేర్పబడినది. నన్నయ ఇతరభాషలలో వ్యాకరణము వ్రాయకపోవుటచే సకలభాషా వాగనుశాసన శబ్దమితని కన్వయింపదు.

అప్పకవి తన అప్పకవీయమున కాళ్లు చెవులు లేని ఈ క్రింది కథ చెప్పెను. నన్నయభట్టు మొదట ఆంధ్రశబ్దచింతామణి రచించి తల్లక్ష్యముగ భారతమున మూడు పర్వములు తెలిగించెను. అంతట వేములవాడ భీమకవి నన్నయ భారతము రచించి తన రాఘవ పాండవీయము నణచెననియు, తన ఛందశ్శాస్త్రము నణచుటకే తిరిగి ఆంధ్రశబ్ద చింతామణిని రచించెననియు తలంచి, ఆంధ్రశబ్దచింతామణిని దొంగిలించి అణచివేసెను. రాజరాజనరేంద్రుని కుమారుడగు సారంగధరుడు విద్యాభ్యాససమయమున నన్నయ రచించిన ఆంధ్రశబ్దచింతామణిని నేర్చెను. ఇక నెవ్వరికి ఆంధ్ర శబ్దచింతామణి తెలియదు. పిదప రాజరాజనరేంద్రుడు తన కాళ్లు చేతులు నఱికింపగా సారంగధరుడు మత్స్యనాథుని కృపచే అవి తిరిగి మొలవగా సిద్ధుడై సిద్ధులలో కలసిపోయెను. సిద్ధుడైన సారంగధరుడు కీలక సంవత్సరమున మతంగ పర్వతము నొద్ద బాలసరస్వతికి ఆంధ్రశబ్దచింతామణి నిచ్చెను. అతడు దానికి టీక రచించెను. కాబట్టి వేములవాడ భీమన గోదావరిలో కలపిన ఆంధ్రశబ్దచింతామణి సారంగధరుని వలన భూమిపై తిరిగి వెలసినది.

నన్నయ కాలము నుండి బాలసరస్వతి వరకు దాదాపు 500 సంవత్సరములణగి యున్న ఆంధ్రశబ్దచింతామణి తిరిగి బయటపడుట అసంగతము. బాలసరస్వతి కాలముదాక నన్నయ వ్యాకరణము

రచించెనను మాట ఎవ్వరికిని తెలియదు. మఱియు చిత్రాంగీ సారంగధరుల కథ ఆంధ్రదేశచరిత్రములో లేదు. కాన విశ్వాసార్హము కాదు. ఈ కథ మాళవదేశరాజునకు చెందినది కాని ఆంధ్రరాజుల కథకాదని గౌరన రచించిన నవనాథ చరిత్రము నుండి స్పష్టముగా తెలియును. అప్పకవి కలలో తనకు గోపాలదేవుడు చెప్పినట్లుగా కథను కల్పించెను గదా. భీమకవి ఆంధ్రశబ్దచింతామణినే అణచి భారతమునేల అణపలేక పోయెను. నన్నయ సారంగధరునకొక్కనికి మాత్రమే ఆంధ్రశబ్దచింతామణి నేల చెప్పెను. ఇతర శిష్యులు దానినేల పఠింపకుందురు. ఇన్ని హేతువులచే అప్పకవి మాటలు బూటకములగుచున్నవి.

మఱియు నీక్రింది కారణములచే చింతామణి నన్నయ కృతము కాదని స్పష్టమగుచున్నది. ఆంధ్రశబ్దచింతామణిలో "నుమ్యోతో హల్యధర్వణాచార్యమతాత్" అను సూత్రములో అధర్వణుని పేరుదాహరింపబడినది. అట్టైన అధర్వణుడు నన్నయకు పూర్వుడు కావలెను. అధర్వణకారికలలో "అప్రయుక్తత్వదోషస్తు నవిరుద్ధో హరేర్మతే" అను సూత్రమున హరిపేరుదాహరింపబడినది. కాబట్టి నన్నయ కంటె అధర్వణుడు అతని కంటె హరియును పూర్వులు కావలయును. శిష్టుకృష్ణమూర్తి వ్యాఖ్యానించిన హరికారికలవియే యగుచో విశేషాంశములుగల హరికారికలకు లేని ప్రశస్తి అల్పాంశములుగల ఆంధ్రశబ్దచింతామణికి రాజాలదు. అట్టిదానిని నన్నయ వ్రాయుటలో ప్రయోజనము లేదు. మఱియు ప్రాచీన వైయాకరణులగు కేతన, తాతంభట్టు, ముద్దరాజురామన, అప్పకవి, కూచిమంచి తిమ్మన మొదలైన వారెవ్వరు ఈ హరికారికలను పేర్కొనరైరి. కాన హరికారికలును, ఆంధ్రశబ్దచింతామణియు ప్రాచీనకర్తృకములు కావు. కాని ఆంధ్రశబ్దచింతామణి యందభిమానము కలవారు ఆ సూత్రములు ప్రక్షిప్తములని వాదింతురు. గ్రంథమంతయు ప్రక్షిప్తమనినచో సమంజసముగా నుండును గదా.

మఱియు నీక్రింది కారణములచే ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృతము కాదని స్పష్టమగుచున్నది. ఒకవేళ నన్నయయే వ్యాకరణమును వ్రాసియుండినచో కేతన తన యాంధ్ర భాషాభూషణమునందు నీవిధముగా చెప్పియుండడు.

కం. మున్ను తెనుగునకు లక్షణ
మెన్నడు నెవ్వరును జెప్ప, రేఁజెప్పెద, వి।
ద్వన్నికరము మది మెచ్చఁగ
నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్॥

తే.గీ॥ సంస్కృత ప్రాకృతాది లక్షణము చెప్పి
తెలుఁగునకు లక్షణము మున్ను తెలుపకునికి।
కవి జనంబుల నేరమి కాదు, నన్ను
ధన్యుఁగావింపఁదలఁచిన తలఁపు గాని॥

ఆంధ్రశబ్దచింతామణిలో చెప్పబడిన కొన్ని సూత్రములను నన్నయభట్టే యనుసరింపలేదు. కాబట్టి యిది నన్నయకృతము కాదనుట స్పష్టము. "సర్వత్రాజ్వత్వార్యంజ్ఞేయం యస్యద్రుతప్రకృతికేభ్యః" సర్వత్ర అచ్చుమాదిరిగనే ద్రుతప్రకృతికమునకు పరమైన యకారమునకు కూడ వ్యాకరణ కార్యములు ప్రవర్తిల్లునని ఆంధ్రశబ్దచింతామణి చెప్పుచున్నది. ఇట్టి ప్రయోగములు నన్నయభారతమున మృగ్యము.

"నిత్యమనుత్తమ పురుషక్రియాస్వితః" ప్రథమ, మధ్యమ పురుషక్రియల ఇకారమునకు సంధి నిత్యమని చింతామణి సూత్రము. ప్రథమపురుషేకారమునకు సంధి వైకల్పికముగా నన్నయ ప్రయోగించినాడు.

ఉదా:– "కొందఱధికహాస్యంబు సేసిరి, యడవి నేమి రోసెదనిరి."

"వసతిరనుబంధక స్యాద్యత్రలదర్థో వివక్షితస్తత్ర". "అస్తిరనుబంధక స్యాద్యత్ర లదర్థో వివక్షితో ధాతోః"

అని ఆంధ్రశబ్దచింతామణియందు క్రియాపదమునకు వర్తమానార్థమున 'ఉన్న' (వసతి) అనుబంధకమును, భవిష్యదర్థకమున 'కల' (అస్తి) అనుబంధకమును విధింపబడినవి. కాని నన్నయ భారతమున అయాయర్థములయందే యనుబంధకములు లేక వ్రాయుటయే కాక అయనుబంధములున్న ప్రయోగమొక్కటియైనను కానరాదు.

ఉదా॥ 1."మన్మధు నొఅపులఁబడియెడు నితండు"

2. నావుడు నట్టుల చేయుదునని నలుడు సేవించె తగన్.

తిక్కన కాలము నందు కూడ నన్నయ ప్రయోగములే యున్నట్లు కేతన రచించిన ఆంధ్రభాషాభూషణమును బట్టి తెలియుచున్నది. అప్రయోగములే విన్నకోటపెద్దన కాలమున నున్నట్లు అతడు రచించిన కావ్యాలంకారచూడామణిని బట్టి తెలియుచున్నది.

"కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే
హ్యేషు ప్రథమైక వచన మాత్రే వికృతౌ నాన్తాదయోపి కథ్యన్తే"

అనెడి ఆంధ్రశబ్దచింతామణి సూత్రము క్రియాపదములందు, నామపదములందును ఉకారము లోపించునని కవిభల్లటుల చేత విధింపబడినట్లు చెప్పుచున్నది. విక్రమార్కచరిత్రమును వ్రాసిన కవిభల్లటుడు నన్నయ తరువాతివాడని తెలియుచున్నది. ఇటీవలవారి పేర్లు చింతామణిలో నుదాహరింపబడుటచేనది నన్నయకృతము గాదని స్పష్టముగదా.

భీమన కవిజనాశ్రయములో విన్నకోట పెద్దన రచించిన కావ్యాలంకారచూడామణి నుండి కొన్ని పద్యములను ప్రమాణముగా గ్రహించెను. కావున భీమన పెద్దన తరువాతి కాలము వాడై యుండవలయును. అందుచే భీమన నన్నయ వ్యాకరణము నణపజాలడు. కావున ఆ కథ కల్ల. నన్నయ ఆంధ్ర శబ్దచింతామణిని వ్రాయలేదనుట స్పష్టము.

కొన్ని భారత ప్రయోగములకు ఆంధ్రశబ్దచింతామణియందు సూత్రములే లేవు. దీనిని బట్టి చూడగా ఆంధ్రభాషాభూషణము మున్నగువాని సహాయమున బాలసరస్వతియే ఆంధ్రశబ్దచింతామణిని వ్రాసి దానికి గౌరవము కలుగుటకే నన్నయ పేరు పెట్టియుండును.

## పావులూరి మల్లన

గ్రంథముద్రణము లేని పూర్వకాలమున పాఠకులు ధారణచేయుట కనుకూలముగ నుండుటకై ప్రతిశాస్త్ర విషయమును ఛందోబద్ధముగ పద్యములలో రచింపబడునాచారమును పూర్వకవులు పాటించిరి. వారు శాస్త్రజ్ఞాన సంపాదనమునకు పూర్వము భాషాజ్ఞానమును గూడ పరిపూర్ణముగ నలవరచుకొనెడివారు. కావుననే శాస్త్ర విషయమునైన సుకరముగా పద్యములలో రచించుటకు కర్తలకు గాని, గ్రహించుటకు పాఠకులకు గాని ఏ మాత్రము క్లేశముండెడిది కాదు. పరిపూర్ణభాషాపాండిత్యము లేని ఈ కాలము వారు ప్రాచీనకాల శాస్త్ర గ్రంథములు పద్యములలో రచింపబడుటచే అందలి శాస్త్రపరిభాషను, పారిభాషిక పదములను అర్థము చేసికొనలేకపోవుటయే కాక, పద్యము నన్వయము చేసికొను పాండిత్యము కూడ లోపించుటచే అగ్రంథములు క్రమక్రమముగ మూలపడిపోయినవి. కొన్ని శతాబ్దములు గతించిన యిప్పుడు వాని యునికియే లోకమునకు తెలియరానిదైనది. ఇట్టి భాషాస్థితికి తోడు శాస్త్రవిషయమగాధమై బహు ప్రౌఢముగా నున్నప్పుడు క్లేశ మధికముగా నుండునుగదా.

ఈ కాలమున శాస్త్రములన్నియు పాశ్చాత్య భాషలో పాశ్చాత్య శాస్త్ర సంప్రదాయానుగుణముగా రచింపబడి పఠింపబడుచున్నప్పుడు మన ప్రాచీన శాస్త్రముల సంప్రదాయములను, పరిభాషలను గుర్తింపలేని స్థితిలో మనమున్నామనుటలో విచిత్రమేమియు లేదు. అట్టి యగాధశాస్త్ర విషయములను అకాల రచయితలు

సలక్షణమైన పద్యములో, సరళమైన శైలిలో సులభగ్రాహ్యమగునట్లు నిరాయాసముగా వ్రాయగల్గిరనుట మనకాశ్చర్యమిప్పుడు గల్గించును. కాని ఆనాడది అంతకష్టకార్యముగ నుండెడిది కాదు.

క్రీ.శ. 9వ శతాబ్దము నందలి జైనపండితుడు వీరాచార్యుడు సంస్కృతభాషలో "గణితసారసంగ్రహము" అను గణితశాస్త్ర గ్రంథమును రచించెను. పావులూరి మల్లన ఈ గణితసార సంగ్రహమునే తెలిగించెను. మహావీరాచార్యుడు దశవిధగణితములను చేర్చి తన గ్రంథమునకు "గణితసారసంగ్రహ"మని పేరుబెట్టెను. దానిలో 1.భిన్న ప్రకీర్ణము 2.భాగహార గణితము 3.సువర్ణ గణితము 4.మిశ్ర గణితము 5.భిన్న గణితము 6.క్షేత్ర గణితము 7.ఖాత గణితము 8.ఛాయా గణితము 9.సూత్ర గణితము 10.ప్రకీర్ణ గణితము అను దశవిధ గణితములు కలవు. వీరాచార్యుని గణితసారసంగ్రహము కర్ణాటభాషకును అనువదింపబడినది.

పావులూరి మల్లన గణితసారసంగ్రహమందలి భిన్న ప్రకీర్ణమును మాత్రమే యనువదించెను. ఇతడు కమ్మనాటిలోని పావులూరి గ్రామమునకు కరణము. ఈ పావులూరు గోదావరి మండలమున గాక గుంటూరు మండలము నందలి బాపట్ల తాలూకాలో నున్నది. పావులూరిమల్లన తాతపేరు కూడ మల్లనయే. తాతయగు మల్లనకే రాజరాజనరేంద్రుడు పిఠాపురప్రాంతము నందలి నవఖండవాడయను గ్రామము నగ్రహారముగా నిచ్చెను. రాజరాజనరేంద్రుడు క్రీ.శ.1022 నుండి 1063 వరకు వేగిదేశమును పరిపాలించెను. గణితశాస్త్రకర్త మల్లన తాతయగు మల్లన రాజరాజనరేంద్రునకు సమకాలికుడు. కావున మనుమడగు మల్లన క్రీ.శ.1100 ప్రాంతమున జీవించియుండును. నవఖండవాడ తమజీవితమునకు చాలనందున రాజరాజనరేంద్రుని సమకాలికుడగు మల్లన తరువాత నతని కుమారుడో, మనుమడో పావులూరి గ్రామ కరణికమును సంపాదించి అటకు చేరియుండును.

పావులూరి మల్లన తెలిగించిన 'గణితసార సంగ్రహము' పావులూరి గణితమని ప్రసిద్ధికెక్కినది. దీనిలో ఆనాడు పావులూరు గ్రామప్రాంతములందు వాడుకలో నున్న మానములు, కొలతలు తెలుపబడినవి. బెంజమిన్ హైన్ అనునతడు పావులూరి గణితమును ఆంగ్లభాషకనువదించెను.

-0-




ఆంధ్రదేశమునందు ఆర్యవిజ్ఞానమును, వైదికమతసిద్ధాంతములను ప్రచారము చేయుటకై నన్నయభట్టు భారతాంధ్రీకరణమునకు పూనుకొనెనుగదా. నన్నయ రాజరాజనరేంద్రుల మరణానంతరము భారతానువాదోద్యమము నిలిచిపోయినది. ఈ నిలిచిపోవుట 200 ఏండ్లు పట్టెను. ఈ దీర్ఘకాలములో తెలుఁగునాడు శాంతికి నోచుకొనలేదు. దీనికి ఆనాటి రాజకీయపరిస్థితులు, మతవిప్లవము ప్రధానకారణములని చెప్పవచ్చును.

రాజకీయపరిస్థితులు:-

రాజరాజనరేంద్రుని మరణానంతరము అతని కుమారుడైన కులోత్తుంగచోళుడు చోళదేశమున మాతామహరాజ్యము నందుండుటచే రాజరాజనరేంద్రుని తమ్ముడగు విజయాదిత్యుడు వేంగిరాజ్యమునాక్రమించెను. కాని కులోత్తుంగుడు వేంగిదేశముపై దండెత్తి విజయాదిత్యుని జయించి చాళుక్యసింహాసనమధిరోహించెను. ఈ కాలముననే పశ్చిమచాళుక్యచక్రవర్తియగు ఆఱవ విక్రమాదిత్యుడు వేంగిదేశముపై దండెత్తెను. కులోత్తుంగుడతనిని కూడ జయించెను. ఇంతలో నొక గొప్ప మార్పు కలిగెను.

కులోత్తుంగుడు చోళరాజకుమారుని చంపి మాతామహరాజ్యమైన చోళరాజ్యమునాక్రమించి వేంగిరాజ్యమునకు తనపినతండ్రియగు విజయాదిత్యునినే పునరభిషిక్తుని జేసెను. విజయాదిత్యుని మరణానంతరము కులోత్తుంగచోళుని కుమారులు తండ్రిచేత రాజప్రతినిధులుగా నియమితులై వేంగిరాజ్యమును పరిపాలించిరి. కులోత్తుంగ చోళుని కాలమునందే వెలనాటి చోళులు వేంగిరాజ్యమున రాజప్రతినిధులకు సహాయోద్యోగులుగా నియమింపబడిరి. కులోత్తుంగుడు చనిపోయిన తరువాత అప్పటివరకు వేంగిరాజ్యమును పరిపాలించుచున్న అతని కుమారుడు విక్రమచోళుడు దక్షిణదేశమునకేగి సింహాసనమాక్రమించెను. విక్రమచోళుడు చోళరాజ్యమునకు పోయిన తరువాత వెలనాటిచోళులు వేంగిరాజ్య ప్రతినిధులై చోళచక్రవర్తులకు లోబడి వారిపేర్లే తమ పుత్ర పౌత్రులకు పెట్టి కృతజ్ఞతతో ఆంధ్రదేశమును దాదాపు నూటేండ్లు పరిపాలించిరి. ఈవిధముగా తూర్పు చాళుక్యరాజ్యము చోళరాజ్యములో నైక్యము చెంది, వేంగిరాజ్య పరిపాలనము క్రమక్రమముగా చాళుక్యుల నుండి వెలనాటిచోళులకు సంక్రమించెను. కులోత్తుంగ చోళుని మరణముతో చోళరాజ్యవైభవము క్షీణింపసాగినది. ఆఱవ విక్రమాదిత్యుని మరణానంతరము పశ్చిమ చాళుక్య సామ్రాజ్యవైభవ మడుగంటెను. ఈ సమయమునందే కాకతీయులు విజృంభింపజొచ్చిరి.

ఈ కారణములచే నన్నయ ప్రారంభించిన భారతాంధ్రీకరణమును ప్రోత్సహించుటకు రాజరాజనరేంద్రుని వంటి సాహిత్య ప్రియుడు లేకపోవుటవలన భారతానువాదమును కొనసాగింపగా నెవరికి నవకాశము లేకపోయినది. కులోత్తుంగచోళుడు చాళుక్యరాజ్యపాలనమునందు కాక చోళరాజ్యపాలనమునందభిమానము గలవాడు. అతడాంధ్రకవులనేమి యాదరింపగలడు? ఇక నతని కుమారులు నల్వురును కొంత కొంత కాలము మాత్రమే ఆంధ్రదేశమును రాజప్రతినిధులై పరిపాలించిరి. వారికాంధ్రదేశము మీద, ఆంధ్రభాషపైని గాఢానురాగముండదుగదా. దీనికి తోడు పరరాజుల తోడియుద్ధములు ప్రాప్తించుటచే దేశము సారస్వతాభివృద్ధి కనుకూలముగా లేక నన్నయభారతాంధ్రీకరణము నిలిచిపోయినది.

మతపరిస్థితులు: -

రాజరాజనరేంద్రుని తరువాత దక్షిణభారత దేశమును మహారాజులందరు సామాన్యముగా వైదిక, శైవ మతస్థులైనను సామంతులు, దండనాథులు మొదలగు రాజకీయోద్యోగులు జైనులై జైనమతపోషకులగుటచే అది జన సామాన్యమతమై వర్ధిల్లుచుండెను. జైనమండలేశ్వరులు, జైనదండనాథులు సామ్రాజ్యసంపాదనకు ప్రయత్నించుచుండిరి. వైదికశైవ మతాచార్యులు జైనమతనాశము చేయుటకు ప్రయత్నించుచుండిరి.

వైదిక మతమీకాలమున అనేక సంస్కారములను పొందెను. దక్షిణదేశమునకు వచ్చిన ఆర్యబ్రాహ్మణులు శైవులైనను కర్మప్రధానమైన వైదిక మతస్థులుగనుండిరి. శైవమతము కాలము ననుసరించి పాశుపతము, యోగశైవము, కాపాలికము, కాలాముఖము, లాకులము మొదలగు భేదములను పొందుచుండును. శంకరాచార్యుల తరువాత అద్వైతమతము ప్రధానమైనది. శైవమతభేదము లేర్పడునప్పుడే మంధానభైరవుడను శివాగమాచార్యుడు, కాలాముఖయోగియైన మల్లికార్జునుడు మొదలగువారు మధుర, అలంపురము, శ్రీశైలము, బలిగ్రామము మొదలైన క్షేత్రములను నిర్మించుకొని శైవమతప్రచారము చేయుచుండిరి. కుమారిలభట్టు ఇంతకు పూర్వమే కర్మప్రధానమైన పూర్వమీమాంసను ప్రతిపాదించి వైదికమతమునకు తిరిగి ప్రాణము పోసెను.

కర్మప్రధానమగు కుమారిలభట్టు పూర్వమీమాంస గాని, జ్ఞానప్రధానమగు శంకరుని అద్వైతముగాని ప్రజాసామాన్యమున కందుబాటులో లేవు. కనుక దక్షిణ హిందూ దేశమున భక్తి ప్రధానమైన వైష్ణవమతమును యామునాచార్యుడు, రామానుజాచార్యుడు ప్రచారము చేయుచుండిరి. ఈ వైష్ణవమతము అభివృద్ధిచెంది వీరవైష్ణవముగా పరిణమించెను. జైనబౌద్ధులు వైష్ణవుల కపకారము చేయప్రయత్నించినప్పుడు రామానుజుడు మాలమాదిగల సాయమున వారిని గెలిచి వారికి వైష్ణవాలయముల యందు ప్రవేశమును ప్రసాదమును కలుగజేసి వైష్ణవమతమున చేర్చుకొనెను.

పండ్రెండవ శతాబ్దములో కల్యాణ పురాధీశ్వరుడైన బిజ్జలుని దండనాయకుడును, ధనాగారాధిపతియునగు బసవేశ్వరుడు రజోగుణప్రధానమైన వీరశైవమతమును స్థాపించి ప్రచారము చేసెను. శైవమనాది కాలము నుండి యున్నను బసవేశ్వరుని మూలముగా నది వీరగుణ ప్రధానమైనది. వీరశైవులకు అద్వైతజైనబౌద్ధాది పరమతద్వేషము మెండు. మహమ్మదీయుల వలె కత్తి చేపట్టి మతప్రచారమునకు పూనుకొనినవారు వీరశైవులు.

వీరశైవమును, వైష్ణవమును రెండును భక్తి ప్రధానములై వర్ణ విభేదమును రూపుమాపుటకై కంకణమును కట్టుకొన్నవియే. కాని ఈ యుభయమతానుయాయులు తమ సిద్ధాంతమే సత్యమనియు, తక్కిన మతములు పాషండమతములనియు తలంచుచుండుటచే ప్రజలలో అసహనము ప్రబలిపోయి మతయుద్ధములును, ధర్మము పేర రక్తపాతమును జరుగుచుండెను. మొత్తము మీద నన్నయ తరువాత వైదికమతములో శైవవైష్ణవశాఖలు బయలుదేరి పరస్పరము వివాదములాడుచు కర్మప్రధానమైన వైదికమతమును ధిక్కరించినవి. ఆ వైదికమతము బౌద్ధజైన మతవ్యతిరేకతతోపాటు శైవవైష్ణవముల యొత్తిడికి తాళజాలక నలిగిపోయినది. ఇందువలన వైదికమత ప్రతిపాదకమైన నన్నయ భారతానువాదమును కొనసాగించుట కనుకూలమైన మత పరిస్థితులు లేక అది మూలపడిపోవలసి వచ్చినది.

భాషాపరిస్థితులు: -

నన్నయ మార్గపద్ధతి నవలంబించి తత్సమ శబ్దజాలముతో సంస్కృత సమాసభూయిష్ఠశైలితో సంస్కృత భాషాసంప్రదాయములతో తన కాలమునాటి శిష్టులంగీకరించిన వ్యావహారికభాష

ప్రయోగములతో భారతము నాంధ్రీకరించెను. కాని నన్నయ తరువాత సాహిత్యప్రపంచమున మార్పు వచ్చినది. మార్గపద్ధతిలో కాక, దేశిపద్ధతిలో జానుతెనుగు మాటలతో సామాన్యజనభాషాప్రయోగములతో కావ్యరచన గావింపవలయునని కవులు తలంచిరి. మఱియు కథావస్తువునందు కూడ కేవలము సంస్కృతపురాణానుకరణమును వదలి దేశీయ సంప్రదాయానుగుణమైన మార్పులను ప్రవేశపెట్టి కథాకల్పనలు చేయవలయుననియు తలంచిరి. కావ్యనిర్మాణము నందు ప్రసన్నకథాకలితార్థయుక్తి మాత్రమే కాక చమత్కార కథాకల్పనలతో, రమణీయవర్ణనలతో ప్రబంధఫక్కి నవలంబింపవలయునని కవులు భావించిరి. ఈ నూతన సారస్వత భాషాభిరుచులు బయలుదేరుటచే నన్నయ కవితాపద్ధతి ప్రాతవడిపోయినది. నన్నయ కవితానుగుణముగా భారతమును పూర్తి చేయు నభిప్రాయము కవులకు కలుగకుండుటచే దానిని పూరించుట కెవరును పూనుకొని యుండలేదు. దీనికితోడు పురాణములు చెప్పుకొని జీవించు సంస్కృత పండితులు కూడ భారతాంధ్రీకరణముపట్ల విముఖత చూపియుందురు. ఈ హేతువుచే కూడ నన్నయ భారతరచనమును కొనసాగించువారు లేకుండిరి.

ఈ సంధి కాలములో మహాకవులు లేకపోలేదు. కాని వారి యభిరుచులు, అభినివేశములు మాత్రము వేఱుగా నుండెను. కవులు వీరశైవమునో, వీరవైష్ణవమునో అభిమానించు వారుగా నుండిరి. నన్నయతిక్కనల నడిమి కాలములో ఆంధ్రకవులను శైవమే ప్రబలముగా నాకర్షించినది. ఇది శివకవి యుగమని చెప్పినను అతిశయోక్తి కానేరదు. ఈ కాలమునందలి కవులలో మొట్టమొదట పేర్కొనదగిన వాడు కుమారసంభవకర్త, కవిరాజశిఖామణియగు నన్నెచోడమహాకవి.

## నన్నెచోడుండు

క్రీ.శ. 1909లో మహా పరిశోధకులు మానవల్లి రామకృష్ణకవిగారు నన్నెచోడుడు రచించిన కుమారసంభవము ప్రథమ భాగము ప్రకటించు వరకు ఈ కావ్యమును గూర్చి ఆంధ్రపండితలోకమెఱుగదు. ప్రాచీనులీ కావ్యము నెఱుగుదురు. కొన్ని లక్షణ గ్రంథములలో కుమారసంభవము నందలి పద్యములుదాహృతములైనవి. పాల్కురికి సోమనాథుడు, తిక్కన మున్నగు కవులెల్లరు నన్నెచోడుననుకరించివారే. కాని ప్రాచీనకవులెవ్వరును ఈతనిని ప్రశంసించినవారు గారైరి. అందుచే రామకృష్ణ కవిగారు కుమారసంభవమును ప్రకటించినపుడు పండితలోకము సంభ్రమాశ్చర్యచకితమైనది. మఱియు కవిగారు నన్నెచోడుడు క్రీ.శ.940 ప్రాంతము వాడని నిర్ణయించుటచే ఆంధ్రసాహిత్యమునకు నన్నయయే ఆదికవి యని విశ్వసించుచుండిన ఆంధ్ర సాహిత్య ప్రపంచమున మహా సంచలన మొక్కమారుగా కలిగినది. అదియునుగాక కుమారసంభవము అంతవరకు పండితలోకమున పరివ్యాప్తి గాంచిన కొన్నియభిప్రాయములను సమూలముగ పెల్లగించినది. ఆంధ్రసాహిత్యములో ప్రబంధకవిత్వావిర్భావమునకు నన్నెచోడుడే ప్రథమాచార్యుడు. పురాణకవిత్వమునుండి కాలక్రమమున ప్రబంధకవిత్వమావిర్భవించినదని నమ్ముచున్న పండిత లోకము కుమారసంభవ ప్రకటనానంతరము కన్ను విప్పినది. ఈ కావ్యమున నన్నెచోడ మహాకవి ప్రతిపాదించిన సిద్ధాంతములు అపూర్వములై నన్నయ కవితాభిమానులకు దిగ్భ్రమ కలిగించినవి. ఇన్ని హేతువులచే ఆనాటి పండితులందరు కుమారసంభవ పరిశోధనకు పూనుకొనిరి.

కాని తంజావూరు సరస్వతీమహలు నందలి పుస్తకభాండాగారమందు తప్ప మఱియెక్కడను మఱియొక ప్రతి దొరకమిచే ఆ వ్రాతప్రతిమీదనే ఆధారపడి పండితులు పరిశోధనలు సాగించిరి. రామకృష్ణకవిగారు తమ కడ రెండు ప్రతులున్నట్లు చెప్పిరి. కాని వారాప్రతులను ఇతరులకు చూపరైరి. ఆ ప్రతులు వారితోనే యంతరించినవని చెప్పవచ్చును.

కుమారసంభవమును బట్టి నన్నెచోడుని గూర్చి ఈ క్రిందివిషయములు తెలియుచున్నవి. అరినరపాలమౌళిదళితాంఘ్రియుగుండగువాడు, పాకనాడిరువది యొక్క వేయిటికధీశుడునైన చోడబల్లి నన్నెచోడుని తండ్రి శ్రీసతియాతని తల్లి (శ్రీసతి యను పేరు వివాదగ్రస్తమే). నేడు మనకు లభించుచున్న తంజావూరు పుస్తకభాండాగార మందలి ఏకైక మూలప్రతి యందు శ్రీయను నక్షరము స్పష్టముగా లేదనియు అది 'కొ' అను నక్షరమును పోలియున్నదనియు కోరాడరామకృష్ణయ్యగారు చెప్పిరి. ఆమె హయిహయాన్వయాంబరశశిరేఖ. నన్నెచోడుడు సూర్యవంశక్షత్రియుడై కరికాలచోళుని వంశమున జనించెను. ఇతనిది కాశ్యపసగోత్రము. కవిత్వ విశేషమును బట్టి నన్నెచోడునకు కవిరాజశిఖామణియనియు, పరాక్రమమును బట్టి టెంకణాదిత్యుడు (దక్షిణదేశసూర్యుడు) అనియు బిరుదములు గలవు. ఇతడు ఒరయూరు పురపరాధీశ్వరుడు. కుమారసంభవమను పండ్రెండాశ్వాసముల కావ్యమును రచించి నన్నెచోడుడు గురుర్దేవో మహేశ్వరః అని భావించి గురువైన జంగమ మల్లికార్జునున కంకితముగావించెను. "నింగి ముట్టియున్న జంగమమల్లయవరము నందు గనిన వస్తుకవిత తగిలి వారియందనెగడింతు, రవికి దీపమున నర్చలిచ్చుపగిదివోలె" నని చాటెను. గురువు తన కిచ్చిన విద్యను గురువునకే సమర్పించి చరితార్థుడైనవాడు నన్నెచోడుడు. అంతేకాక ఈ కవి కుమారసంభవమున సందర్భము కలిగినప్పుడెల్ల శివునకు, గురువగు జంగమ మల్లికార్జునునకు అభేదముండునట్లు వర్ణించెను.

మానవల్లి రామకృష్ణకవిగారు నన్నెచోడుడు దక్షిణదేశముననున్న ఒరయూరికి పరిపాలకుడని నిర్ణయించిరి. దక్షిణేశమున చోళరాజులు మహాసామ్రాజ్యమును నిర్మించిన మాట నిజమే. కాని నన్నెచోడుడు ఆచోళులలో నొకడుగాక తెలుగు దేశమునేలిన చోళులవంశీయుడని చెప్పవలయును. ఆంధ్రచోళరాజులు కూడ ఒరయూరు పురవరాధీశ్వరులమని చెప్పుకొనిరి. కాబట్టి ఈబిరుదము చోళులు వంశపరంపరగా వాడుకొనునట్టిదని చెప్పవలయును. ఇట్టిదే టెంకణాదిత్య బిరుదము కూడ కావచ్చును. పూర్వుల బిరుదులను తరువాతివారు వాడుకొనుట చోళచాళుక్యుల యందాచారమైయున్నది. చాళుక్యుల యందు సత్యాశ్రయ బిరుదమిట్టిదే. ఆంధ్రదేశము నేలిన తెలుగు చోళరాజుల యందు మాత్రమే నన్నెచోడ, చోడబల్లి నామములు కనబడుటయు, కవి తండ్రియగు చోడబల్లి పాకనాటియందిరువది వేయి యొక్క గ్రామమున కధీశుడని చెప్పబడియుండుటయు చూడగా నన్నెచోడుడాంధ్ర దేశమున పాకనాటి ప్రాంతము నేలిన యాంధ్రుడనుట యుచితము. కాని ఆంధ్రదేశమున వీరి రాజధాని యేదో స్పష్టముగా తెలియదు.

నన్నెచోడకవి కాలమును గూర్చి నాలుగు వాదములు గలవు. మానవల్లి రామకృష్ణకవిగారు నన్నెచోడుడు నన్నయకు పూర్వుడని నిర్ణయించిరి. దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు నన్నయకు సమకాలికుడనిరి. జయంతి రామయ్య పంతులుగారు, వేటూరిప్రభాకరశాస్త్రిగారు మున్నగు విద్వాంసులు నన్నెచోడుడు నన్నయ తిక్కనల నడిమివాడని నిర్ణయించిరి. శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిగారు ఇతడు తిక్కనల నడిమివాడని నిర్ణయించిరి. శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిగారు ఇతడు తిక్కనకు తరువాతివాడని తలంచిరి. ఎన్ని వాదములున్నను నేడు పండితులు పెక్కురు నన్నెచోడుడు నన్నయతిక్కనలకు నడిమివాడను వాదమునే యంగీకరించిరి.

కుమారసంభవకథ ప్రధానముగా స్కాంద, శివ, వాయు, బ్రహ్మాండ పురాణములందును, భారతరామాయణము లందును కలదు. కాళిదాసుని కుమారసంభవ కావ్యము జగత్ప్రసిద్ధమే కదా. కాళిదాస నన్నెచోడుల కుమారసంభవములకు కథాసామ్యమున్నను రచనములో పోలిక లేదు. నన్నెచోడుడు కాళిదాసు భావముల నెడనెడ స్వీకరించినను అతడు తనకవితా శిల్పమున కాళిదాసురచనకు మెఱుగుపెట్టబూనెను. ఉద్భటుడను కవి సంస్కృతమున సాలంకారముగా గూఢవస్తుమయ కావ్యముగా

కుమారసంభవమను హరలీలరచించినట్లు నన్నెచోడుడే చెప్పెను. కాని అది లభింపలేదు. అది నన్నెచోడుని కాలమున నుండెనేమో. అట్లైన అతడు దానిని కూడ అనుకరించెనని చెప్పదగును.

నన్నెచోడుని కుమార సంభవము పండ్రెండాశ్వాసముల మహాకావ్యము. ఇది సతిజన్మము, గణాధీశ్వరు జననము, దక్షక్రతుధ్వంసము, పార్వతి జననము, శివుని తపస్సు, రాక్షస విజృంభణము, మన్మథసంహారము, పార్వతి తపము, పార్వతీ పరమేశ్వరుల వివాహము, రతిభోగము, కుమారోదయము, తారకాసుర సంవాదము అను కథా ఘట్టములతో నొప్పుచున్నది. ఈ కావ్యము అష్టాదశవర్ణనములు, నవరసములు, ముప్పదియాఱలంకారములు కలిగి సకలావయవంబుల పరిపూర్ణంబైన దివ్యకావ్యాంగనయై మహాకావ్యలక్షణోపేతమై విరాజిల్లుచున్నది.

ఆంధ్ర సాహిత్యమున నూతన సాహిత్య సిద్ధాంతములను నన్నెచోడుడు ప్రవేశపెట్టెను. వస్తుకవిత, జాను తెనుఁగు అను పదములను మొట్టమొదట వాడినవాడు నన్నెచోడుడే. కాని వాని లక్షణములను మాత్రమితడు తెలుపలేదు. సత్కావ్యపద్ధతిని తెలుపుచు నన్నెచోడుడు జానుతెనుగు అను పదమును ఈ క్రింది పద్యమున ప్రస్తావించెను.

చం. **"సరళముగాగ భావములు జానుతెనుంగున, నింపు పెంపుతో**
**పిరిగొనవర్ణనల్, ఫణితి పేర్కొనదర్థము లొత్తగిల్ల బం।**
**ధురముగ ప్రాణముల్, మృదుమధుత్వ రసంబున కందళింపన**
**క్షరములు, సూక్తులార్యులకు కర్ణరసాయనలీలక్రాలగాన్॥**

నన్నెచోడుని తరువాత పాల్కురికి సోమనాథుడు బసవపురాణ పండితారాధ్య చరిత్రములలో జానుతెనుఁగు ప్రశంసచేసెను. సోమనాథుడు ప్రసన్నతయే జానుతెనుఁగు నందలి విశేషమని సూచించెనే కాని దాని లక్షణమీతడు కూడ వివరింపలేదు. వృషాధిపశతకములో సోమనాథుడొక పద్యమును జానుతెనుఁగున రచించెను.

చం. **బలుపొడతోలు సీరయును, బాపసరుల్, గిలుపారుకన్ను, వె**
**న్నెల తల, చేదుకుత్తుకయు నింగిని వేలుపు టేఱు, వల్లుపూ**
**సలు గల ఱేని లెంకనని జాను తెనుంగున విన్నవించెదన్**
**వలపు మదిన్ దలిర్పబసవా!బసవా!బసవా!వృషాధిపా!**

ఈ పద్యమున సంస్కృత పదములు లేవు. తేటతెలుగు మాటలు మాత్రమే కలవు. దీనినే అచ్చతెనుగు కవితయని తరువాతివారు వ్యవహరించిరి. ఇది సర్వసామాన్యమై ప్రసన్నమైనది. కాని పాల్కురికి సోమనాథుడు తేటతెలుఁగు అను పదమును ప్రత్యేకముగా వాడెను. కాబట్టి తేటతెలుఁగు, జానుతెనుఁగు నొకటి గావు. కన్నడకవులు 'జాణ్ణుడి' అను మాటను చమత్కారమను నర్థమున వాడిరి. జాను తెనుఁగు పదము కూడ జాణ్ణుడి వంటిదే. కాన జానుతెనుఁగన చమత్కారము గల తెనుగనియు, అది సంస్కృత రహితమైనదనియు, అట్టి దానినే నన్నెచోడుడు కుమారసంభవమున వాడెననియు మనము భావింపవలయును.

నన్నెచోడుడు కుమారసంభవప్రారంభమున కొందఱు సంస్కృత కవులను పేర్కొని, వారిలో కొందఱను మాత్రమే వస్తుకవులని పేర్కొనెను. అట్లు వస్తుకవులని చెప్పబడినవారు వాల్మీకి, భారవి, ఉద్భటుడు. ఇట వస్తుకవితయననేమో తెలిసికొనవలయును. నన్నెచోడుడు చెప్పిన వస్తుకవిత నన్నయప్రతిపాదించిన ప్రసన్నకథా కలితార్థయుక్తి కంటె భిన్నమైనదని తేలుచున్నది. కోరాడ రామకృష్ణయ్యగారు "భావప్రధానమైన దానికి భిన్నమై వస్తుప్రాధాన్యము గలిగి వర్ణనీయవస్తువును గూర్చి చమత్కార వర్ణనలతో కూడిన కవిత వస్తు కవిత" యని నిర్వచించిరి. కాబట్టి వస్తుకవితలో భావమునకు

ప్రాధాన్యముండదు. వస్తువునకు మాత్రమే ప్రాధాన్యముండును. వర్ణింపదగిన వస్తువుయొక్క చమత్కారవర్ణనములిందుండును. రామకృష్ణయ్యగారు చెప్పిన దానిని బట్టి వస్తుకవితలో భావమునకు ప్రాధాన్యముండరాదు. కాని నన్నెచోడుడు తన కావ్యమున భావమునకు ప్రాధాన్యమున్నట్లు పలుమాఱు చెప్పెను. కాబట్టి వస్తుకవితలో భావమునకు ప్రాధాన్యముండదనుట తగదు. ఇక నన్నెచోడుని కవిత్వములో చమత్కారవర్ణనములున్నమాట నిజమే. అవి వస్తువును కూర్చినవి యగుటయు నిజమే. వస్తువనగా వర్ణ్యవస్తువని భావించినచో నన్నెచోడుని కవిత్వము వర్ణనా ప్రధానమైన కవిత్వమని తేలుచున్నది. ఈ చూపుతోనే కొందఱు విమర్శకులు వస్తుకవిత్వమనగా వర్ణనాత్మక కవితయని నన్నెచోడుని అభిప్రాయమని చెప్పిరి.

మఱికొందఱు వస్తుకవితయనగా సహజకవిత్వమనియు, పాండిత్యబలముచే పట్టుబట్టి పద్యరచన సాగించు కవిత్వము కాదనియు సెలవిచ్చిరి. ఇంక కొందఱు వస్తువనగా ప్రకృతి యనియు, ప్రకృతి వర్ణనాత్మకమైన కవిత్వమునే నన్నెచోడుడు వస్తుకవిత్వమని పేర్కొనెననియు చెప్పిరి. ఎవరెట్లు చెప్పినను కావ్యము నందు వస్తువులను చమత్కారముగా వర్ణించుటయే ప్రధాన లక్షణముగా గల కవిత "వస్తుకవిత్వ"మని చెప్పవచ్చును.

మార్గదేశి కవితా భేదమును గూర్చి నన్నెచోడుడు చెప్పినదాక ఆంధ్రలోకమెఱుగదు. మార్గకవిత్వమననేమి? దేశికవిత్వమన నేమి? నన్నయకు పూర్వమున గల శాసన కవిత్వము దొరకినంతవరకు దేశిచ్ఛందములోనే కలదు గాని సంస్కృత వృత్తములలో నున్నట్లు కానరాదు. తత్సమ బహుళంబగు భాషలో ఆంధ్రకవిత్వము చెప్పబూనినవాడు నన్నయభట్టే. కావుననే ఈతడు మార్గకవితా పద్ధతి నవలంబించిన వాడగుచున్నాడు. నన్నయ కవిత మార్గకవితయై అంతకు పూర్వమునను, తరువాతను సామాన్యజనము నందు వ్యాప్తిలో నుండి దేశీయచ్ఛందములో రచింపబడిన కవిత దేశికవిత యగును. ప్రాచీనలక్షణలక్షితమై నియమబద్ధమగు కవిత మార్గకవితయనియు తత్తద్దేశీయ సంప్రదాయానుగుణముగా మనోహరమగునట్లు చెప్పబడినది దేశికవితయనియు నిర్వచింపవచ్చును. అనగా సంస్కృత సాహిత్యలక్షణానుసారముగా దేశభాషయందు రచింపబడిన కవితయే మార్గకవిత. దేశీయచ్ఛందములో దేశీయ సంప్రదాయానుసారముగ తత్తద్దేశీయులకు మనోహరముగా నుండునట్లు చెప్పిన కవితయే దేశికవిత.

మార్గదేశి భేదము సంగీతము, నాట్యము మున్నగు కళలలో కలదు. కవిత్వమునకు సంబంధించి శాసన రచయిత యగు నృపధూర్జటి పండడు మార్గదేశి కవితాభేదములను చెప్పెను.

నన్నెచోడుని రచనలో ప్రాచీన కర్ణాట కవితాలక్షణములు గలవు. తాము రచించిన కావ్యమును ప్రభువులకో, గురువులకో కృతియిచ్చు సంప్రదాయమును నన్నెచోడుడు కన్నడకవుల నుండియే గ్రహించియుండును. నన్నయ తన రచనను రాజరాజనరేంద్రునకు వినిపించెనే కాని కృతి ఈయలేదు. పంపాది కర్ణాటకవులు భారతకథను గ్రహించి తమభావముల కనుగుణముగా మార్చి ఒక చిన్న ప్రబంధమును రచించినట్లే నన్నెచోడుడును శివపురాణకథలో అనుకూలభావమును గ్రహించి సందర్భోచితముగా కొన్ని మార్పుల గావించి యొక ప్రబంధమును రచించెను. ఆ ప్రబంధమును కూడ వస్త్వైక్యము (కథ కేవలము ప్రధాననాయకునకే సంబంధించియుండుట), రసపోషణము, పాత్రోన్మీలనము, సంభాషణాచాతుర్యము, మున్నగు లక్షణములుండునట్లు రచించుట కన్నడకవుల పద్ధతియే. కర్ణాటకవులు ఇష్టదైవమును స్తుతించి ఊరుకొనక వరుసపెట్టి దేవతల ననేకులను స్తుతింతురు. నన్నెచోడుడు కూడ కావ్యాదిని మొదటి మూడు పద్యములలో ఈశ్వర మహిమనే వెల్లడించినను తరువాత కన్నడకవులవలె బ్రహ్మ, విష్ణు, గజాననార్క షడాస్యమాతృ సరస్వతీ పార్వతులను కూడ స్తుతించెను. సుకవిస్తుతి, కుకవి

నింద, స్వీయకవితామహిమ వర్ణనము మున్నగునవి కర్ణాట కావ్యములందు వలెనే కుమార సంభవమునను కలవు. కర్ణాటకవులు కావ్యాంతమున చేర్చిన కృతిపతి వంశ గుణవర్ణనమును, కథాప్రణాళికను నన్నెచోడుడు కావ్యప్రారంభమున చేసెను. కృతిపతి గుణములను వర్ణించి అతనికి కథానాయకునితో అభేదము కల్పించి కథను నడిపించుట కన్నడకవుల సంప్రదాయము. నన్నెచోడుడు దీనిని పాటించెను. కథామధ్యభాగమున కూడ కొన్ని సందర్భములలో కృతిపతిని కథానాయకునివలె కథాభాగమున నొక పాత్రగా చేసెను. ఇక నన్నెచోడుడు ఏకవిభక్తికములగు పద్యములలో కృతిపతి గుణవర్ణనము చేసెను. ఇదియే షష్ఠ్యంత రచన. ఈ షష్ఠ్యంత పద్యరచనము కర్ణాటకవులలో లేదు కాని నన్నెచోడుడు దీనిని దేశీయోదాహరణకావ్యము లందలి విభక్త్యంతరచన నుండి గ్రహించియుండును. ఈ యాచారమునే తిక్కన హరిహరనాథుని విషయమున కూడ నాదరించుటచే తెనుఁగు కవులలోనిది యొక అవశ్యాచారముగా పరిణమించినది. నన్నెచోడుడు కర్ణాటకవులవలె కావ్యాద్యంతముల యందు శ్రీకారముంచెను. అతడు తుది పద్యమును మంగళమహాశ్రీవృత్తముగా రచించి ఆపద్యము మంగళమహాశ్రీ అనుపదముతో ముగియునట్లు చేసెను. కావ్యప్రారంభమున నన్నెచోడుడు రచించిన పద్యము కర్ణాటకవి యగు రన్నకవి రచించిన అజిత పురాణమునందలి పద్యమును పోలుచున్నది.

నన్నెచోడుని కుమారసంభవము ప్రబంధశాఖకు చెందిన ప్రథమప్రౌఢకావ్యము. కథయందు, వర్ణనలయందు, భాషాప్రయోగము నందు కవి స్వాతంత్ర్యమును, ప్రతిభను చూపెను. నన్నెచోడుడు కావ్యప్రారంభమున చెప్పుకొన్నట్లుగా అతనికి చతుష్షష్టి కళలందు చాతుర్యమున్నట్లు కుమారసంభవమే చాటుచున్నది. ఇందలి పద్యములన్నియు చమత్కారయుతమైన రమణీయార్థమును కలిగియుండును. ఇక భాషయన్ననో తేటతెల్లమైన జానుతెనుఁగు. ఈ కావ్యము భావికవుల కనేక విధములుగా మార్గదర్శకమైనది. ఈ కవి భావములను తిక్కనాది మహాకవులు పెక్కురనుకరించిరి.

నన్నెచోడుడు కథావస్తువున చిత్రవిచిత్రములగు సన్నివేశములను కూర్చెను. కుమారసంభవ మందలి మొదటి రెండు అశ్వాసములయందలి కథ శివపురాణమందు కాని, కాళిదాసు కుమారసంభవము నందు గాని, మఱి ఏయితర సంస్కృతకావ్యపురాణము లందు కాని లేదు. పార్వతీదేవి నలుగుపిండితో వినాయకుని గావించినట్లు సంస్కృత వాఙ్మయమున కలదు. ఈ కథయే అనుశ్రుతముగా వచ్చుచున్నది. కాని నన్నెచోడకవి మార్గకవితా సంప్రదాయమునకు చెందిన పైకథను గ్రహింపక దేశీయ సంప్రదాయమునకు చెందిన కథను స్వీకరించెను. పార్వతీ పరమేశ్వరులు కరిణీ కరి రూపులతో విహరించినపుడు వినాయకుడు పుట్టెనను కథను నన్నెచోడుడు స్వీకరించెను. ఈ కథ తమిళవాఙ్మయము నందు ఏడవశతాబ్దమున రచింపబడిన "తేవారము" అను గ్రంథమున సూచింపబడినది. ఈవిధముగా నన్నెచోడుడు శివపురాణ, కాళిదాసకుమారసంభవముల కంటె భిన్నమైన మార్గమున తన కావ్యమును రచించెను. కథారంభము నందే పురవర్ణనము గావించుట ప్రబంధకర్తల యాచారము. నన్నెచోడుడు సందర్భము వచ్చినపుడే పురవర్ణనము చేసెను గాని ప్రత్యేకముగా దానిని తెచ్చిపెట్టుకొనలేదు. ఆంధ్రకుమారసంభవములో శివుడు పంపిన మునులు హిమవంతుని రాజధానియగు ఓషధీపురమునకు వచ్చునప్పుడు వారాపురమును కాంచినట్లు వర్ణింపబడినది.

తృతీయాశ్వాసమున హిమవంతుని వర్ణనమును పార్వతీదేవి వర్ణనమును సంస్కృతకుమార సంభవము నందలి వర్ణనము కంటె భిన్నముగ నున్నది. నన్నెచోడుడు స్వకపోల కల్పితములైన ఉత్ప్రేక్షలతో వర్ణనములు గావించెను. నన్నెచోడుని కావ్యమున ప్రౌఢకల్పనము లెక్కువ. ఓషధీపురమునందలి సౌధములను వర్ణించునపుడు నన్నెచోడుడు చిత్రమగు కల్పనములు గావించెను. మేడలయందు చెక్కిన కపోతములను జూచి పిల్లులు ఆసతో వానిపైకురికి అవి నిజమైనవి కావని యెఱింగి అభ్రాంతిచే సజీవ

కపోతములు తమపై మూగినప్పుడు కూడ ఆ పిల్లులు కదలవట. వ్యక్తుల ఆకారములు కన్నులకు కట్టునట్లు చేయగలశక్తి నన్నెచోడునకు కలదు. పతిభిక్ష వేడుచున్న దక్షుని భార్యను మన్మథ దహనానంతరము రతిదేవిని కవిరాజశిఖామణి అత్యద్భుతముగా వర్ణించెను.

రసపోషణమునందు నన్నెచోడునకు అసాధారణశక్తి కలదు. మఱియు ఏయాంధ్రకావ్యమున గోచరింపని హాస్యరసము కుమారసంభవమున కలదు. దక్షాధ్వర ధ్వంసమున గణాధీశ్వరులు బ్రహ్మవిష్ణులను దిక్పాలురను దండింపబూనగా వారు భయభ్రాంతులై తొట్రుపాటుతో తమవాహనములను గూడ సరిగా పరిగ్రహింపక విపరీతముగా పరుగెత్తిన విధానము హాస్యము కలిగించును. యముడిట్లు భయపడి పరువెత్తెనట.

ఆ॥వె॥ ఇక్కుముట్టి చక్కె నెక్కగ మఱచి, సం
భ్రమము పొంది పిఱుద ప్రమథగణము।
లార్వ, పోతుమీద నడ్డంబు వడి, యుప్పు
పెతికవోలె వెఱచి పఱచె జముఁడు॥

నన్నెచోడుడు కథను చెప్పుకొనుచుపోడు. అతడు సంభాషణ రూపమున కథను నడిపించును. ఇట్లు నడిపించుటచే కథా పాత్రలు నాటకమందువలె ప్రత్యక్షముగా మాటాడినట్లుండి ఎక్కువ ఆకర్షణీయముగ నుండును. సతీదక్షుల కలహము, రతిమన్మధుని నివారించుట మున్నగు ఘట్టములు దీనికి తార్కాణము.

శివుని తపోవనమునకు వసంతునితో పోయి తపోభంగము చేయునప్పుడును పార్వతి తపస్సందర్భముననుప్రకృతి వర్ణనములు గావింపగా నన్నెచోడునకు చక్కని అవకాశములు కలిగినవి. అతడు ప్రకృతి వర్ణనములను కొన్నిచోట్ల సాలంకారముగను, కొన్నిచోట్ల నిరలంకారములుగను తీర్చిదిద్దెను. నిరలంకారముగా చేసిన వర్ణనములు స్వభావోక్తి రమ్యములై యున్నవి. వసంతుని ప్రభావమున, శివ తపోవనమునందు అకాలమున బుట్టిన వసంతోదయప్రభావమును వర్ణించుచు నన్నెచోడుడీ క్రింది పద్యములు వ్రాసెను.

ఉ॥ పొన్నలు పూచె, పొన్నలొగి పూవకముందర పూచె గోగు, లా
పొన్నలు కొండగోగులును పూవకముందర పూచె బూరువుల్।
పొన్నలు కొండగోగులును బూరువులున్ నొగిపూవకుండగా
మున్న వనంబునన్ గలయ మోదుగు లొప్పుగపూచెనామనిన్॥

చం॥ అలులొడగూడు, పిండుగొనియాడు, మృదుధ్వనిఁబాడు నోలదొం
తులు గొని పాఱు, జొంపములు దూరు, సుగంధము మీఱు, పూవుగు।
త్తులపయి మూవు, పుప్పొళులఁద్రోవు, వడిన్ దనివోవమంజరుల్
వెలువడనేగు, దర్పమున వీగు, మదిన్ నలిరేగు నామనిన్॥

కుమారసంభవమున శృంగారరసము ప్రధానమైనను, మిగిలిన రసములు అంగములుగా వర్ణింపబడినవి. దీనిలో చివరి రెండు ఆశ్వాసముల యందు యుద్ధవర్ణనము చేయబడినది. ఈ కావ్యమున గల 2020 పద్యములలో 200 పద్యములు యుద్ధప్రయత్నములను గూర్చియు, 300 పద్యములు మూడు దినముల యుద్ధమును గూర్చియు రచింపబడినవి. దీనిని బట్టి ఈ కావ్యమున శృంగారము తరువాత వీరమే ప్రధానమని తెలియుచున్నది. సంస్కృత కుమారసంభవమున కుమారతారకాసురుల యుద్ధము దేవదానవుల యుద్ధమై మానవాతీత లక్షణములతో కూర్పబడినది. కాని ఆంధ్ర కుమారసంభవమందలి యుద్ధవర్ణనము కేవలము మానవుల యుద్ధమువలె బహు స్పష్టముగా నియమ సహితముగా కూర్పబడినది. ఈ విషయమున నన్నెచోడుడు తాను రాజై అనేక యుద్ధములు చేసినవాడు

గావున తన ప్రత్యక్షానుభవమును వెల్లడించెను. ఈ యుద్ధవర్ణనములో ద్వంద్వయుద్ధములు మనోహరముగా నున్నవి. వీనిలో కూడ అలంకారములు కూర్చుటచే యుద్ధవర్ణనము రమణీయమేగాని యుద్ధము కాదనెడి సూక్తి సార్థకమైనది.

## మల్లికార్జున పండితారాధ్యుడు

పంద్రెండవ శతాబ్దమధ్యకాలమున కృష్ణానదికి దక్షిణమున నున్న వెలనాటిని చందవోలు ముఖ్యపట్టణముగా దుర్జయవంశజులు, చతుర్థ కులజులునగు చోళులు పరిపాలించిరి. వీరికి వెలనాటి చోళులని పేరు. ఇప్పటి గుంటూరు మండలమును ప్రాచీనకాలమున వెలనాడని వ్యవహరించుచుండిరి. చందవోలునకు ప్రాచీననామము ధనదపురము. ఈ వెలనాటిచోళులలో క్రీ.శ.1163 నుండి క్రీ.శ.1180 వరకు రాజ్యము చేసినవాడు వీరరాజేంద్రచోళుడు. మల్లికార్జున పండితారాధ్యుడు ఈ వీరరాజేంద్రచోడుని సమకాలికుడు. సాహిత్యచరిత్రకారులు మల్లికార్జున పండితుడు క్రీ.శ.1110-1175 మధ్యకాలము వాడని నిర్ణయించిరి. ఇతడు పండిత త్రయములో నొకడు. శ్రీపతి పండితుడు, శివలెంకమంచన పండితుడు, మల్లికార్జున పండితుడు ననుమువ్వురను శైవులు పండిత త్రయమందురు.

మల్లికార్జున పండితుడు గోదావరి మండల మందలి దక్షారామ భీమేశ్వర గ్రామమున భీమేశ్వరస్వామి దేవాలయమున కులక్రమాగతముగా పూజారి పదము కలవాడు, వాణసవంశీయుడునగు భీమనకు గౌరవాంబ యందు జన్మించెను. ఇతడు భీమేశ్వర సమీపమున నున్న కోటిపల్లివాసుడైన ఆరాధ్యదేవుని శిష్యుడయ్యెను. అతనిచే శివదీక్షపొంది శైవమతరహస్యములను సంపూర్ణముగ గ్రహించి శైవాచారపరుడు, శివపూజాతత్పరుడునై ద్వాదశశతాబ్ది యుత్తరార్థమున ఆంధ్రదేశమున శైవమత ప్రచారము గావించి ప్రసిద్ధుడయ్యెను. మల్లికార్జున పండితుని చరిత్రమునే పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్రమను ద్విపద కావ్యమునందు వర్ణించెను.

కుమార సంభవకర్తయగు నన్నెచోడుని గురుడు జంగమ మల్లికార్జునుడు. అతడే మల్లికార్జున పండితుడని కొందఱు విమర్శకులు భావించిరి. జంగమ మల్లికార్జునుడు, మల్లికార్జున పండితుడు భిన్నులు. మొదటివాడు ఆజన్మబ్రహ్మచారియగు కాలాముఖయోగి. రెండవవాడగు పండితారాధ్యుడు పాశుపత శైవాచార్యుడై వార్ధకమున కూడ సన్యసింపక భార్యాపుత్రాదులు కలిగి లింగైక్యము చెందినవాడు.

పాల్కురికి సోమన పండితారాధ్యచరిత్రమును బట్టి మల్లికార్జున పండితుడు శివతత్త్వసారము, లింగోద్భవదేవగద్య, రుద్రమహిమ, అమరేశ్వరాష్టకము, భీమేశ్వర గద్యము, స్తుతిశ్లోక పంచకము, పర్వత వర్ణనము, శ్రీముఖదర్శనగద్య, ఆద్యభక్తగణ సహస్రనామములు అనువానిని రచించినట్లు తెలియుచున్నది. మఱియు నితడు కర్ణాటకభాషయందు గణసహస్రనామము, ఇష్టలింగస్తోత్రము, బసవగీత అను గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది.

పండితారాధ్యచరిత్రములో "శతకంబు శివతత్త్వసారమాదిగను" అని కలదు. విమర్శకులు కొందఱు దీనిని బట్టి శతకము, శివతత్త్వసారము రెండును భిన్న కృతులని భావించుచున్నారు. ఆ శతకమే "శ్రీగిరి మల్లికార్జునశతక"మని వారి యభిప్రాయము. శ్రీగిరి మల్లికార్జునశతకమందలి దని ఈ క్రింది పద్యము లక్షణగ్రంథములలో నుదాహరింపబడినది.

ఉ॥ లోకములెల్ల నీ తనువులోనివ, నీవట యెంత కల్గుదో
నాకపు పద్మసంభవ జనార్దనులాదిగ నెల్లపెద్దలున్
నీ కొలదింతయంత యననేరక మ్రొక్కి దొడంగిరన్నని
న్నే కరణిన్ నుతింతుఁబరమేశ్వర శ్రీగిరి మల్లికార్జునా!

ఈ పద్యభావమే శివతత్త్వసారము నందలి పద్యములలో నున్నది.

కాని మఱికొందఱు విమర్శకులు శివతత్త్వసారమే శతకమనియు, ఇందు నూఱు పద్యములు గాని, పద్యాంతములందు నొక మకుటముగాని లేకపోయినను శతకపద్ధతిలో వ్రాయబడియుండుటచే శివతత్త్వసారమునకే శతకమను పేరు రూఢియైనదనిరి. ప్రకటితమైన శివతత్త్వసారము 489 కందపద్యములు గలిగి అసంపూర్ణతను తెలుపుచున్నది. మద్రాసు నందలి ప్రాచ్యలిఖితపుస్తకాలయమున కర్ణాటభాష యందలి శివతత్త్వసారమొకటి యున్నదని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు గుర్తించిరి. ఆంధ్రశివతత్త్వసారము, కర్ణాటశివతత్త్వసారము రెండును ఒకవిధముగనే యున్నవి. ఆంధ్రకృతివలెనే కర్ణాటకృతియు అసంపూర్ణమే. కర్ణాటకృతిని బట్టి రెండు శివతత్త్వసారములు సహస్రపద్యములతో కూడియుండునను ఊహకు తావిచ్చుచున్నవి. కర్ణాటక శివతత్త్వసారమును కూడ మల్లికార్జున పండితుడే రచియించెనేమో? బసవేశ్వరుని అనుగ్రహము వలన ఇతనికి కర్ణాటకవిత్వము ప్రాప్తించెనని తెలియుచున్నది.

మల్లికార్జున పండితుడు రచించిన ఆంధ్రగ్రంథములలో శివతత్త్వసారమొకటియే ఇంతవరకు లభించినది. ఈ కావ్యమున శైవమతప్రశస్తి, శైవమతస్థాపనము అధికముగా వర్ణింపబడినవి. అవైదికమతములగు జైనబౌద్ధములు, వేదవిహితమగు అద్వైతము నిర్దాక్షిణ్యముగా ఖండింపబడినవి. శివభక్తుల, శివగణముల మహిమలు వర్ణిపబడినవి. ఎడనెడ శివస్తుతి గలదు. ఇంతకంటె వేఱు కథావస్తువేదియు లేదు. ఇది కందపద్యములలో వ్రాయబడినను కావ్యముకాక మతగ్రంథమైనది. మల్లికార్జునపండితుడు తీవ్రాతితీవ్రముగా పరమతఖండనము చేసెను. వేమన వలె సంకోచము గాని భయము గాని చెందక ఇతడు తన భావములు వెల్లడించును. ఈతని హాస్యము పరిహాసరూపమై పరుల మనస్సును నొప్పించును. ఈ గ్రంథమున శైవధర్మ ప్రతిపాదనము తప్ప ఇతర కావ్యకథాశిల్పము లేకపోవుటచే దీనికి విశ్వజనీనత లేకపోయినది. విశేషప్రచారము రాకపోయినది.

ఈ గ్రంథమందలి కవితాశైలి నన్నయ కవితాశైలివలె సంస్కృతపదభూయిష్ఠమై యుండును. సామాన్య పండితులకు కూడ సుబోధకమయ్యు పామరులకు మాత్రము గ్రాహ్యమగుట లేదు.

కం. ఖరకర పద్మజ రుద్రాం
బురుహోదరముఖ్యదివిజ పుంగవ సచరా।
చరభూత నికర పంచా
వరణంబులఁగొల్వనుండువాడవురుద్రా!

మల్లికార్జున పండితుడు తన కవిత్వమున సరసమగు నుపమాలంకారములను, నిదర్శనాలంకారములను వాడును.

కం. విను పరుసవేది సోకిన
యినుము క్రియన్ నిన్ను గొలిచి యెవ్వండైనన్।
త్రినయన యుత్తము డనబడు
పొనరగ శివభక్తుఁడగ్ర పూజ్యుండగుటన్॥

కం. ఎట్టి కడు కీడు కులమున
పుట్టియు శివ! నిన్ను గొలిచి పూజ్యుడ మనుజుం
డట్టిద ధర్మువు రొంపిం
బుట్టియు పద్మంబు చాల పూజ్యమకాదే॥

ఇతడు శ్రుతులందలి యనేక సంస్కృత వాక్యములను తన గ్రంథమున స్వమతప్రమాణమునకై సునాయాసముగా కంద పద్యమున నిముడ్చును.

కం. వసుమతిఁజిత్రము జితచి
త్త సంభవ! "న కర్మణా నతపసా నజపైః
న సమాధిభి" రవ్యయనీ
యసదృశ భక్తికిని ప్రియుడవగుదీశానా!

శివతత్త్వసారములో తరువాతి శైవకవుల సరళరచన దేశికవిత కానరాదు. కన్నడపదములు వాడుట మాత్రము ఎడనెడ కలదు. ఈ గ్రంథమున కొన్నిపద్యములలో ప్రాతవడిన మాటలు, అన్వయకాఠిన్యము కలవు. ఒడ్డనము, జాడు, ఎయిదదు, సూడబెట్టు, బదరుడు మొదలైన పదములిప్పుడు వ్యవహారమున లేవు.

పండితుడు ప్రతిపాదించిన వీరశైవమతమున కొన్ని పవిత్రాచారములు కలవు. భర్త శివభక్తుడు కానిచో భార్య వానిని వదలవలయునట. అట్లు చేసిన దోషము లేదట. శైవ మతప్రచారము కొఱకు జీవహింసకూడ చేయవచ్చునట. శివకార్యమునకై మరణించిన వారికి అపరకర్మలు గాని, సూతకముగాని జరుపక సంతోషముతో పండువు చేయవలయునట. శివనిర్మాల్యమును శివదీక్షితుడు తప్ప ఇతరులు తినరాదట.

## గోనబుద్ధ భూపాలుడు

బుద్ధభూపాలుడు రచించిన రామాయణము ఆంధ్రద్విపదకావ్యములలో అగ్రగణ్యమైనది. ఈ రామాయణమునకు రంగనాథరామాయణమను పేరు చాలకాలము నుండియు వాడుకకెక్కినది. ఈ పేరెవ్వరు పెట్టిరో తెలియదు. ఈ ద్విపదరామాయణకర్తృత్వము మహావివాదగ్రస్తమై ఉద్దండపండితులను రచ్చకీడ్చినది. రామాయణావతారిక యందు ప్రతికాండము నంతమున బుద్ధభూవిభుడే రచించెనని శిలాక్షరముల వలె గలదు. బుద్ధభూపాలుని తండ్రి విఠ్ఠలక్ష్మానాథుడు. అతడు కుమారుడగు బుద్ధభూపతితో

ద్వి॥ "భూమిఁగవీంద్రులు బుధులును మెచ్చ
రామాయణంబు పురాణ మార్గంబు॥
తప్పక నా పేర తగనంధ్ర భాష
చెప్పి ప్రఖ్యాతంబు చేయింపుముర్వి"

అని ఆనతిచ్చెను. దానికి సంతోషించి బుద్ధభూపాలుడు

పనిపూని అరిగండభైరవు పేర
ఘనుపేర, మీసర గండాంకు పేర
లలిత సద్గుణ గణాలంకారు పేర
నలఘునిశ్చల దయాయత బుద్ధి పేర
నాతత కృతి పేర, నతి పుణ్యు పేర
మాతండ్రి విఠ్ఠలక్ష్మానాథు పేర
...... ........ ...... .........
...... ......... ...........
ఆదికవీశ్వరుడైన వాల్మీకి
యాదరంబునఁబుణ్యులందరు మెచ్చఁ
జెప్పిన తెలుగున శ్రీరామచరిత
మొప్పఁజెప్పెదఁగథాభ్యుదయమెట్లనిన"

అని స్పష్టముగా వక్కాణించెను. ఈ భావములే ప్రతికాండాంతము నందును కలవు. కావ్యాంతస్సాక్ష్యమును బట్టి ద్విపదరామాయణ కర్త బుద్ధభూపాలుడని తెలియుచున్నది గదా.

వాస్తవమిట్లుండగా రంగనాథుడను ఒకకవి ద్విపదరామాయణమును రచించి బుద్ధభూపాలుని పేరు పెట్టెనని పండితులు కొందఱు వాదించిరి. ఈ హేతువు చేతనే దానికి రంగనాథ రామాయణమను పేరు వచ్చినదని వారు సిద్ధాంతము చేసిరి. రంగనాథుడను కవిని ప్రాచీనకవులు కొందఱు సుకవి స్తుతిలో పేర్కొనిరి. మఱియు రంగనాథుని పద్యములు కొన్ని లక్షణగ్రంథములలో నుదాహరింపబడినవి. అదియును గాక బుద్ధభూపాలుని కవిగా పేర్కొనినవారెవ్వరు ప్రాచీనకాలమున లేరు. ఈ పరిస్థితులలో రంగనాథుడను కవి ద్విపద రామాయణమును రచించి ధనలోభముచే తన కావ్యకర్తృత్వమును బుద్ధారెడ్డికి ధారపోసెనేమో అను భ్రాంతి కలుగక మానదు.

కాని అది వట్టి భ్రాంతియే. ప్రాచీనకవులు పేర్కొనిన రంగనాథుడే ద్విపదరామాయణకర్తయని చెప్పుట కాధారములు లేవు. కాని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చక్రపాణి రంగన అనునొక కవి చరిత్రను త్రవ్వితలకెత్తి అతడే ద్విపదరామాయణ కర్త యని విశ్వసించిరి. చక్రపాణి రంగన మొదట వైష్ణవుడు. అతడు పాల్కురికి సోమనాథునితో వాదించెను. వాదమున నోడిపోయి చివరకు సోమనాథునిచే శివదీక్షను పొందెను. కాబట్టి వైష్ణవుడైన చక్రపాణి రంగనాథుడు శైవమతము స్వీకరించి చక్రపాణి రంగకవి యయ్యెను. ఈ చక్రపాణి రంగనయే ద్విపదరామాయణము రచించెననుటకు తార్కాణములు శూన్యము.

కావున బుద్ధభూపాలుడే రామాయణమును రచించెననుట శ్రేయస్కరము. ఇది క్రీ.శ.1300-1310 నడిమి కాలమున రచింపబడెనని విమర్శకులు నిశ్చయించిరి.

బుద్ధారెడ్డి ద్విపదరామాయణమును రచించెనని నమ్మినవారు కొందఱు కలరు. గ్రంథమున బుద్ధభూపాలుడని యున్నదే కాని బుద్ధారెడ్డి యని లేదు. రెడ్లు రాజులు కావచ్చును. బుద్ధభూపాలుడు రెడ్డియైనచో తన పేరికి చివర రెడ్డియను పదము నేల చేర్పలేదు. ప్రాచీనకాలమున రెడ్డి కులమువారే కులసూచకమైన రెడ్డి పదమును పేరు చివర చేర్చుకొనుచుండిరి. ఈ రామాయణము నందు కావ్యకర్త పేరు చివరగాని అతని వంశీయుల పేర్ల చేవరకాని రెడ్డియను పదము లేకపోవుట గమనింపదగిన ముఖ్యాంశము. ద్విపద రామాయణకర్త రెడ్డికులజుడని నిరూపించుటకు తగిన యధారము గ్రంథమున లేనప్పుడును శాసనముల యందలి గోనవంశజులు కృతికర్తృ వంశము వారని నిరూపించుటకు తగిన యాధారము కానరానప్పుడును ఈ ద్విపదరామాయణ కర్తృవంశము రెడ్డి కులమనియు, బుద్ధభూపతియే బుద్ధారెడ్డి యనియు చెప్పుటకెట్లు వీలగునో తెలియుట లేదు. సారాంశమేమనగా గోనబుద్ధభూపతి యనువాడు వాల్మీకి రామాయణమాధారముగా ద్విపదరామాయణము రచించెనని చెప్పుట సర్వోత్తమము.

ఆంధ్రము నందలి రామాయణములలో గోనబుద్ధభూపాలుని ద్విపదరామాయణము ప్రప్రథమము. ద్విపదకు కావ్యగౌరవమును కలుగజేసిన ప్రథమ కవి పాల్కురికి సోమనాథుడు. ద్విపదచ్ఛందము జనసామాన్యమునకు శీఘ్రముగా నాదరపాత్రమైనది. గోనబుద్ధభూపాలుడు ద్విపదప్రభావమును, ప్రజలకు దానిపట్ల గల రక్తియు ప్రత్యక్షముగా చూచెను. కావుననే పురుషోత్తముడైన శ్రీరాముని చరిత్రమును ద్విపదకావ్యముగా సంతరించెను. పాల్కురికి సోమనాథుని రచనలకంటె బుద్ధభూపాలుని రామయణము వ్యాకరణచ్ఛందోవిషయములందు లక్షణబద్ధముగా నుండుట చేతను, ఇతివృత్తము సకలజనపూజార్హమైన శ్రీరాముని చరిత్రమగుట చేతను ఇది అచిరకాలములో భాషయందు ప్రామాణ్యమును, దేశమున గౌరవాదరములను సంపాదించుకొనినది.

వాల్మీకి రామాయణము అనుష్టుప్ ఛందమున వ్రాయబడినది. కావుననే "పాఠ్యేగేయే చ మధుర"మై యొప్పినది. బుద్ధభూపాలుని రామాయణము ద్విపదకావ్యమగుటచే పాడుటకు, పురాణముగా

చదువుటకు వీలుగానున్నది. దీనికి పశ్చిమాంధ్రమున బహుళప్రచారము కలదు. తోలుబొమ్మలాటవారు ప్రదర్శన సమయమున ఈ రామాయణమునే గానము చేయుదురు. దీనిని స్త్రీలు పాటలుగా పాడుటయు కూడ కలదు.

బుద్ధభూపాలుడు వాల్మీకి రామాయణము ననుసరించి ద్విపదరామాయణము వ్రాయుదునని చెప్పినను అతడు ప్రతికాండమునందు అవాల్మీకములైన సన్నివేశములను కథలను కల్పించెను. ఇవి అనాడు ప్రజలలో వ్యాపించియుండగా బుద్ధభూపాలుడు వానిని గ్రహించియుండవచ్చును. కాని కొందఱు విమర్శకులు ఈ అవాల్మీకకథలు అధ్యాత్మరామాయణాది గ్రంథములలో కనబడుచున్నవని చెప్పిరి. బాలకాండమున అవాల్మీకములైన కథలలో మొదటిది గౌతముడహల్యను పాషాణము గమ్మని శపించుట. ఇది మూలరామాయణమున లేదు. ఇంద్రుడు గౌతమాశ్రమమునకు బోయి కోడియై కూసెనను సన్నివేశము వాల్మీకి రామాయణమున లేదు. ఈ ద్విపద రామాయణములో అహల్యా శాపము

"అదరి గౌతముఁడహల్యాదేవిఁజూచి
పడతి! పాషాణరూపము దాల్చియిచట।
కరముగ్రమగు నెండ, గాలిఁబెంధూళిఁ
బొరలుచుండుము నీవు పొడగానఁబడక"॥

అను పంక్తులలో వర్ణితమైనది.

అయోధ్యాకాండమున కైక యందలి పక్షపాతము చేత మంధర రామపట్టాభిషేకమునకు విఘ్నము గావించెను. కాని బుద్ధభూపాలుడు మంధరకు రామునిపై ద్వేషము కలుగుటకు నొక కారణమును కల్పించి

"పనివడి రాముఁడు బాల్యంబునందు।
తన కాలు విఱిచిన తప్పు సాధింప"॥

అని వ్రాసెను. ఇది కూడ జనశ్రుతి కావచ్చును.

అరణ్యకాండమునందు జంబుకుమారవృత్తాంతము అవాల్మీకమే. జంబు కుమారుడు శూర్పణఖ కొడుకు. అతనిని లక్ష్మణుడు చంపును. పిదప శూర్పణఖ ప్రతికారము గావించుటకై దండకారణ్యమునకు వచ్చెను. జంబుకుమార వృత్తాంతము వలన శూర్పణఖా ప్రవేశమునకు కారణము కల్పింపబడినది.

ఈ ద్విపదరామాయణములో యుద్ధకాండము నందు అవాల్మీకములు అధికముగా నున్నవి. కాలనేమి సులోచనా వృత్తాంతములు అతిప్రధానములు. సులోచన ఇంద్రజిత్తు భార్య. లక్ష్మణుడింద్రజిత్తును వధించెను. అతని భార్యయగు సులోచన భర్తృకళేబరమును తెప్పించుకొని సహగమనమును చేసెను. ఈ కథ ద్విపద రామాయణమున అపూర్వముగా వర్ణింపబడినది. ఇక యుద్ధకాండములో రావణుడు సభలో విభీషణుని తన్ని పట్టణము నుండి బహిష్కరించుట విభీషణుడు తల్లి వద్దకు వచ్చుట, శ్రీరాముడు తన భక్తిని చూచి సంతసించుట, కైకశి రావణునకు హితబోధ చేయుట, రావణుడు రాముని ధనుర్విద్యాకౌశలమును కొనియాడుట, మండోదరి శ్రీరాముని బలపరాక్రమములను, మహిమను రావణునకు తెలుపుట, నాగపాశబద్ధులైన రామలక్ష్మణుల కడకు నారదుడు వచ్చుట, రావణుడు శుక్రుని వద్ద శోకించుట, రావణుడు పాతాళహోమము చేయుట, అంగదుడు మండోదరిని రావణునియొద్దకీడ్చుకొని వచ్చుట, రావణుని కరశిరంబులు మాటిమాటికి మొలచుటచే చింతించుచుండిన శ్రీరామునకు విభీషణుడు అగ్నేయాస్త్రమును ప్రయోగించి రావణుని నాభియందున్నయమృతమునింకింపజేసి అతనిని చంపుమని ఉపాయము చెప్పుట-ఇవి యన్నియు ద్విపద రామాయణము నందలి అమూలకాంశములే.

సీతను లక్ష్మణుడు విడిచిపోవు సందర్భమున ఏడు గీతలు గీసి వానిని దాటి పోవలదని చేసిన నియమము మూలరామాయణమున లేదు.

కథయందే కాక పాత్రపోషణ విషయమున కూడ బుద్ధభూపాలుడు మూలము కంటె భిన్నమైన మార్గముల నవలంబించెను. వాల్మీకి రామాయణమున రావణుడు నీచుడైన ప్రతినాయకుడుగా చిత్రింపబడెను. కాని బుద్ధభూపాలుని రామాయణములో అతడు మహావీరుడుగా, పరగుణగ్రహణ పారీణుడుగా, ఉదారుడుగా చిత్రింపబడెను. శ్రీరాముని ధనుర్విద్యా కౌశలమును అతడెట్లు పొగడెనో చూడుడు.

"నల్లవో రఘురామ నయనాభిరామ
విల్లు విద్య గురువ! వీరావతార!
కర శర లాఘవ క్రమ కళా నిపుణ
స్ఫురదురుచాప సంశోషిత కృపణ
... ........ .......... ................
.......... .......... ..................
బాపురే! రామభూపాల! లోకముల
నీపాటి విలుకాడు నేర్చునే కలుగ
పాటించి పురములపై బద్ధ హరుని
ఏటొప్పు నిందునీ యేటొప్పు గాక"

ఈ మాటలు విన్న మంత్రులు అతనిని మందలించిరి. అప్పుడు రావణుడిట్లనును.

విలువిద్య పెంపును విక్రమక్రమము
కలితనంబును బాహు గర్వరాజసము
లాదియౌ గుణముల నధికుడైనట్టి
కోదండ దీక్షాది గురునితో, రాజ
వరునితో రామభూవరునితో నొరులు
పరికించి చూడనే పట్టున నైన
సాటియే యిమ్మాడు జగముల యందు
మేటి శూరుల పెంపు మెచ్చంగవలదె.

రావణుడు శ్రీరామచంద్రుని విష్ణ్వవతారముగా నెఱిగెను. రావణుడు శ్రీరాముని చేతిలో మోక్షము పొందగోరిన జ్ఞానిగా, భక్తుడుగా, బుద్ధభూపాలుని రామాయణమున గోచరించును. మండోదరితో అతడీ విధముగా నను.

శ్రీరాము శరములచేఁజత్తునేని
నాకవాసులు మెచ్చ నా కోరుచున్న
వైకుంఠ మెదురుగా వచ్చు నిచ్చటికి
లలన నీవేటికి? లంకయేమిటికిఁ
దలకొన్న ముక్తి సత్పథము గైకొందు

రావణుని వలెనే కుంభకర్ణుని కూడ బుద్ధభూపాలుడు వీరమూర్తిగా చిత్రించెను. ఆంధ్రరామాయణమున కుంభకర్ణుడు ధర్మబుద్ధి కలవాడు. దీనిని ఋజువు చేయుటకై కవి యుద్ధరంగమున విభీషణ కుంభకర్ణుల సమావేశమును కల్పించి కుంభకర్ణునిచే చక్కని మాటలనిపించెను.

మండోదరి మహాపతివ్రత. ఆమెకు శ్రీరామ మహిమ తెలియును. భర్తతో శ్రీరాముని గూర్చి అడుగడుగున చెప్పినది. ఇంద్రజిత్తును గన్న ఈ వీరమాత వీరపత్నియై ఇంటికి వచ్చిన రావణుని మందలించి పరాజితుడైన అతనిని తిరిగి యుద్ధమునకుత్సాహపరచి పంపినది.

పాత్ర పోషణము నందు వలెనే, రసపోషణమున కూడ బుద్ధభూపాలుడు సంస్కృత రామాయణమును త్రోసిరాజనెను. బాలకాండమున ఋశ్యశృంగుడు స్త్రీలను జూచి విపరీతముగా భావించును. అతనిని వేశ్యలు రోమపాదునొద్దకు గొనివచ్చిరి. వాల్మీకి మహర్షి ఈ సన్నివేశమును సామాన్యముగ వర్ణించెను. లౌకిక కవియగు బుద్ధభూపాలుడు దీనిని పెంచి వ్రాసి హాస్యరసమును పోషించెను. మేనకా విశ్వామిత్రులకథను వాల్మీకి మితముగా వర్ణింపగా బుద్ధభూపాలుడు దానిని శృంగారమయముగ నొనర్చెను. ఇక సీతారాముల వివాహ సన్నివేశమున వర్ణనము లధికముగా చేసి ఆంధ్రదేశీయ వైవాహికాచార వ్యవహారములతో దానిని నింపెను.

బుద్ధభూపాలుని రామాయణమంతయు శయ్యాసౌభాగ్యముతో అర్థగాంభీర్యముతో చక్కని చిక్కని తెలుగు మాటలతో శబ్దార్థాలంకారములతో మహితమైయున్నది. అల్పాక్షరముల ననల్పార్థ రచన గల కవితా శిల్పమున కీగ్రంథమంతయు తార్కాణము. దీనిలో దేశిపదము లెక్కువ. సంస్కృత పాండిత్యము తక్కువ. కవి తెలుగు పదముల కూర్పు వలెనే సంస్కృతపదముల కూర్పును రమణీయముగ చేయగలడు.

"జంభారి దోస్తంభ సంభావితోగ్ర।
దంభోళి నైశిత్య దర్పభంగముల"॥

వంటి సంస్కృత పద సంవిధాన మక్కడక్కడ కలదు. బుద్ధభూపాలుడు రమణీయవర్ణనములను చేయును. అతడు చంద్రోదయము నిట్లు వర్ణించెను.

వరకళాయత సీమ వలరాజు మామ
పాలుపొందు కలువల పోరాని విందు
కలసిన జక్కన కవఁబాపు మందు
పాలవెల్లిని త్రచ్చి పడసిన వెన్న
శూలి యౌదల పూవు చుక్కల నవ్వు
నెఱిచకోరములకు నెలనెల పంట
ఉఱవేది విరహుల నుడికించు మంట
గగనంబు తొడవు, దొంగల గుండె దిగులు
నొగినబ్ధి పొంగించు నూర ట పట్టి
హరిహరబ్రహ్మల ఆనంద సృష్టి
సరసిజరిపుడైన చంద్రుండు పొడిచె

కొఱవితో తలగోకు కొనువారు గలరె, లీల నున్నది యూరులేనిది పాడు, కొండతో తగరు డీకొనిన చందమున, ఉట్టి గట్టుక యూగుచున్నాడు, పెటిలి పేడెత్తు, పులినాకి విడుచు, మొగము చేటంతగా మున్నగు లోకోక్తులను, జాతీయములను వాడి బుద్ధభూపాలుడు తెనుఁగుదనమునకు వన్నెపెట్టెను.

## కాచవిభుఁడు - విట్ఠలరాజు

వీరిరువురు సోదరులు, పూర్వరామాయణ ద్విపదకావ్యకర్తయగు బుద్ధభూపాలుడు అవసానకాలమున కుమారుల నిరువురను పిలిచి "పూర్వరామాయణమును నేను రచించితిని. ఉత్తర రామాయణమును మీరు రచించి నా కోర్కెను పూర్తిచేయు" దని చెప్పెను. తండ్రి కోర్కె నెఱవేరునట్లు కుమారులు ఉత్తర రామాయణమును ద్విపదగా రచించిరి. ఈయంశము నెల్ల కవులే కావ్యప్రారంభమున చెప్పిరి.

పూర్వరామాయణము వలెనే ఉత్తరరామాయణము కూడ ద్రాక్షాపాకమున నడిచినది. ఇందు లలితమైన తెలుగు పలుకుబడి కలదు. ఈ రామాయణములో రావణుడొనర్చిన అద్భుతకార్యములు, సీతాపరిత్యాగము, కుశలవ జన్మము, రామయజ్ఞ నిర్వహణము, సీతాభూవివర ప్రవేశము మున్నగు ఘట్టములు కలవు. కవిత్వము మనోహరముగా నుండును. రావణునకు వేదవతికి జరిగిన సంభాషణము చూడుడు.

ఎవ్వడు నీతండ్రి? యెద్ది నీ నామ
మెవ్వరి సతివి? నీ విట నుండుటేమి
పోడిగా నెవ్వని పొందుదు వీవు
వాఁడు కృతార్థుఁడు వనజాయతాక్షి!
అపదలడగింప నంగజాస్త్రముల
చూపు నీ కడగంటి చూపింతె చాలు
నీమేను కుందించు నీ తపంబునకు
నేమి ప్రయోజన మోతింగింపు మనిన
అతిథ్యమొనరించి ఆ మెదవతియు
నాతురుండైన దశాస్యునితో ననియె
మాతాత సురమంత్రి మహనీయబుద్ధి
నా తండ్రి కెనవచ్చు నాతదున్నతుడు
మా తండ్రి ధర్మైకమతి కుశధ్వజుఁడు
బ్రాతిగా నియతి నా బ్రహ్మర్షివరుఁడు
వేదంబు చదువ నావేళనే పుట్టి
వేదవతీ నామ విఖ్యాతనైతి.
ననునంత కోరి గంధర్వులు సురలు
దనుజులు యక్షులు దైత్యులు నడుగ
నెలమితో విష్ణున కిత్తు నంబుద్ధి
పలుమారుతమ్మెల్ల పరిహరించుటయు
రాతిరిమై దైత్యరాజు శంబరుడు
మా తండ్రిఁజంపె నేమఱుపాట వచ్చి
మా తల్లియును నంత మా తండ్రి తోడ
వీత కల్మషబుద్ధి విహితమార్గమును
జేకొని తగనేక చితిఁజొంది, పుణ్య
లోకంబునకు ధర్మలోలయై చనియె
నేనును మా తండ్రి హృదయంబు కోర్కి
మానుగా తలపోసి మానసంబునను
భక్త వత్సలుడైన పంకజోదరుని
భక్తి భావంబున భర్తగా కోరి
తపము గైకొంటి నా తపమునకిదియె
నెపమిా తపశ్శక్తి నిఖిలంబు గాంతు
నిను నెఱుంగుదు నేను నీవు పౌలస్త్య
మనుమఁడ, వీ పిన్న మాటలేమిటికి

## మొదటి ప్రతాపరుద్రుఁడు

ఈ యుగమున కవియైన రాజన్యోత్తముడు మొదటి ప్రతాపరుద్రుడు. ఈతని తండ్రి ప్రోలరాజు. వీరిది కాకతీయ వంశము. మొదటి ప్రతాపరుద్రుడు క్రీ.శ.1158 మొదలు 1195 దాక ఓరుగల్లు రాజధానిగా ఆంధ్రదేశము నేలెను. ఇతడు పరాక్రమవంతుడై రాజులనేకులను జయించి కీర్తిని బొందెను. కాకతీయ ప్రభువులలో మఱియొకప్రతాపరుద్రుడు కలడు. కావున ప్రోలరాజు కుమారుడగు రుద్రదేవ మహారాజును మొదటి ప్రతాపరుద్రుడని చరిత్రకారులు వ్రాయుచున్నారు. ఈ ప్రతాపరుద్ర మహారాజు కవిపండితపోషకుడై యశస్సు నార్జించుటయే కాక స్వయముగా కావ్యరచనము గావించెనని చెప్పుదురు. ఇతడు సంస్కృతమున నీతిసారమను గ్రంథమును రచించినట్లు ఈ క్రింది పద్యము వలన తెలియుచున్నది.

చం. పరువడి నాంధ్రభాషఁగల బద్దెన నీతియు, సంస్కృతంబులో
పరగప్రతాపరుద్ర నరపాలునిచే రచియింపబద్ద యా।
నరవరు నీతిసారము వినన్ జదువన్ గడు మంచిదంచు, జె
చ్చెరఁగని నీతి పద్ధతులు చేసె వినోదము బాలబోధకున్॥

ఈ రుద్రదేవమహారాజు సంస్కృతముననే కాకుండ ఆంధ్రమందు కూడ నీతిసారమును రచించెనని మానవల్లి రామకృష్ణకవి గారు నీతిశాస్త్రముక్తావళిపీఠికలో వ్రాసిరి. మడికి సింగన తన సకల నీతి సమ్మతమున నీతిసారములోనివని కొన్ని పద్యములుదాహరించెను. కాని నీతిశాస్త్రకర్త యెవ్వరో మాత్రమతడు చెప్పలేదు. ఆంధ్రకవులెవ్వరును ఈ రుద్రదేవుని తమ గ్రంథములలో కవిగా స్మరించియుండలేదు. అయినను మఱియొకకవి బయటపడుదాక ఈ రుద్రదేవమహారాజే నీతిసారమును రచించెనని మనము నమ్మవచ్చును. నీతిసారము నందలి పద్యములు మనోహరములు.

కం॥ దండము లేకున్నను బ్రజ
లొండొరువుల నాక్రమింతు రుచిత స్థితిమై।
నుండవు వర్ణాశ్రమములు
దండింపని భూమిపతికి ధరయేర్పడునే?

కం॥ ఆపదలఁజెందు ప్రజలను
భూపతి మొదలిచ్చి మగుడఁబ్రోవగఁజనుఁదాఁ।
జేపట్టి విడువ వలవదు
భూపతికి కుటుంబమనగ భూమియ కాదే॥

కం॥ ధనమును, ప్రాతశ్ఛాయము
వనితాజనయౌవనంబు, వండినయన్నం।
బును, కడు మూర్ఖ స్నేహం
బును, నిలనివి యల్పకాలభోగ్యములరయన్॥

ఉ॥ కొందర మేలమాడుటలుఁగొందర వావులు దేర్చి పిల్చుటల్
కొందర ముద్దు సేయుటయు, కొందర నెయ్యపుఁజూపుచూచుటల్।
కొందర నాత్మభావమున, కొందర మన్నన భృత్యులందు, ని
ట్లందర నన్ని భంగుల నృపాగ్రణి వశ్యులఁజేయగాఁదగున్॥

-0-




**కొట్టరువు తిక్కన సోమయాజి**

ఆంధ్ర కవితా ప్రపంచరవి తిక్కన. అయన కవిత్రయము నందు ద్వితీయుడు. కాని వ్యక్తిత్వమును బట్టి అద్వితీయుడు. తిక్కన మహిమను గూర్చి ప్రబంధ పరమేశ్వరుడగు ఎఱ్ఱన కంటె నెక్కువగా చెప్పగలిగిన వారింతవరకు పుట్టలేదు. ఎఱ్ఱన తిక్కన నీక్రింది విధముగా ప్రశంసించెను.

మ॥ **తన కావించిన సృష్టి తక్కొరుల చేతంగాదు నానేముఖం**
**బునఁదాఁబల్కిన పల్కులాగమములై పొల్పొందునా వాణిభ॥**
**ర్తను నీతండొకరుండు నాఁజను మహత్త్వాప్తిన్ కవిబ్రహ్మనా**
**వినుతింతున్ కవి తిక్కయజ్వ నఖిలోర్వీ దేవతాభ్యర్చితున్॥**

ఈ పొగడ్త నూటికి నూఱుపాళ్ళు నిజము.

తిక్కన పాకనాటిని అనగా నిప్పటి నెల్లూరు మండలమును పాలించిన చోళుల కాలము నాటివాడు. ఆ చోళులలో మనుమసిద్ధి యొకడు. మనుమసిద్ధి క్రీ.శ.1240 నుండి 1262 దాక రాజ్యపరిపాలన చేసెను. తిక్కన మనుమసిద్ధికి మంత్రి. మనుమసిద్ధి అతనిని మామా అని పిలిచెడివాడు. కావున తిక్కన మనుమసిద్ధి కంటె వయస్సున కొంత పెద్దవాడై యుండెనని యూహింపవచ్చును. మఱియు సిద్ధేశ్వర చరిత్రాదులను బట్టి తిక్కన కాకతీయమహాచక్రవర్తి యగు గణపతిదేవుని కాలము వాడని తెలియుచున్నది. గణపతిదేవచక్రవర్తి క్రీ.శ.1198 నుండి 1260 వరకు ఆంధ్ర మహాసామ్రాజ్యము నేలెను. ఈ కారణములనుబట్టి తిక్కన క్రీ.శ.1210–1280 ప్రాంతమున జీవించియుండవచ్చును. అనగా ఈ మహాకవి కాకతీయ గణపతిదేవ చక్రవర్తి పుత్రికయగు రుద్రమాంబ కాలమున కూడ ఉండెనని చెప్పవచ్చును.

తిక్కన సోమయాజి కృతికర్త యగుటయే కృతిపతియు నయ్యెను. కేతన తన దశ కుమారచరిత్రమును తిక్కన కంకితము గావించి అతని వంశవర్ణనమును విపులముగా గావించెను. అందుచే నాంధ్రకవులలో తిక్కనను గూర్చి తెలిసినంతగా ఇతర కవులను గూర్చి తెలియదు. తిక్కన మహాకవి ఆ నియోగులలో కొట్టరువు వంశమున జన్మించెను. ఈతని తాత భాస్కరమంత్రి. నిర్వచనోత్తర రామాయణములో భాస్కరుని గూర్చి తిక్కన

తే.గీ. **"సారకవితాభిరాము గుంటూరు విభుని।**
**మంత్రి భాస్కరు మత్పితామహుని దలచి"॥**

అని చెప్పెను. తిక్కన తండ్రి కొమ్మన. తల్లి అన్నమాంబ. మొత్తము మీద తిక్కన వంశము వారు నెల్లూరు రాజులగు చోళులకు దండనాయకులుగను, మంత్రులుగను నుండిరి. తన తాతదండ్రులను గూర్చి వ్రాయునప్పుడు తిక్కన వారిని గుంటూరి విభులని వర్ణించెను. ఇట విభుడనగా కరణమని కొందఱును, మండలాధిపతియని కొందఱును వ్యాఖ్యానించిరి. తిక్కన తండ్రియగు కొమ్మన మనుమసిద్ధి తండ్రియగు తిక్కరాజు దగ్గర మంత్రిగా నుండెను. తిక్కన మనుమసిద్ధికి మంత్రియయ్యెను. కాని మనుమసిద్ధి తండ్రియగు తిక్కరాజు వలె పరాక్రమశాలికాదు. మనుమసిద్ధి దాయాదుల తిక్కరాజు, బయ్యనలనువారు అతనిని సింహాసన భ్రష్టుని చేసిరి. రాజభక్తి పూరితుడగు తిక్కన కాకతీయచక్రవర్తియగు గణపతిదేవుని కడకు వెళ్ళి తన పాండిత్యబలముచే ఆ మహాప్రభువును మెప్పించెను. గణపతిదేవచక్రవర్తి అండదండలతో మనుమసిద్ధి దాయాదులను జయించి అతనిని తిరిగి సింహాసనస్థుని చేసెను. మనుమసిద్ధి రాజ్యకాలమున

కనిగిరి సీమలో ఎఱ్ఱగడ్డను పాలించు కాటమరాజునకు మనుమసిద్ధికి పచ్చికబీళ్ళు కారణముగా వైరమేర్పడి యుద్ధముగా పరిణమించినది. అయుద్ధము పాలేటియొద్దున పంచలింగాల దగ్గర జరిగెను. తిక్కన కవి పెదతండ్రి కుమారుడగు ఖడ్గతిక్కన మనుమసిద్ధి సైన్యమున కధ్యక్షుడై శత్రువులతో పోరాడి వీరస్వర్గమలంకరించెను.

కేతన చేసిన వర్ణనములను బట్టి తిక్కన బాల్యమున సాంగోపాంగముగా వేదాదులనభ్యసించెనని చెప్పవచ్చును. వైదికవిద్యతో పాటు రాజనీతిశాస్త్రము మొదలగు లౌకిక విద్యలందును తిక్కన ప్రవీణుడే. ఇంతేకాదు మాటిమాటికి కేతన తిక్కనను 'తిక్కనచమూపా' యనియు, 'తిక్కదండాధీశా' యనియు సంబోధించును. దీనిని బట్టి తిక్కన యుద్ధములందు కూడ ప్రవీణుడేమో అని యనిపించును. అతడు మనుమసిద్ధి కడ మంత్రియై రాజలాంఛనములతో సమస్తైశ్వర్యసమేతుడై యుండెను. అయన కేవల కవియే కాక శాస్త్ర పాండిత్య మందు కూడ అధిక ప్రసిద్ధుడై వాదశక్తి యందు శక్తి మంతుడయ్యెను. తన వాదబలముచే కాకతిగణపతిదేవు నాస్థానమున తిక్కన బౌద్ధులను జయించినట్లును దానికి మెచ్చి గణపతిదేవచక్రవర్తి ఎనిమిది గ్రామములను తొమ్మిది లక్షలధనమును తిక్కన కిచ్చినట్లు సోమదేవరాజీయమను గ్రంథమును బట్టి తెలియుచున్నది. ఈ రీతిగ తిక్కన విద్వజ్జన స్తుతిపాత్రమైన పాండిత్యముతో, కవితాశక్తితో, రాజనీతి నైపుణ్యముతో, రాజకార్యదక్షతతో, వైదికక్రియానిష్ఠతో పరమేశ్వరభక్తి పరతంత్రుడై జీవితమును గడపెను.

తిక్కన రచించిన గ్రంథములు రెండు మనకు లభించుచున్నవి. అందొకటి నిర్వచనోత్తర రామాయణము. రెండవది మహాభారతము. నిర్వచనోత్తర రామాయణము నాటికి తిక్కన కేవలము వట్టి తిక్కనయే. అతనిలో అప్పటికి రజోగుణము పాదుకొనినది. కావుననే అకావ్యమున సగర్వముగా నాతడిట్లు చెప్పుకొనెను.

మ॥ అమలోదాత్త మనీష నేనుభయ కావ్యప్రౌఢిఁబాటించుశి
ల్పమునఁబారగుఁడన్ గళా విదుఁడ నాపస్తంబసూత్రుండ, గౌ।
తమ గోత్రుండ మహేశ్వరాంఘ్రి కమల ధ్యానైక శీలుండ, న
న్నమకున్ గొమ్మన మంత్రికిన్ సుతుఁడఁదిక్కాంకుండ సన్మాన్యుఁడన్॥

మహాభారతము తెలిగించునాటికి తిక్కనలో మహాపరిణామము వచ్చినది. నిర్వచనోత్తరరామాయణ రచనాకాలము నాటికి తిక్కన యజ్ఞము చేయలేదు. మఱి మహాభారత రచనము నాటికి నాతడు సోమయాజియయ్యెను. భారతమున అశ్వాసాంత గద్యలలో "బుధారాధన విరాజి తిక్కన సోమయాజి" అని కలదు. రామాయణము నాటికి తిక్కన కేవలము శైవుడు.

ఇక భారతము నాటికి తిక్కన హృదయము పరిపక్వమయ్యెను. అతడు శివకేశవులకు భేదము పాటింపక హరిహరనాథ తత్త్వము నాశ్రయించెను. కావుననే అతడు మహాభారత ప్రారంభమున అవతారిక యందు ఈ క్రింది పద్యశ్లోకములను రచించెను.

ఉ॥ శ్రీయన గౌరినాఁబరగు చెల్వకు చిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై, హరిహరంబగు రూపముదాల్చి, విష్ణురూ।
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వము గొల్తు నభీష్టసిద్ధికిన్॥

శ్లో॥ కిమస్థిమాలాం కిము కౌస్తుభంవా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం।

**కిం కాలకూటః కిమువా యశోదా**
**స్తన్యం తవ స్వాదువద ప్రభోమే॥**

మఱియు హరిహరనాథుడు స్వప్నమున సాక్షాత్కరించి తిక్కనకు శివకేశవభేదము లేని భక్తి కుదురుకున్నదని స్పష్టముగా చెప్పెను.

ఉ॥ **వైదిక మార్గ నిష్ఠమగు వర్తనమున్ దగ నిర్వహించుచున్**
**భేదము లేని భక్తి మతి నిర్మలవృత్తిగఁజేయుచుండు, మ॥**
**త్పాద నిరంతర స్మరణ తత్పరభావము కల్మినాత్మ స**
**మ్మోదముఁబొంది కావ్యరసమున్ గొనియాడుచునుండు దెప్పుడున్॥**

నిర్వచనోత్తర రామాయణమును తిక్కన మనుమసిద్ధి కంకితము చేసెను. మహాభారతమును నరాంకితము చేయక హరిహరనాథున కంకితము గావించెను. రామాయణములో తన్ను గూర్చి అహంకారముతో చెప్పుకొనెను. మహాభారత రచన నాటికి అహంకారశూన్యుడై బాలస్వభావుడనని చెప్పుకొనునంత వినయము కలవాడయ్యెను. రామాయణరచన నాటికి తిక్కన మంత్రియై, మహాభోగియై యుండెనని తలంపవలెను. కావుననే రజోగుణప్రధానుడై దురహంకారముతో కుకవి నిందచేసి పూర్వకవిస్తుతిలో నన్నయ పేరైన నెత్తలేదు. భారతరచనా కాలమున కతడు సత్త్వగుణప్రధానుడు. భక్తి వినయగౌరవములతో నన్నయ అధిక్యమును గుర్తించి అతనిని స్తుతించి కుకవి నిందను వదలెను. రామాయణరచననాడు సంస్కృత కావ్యధోరణియైన నిర్వచనపద్ధతి కావ్యనిర్మాణమున కుపయోగించునని తలంచెను. కాని భారతరచన నాటికి నన్నయ చూపిన చంపూ మార్గమే ఆంధ్ర కావ్యరచన కెక్కువ తగినదని గుర్తించెను.

**నిర్వచనోత్తర రామాయణము:-**

నిర్వచనోత్తర రామాయణము లభించిన తిక్కన కృతులలో మొట్టమొదటిది. సంస్కృత కావ్యములవలె వచన రహితముగా తిక్కన దీనిని రచించెను. ఈ రామాయణమును తిక్కన రచించుటకు గల హేతువును, కారణములను గూర్చి పండితులనేకులనేక విధములుగా ఊహలు చేసిరి. తన కంటె ముందు పూర్వ రామాయణము రచింపబడియుండుటచే తిక్కన నిర్వచనముగా ఉత్తరరామాయణమును రచించెనని పండితులు కొందఱూహించిరి. ఆ పూర్వరామాయణము నెవ్వరు రచించిరనునది ఒక ప్రశ్న. దీనికి సమాధానముగా కొందఱు తిక్కన తాతయగు భాస్కరుడే పూర్వరామాయణము రచించెనని చెప్పగా మఱికొందరు గోనబుద్ధభూపాలుడు దానిని రచించెనని చెప్పిరి. పండితుల వాదములట్లుండనిండు. తిక్కనయే నిర్వచనోత్తర రామాయణమున నిట్లు చెప్పెను.

కం॥ **ఎత్తఱి నైనను ధీరో**
**దాత్త నృపోత్తముఁడు రామధరణీ పతి, త॥**
**ద్వృత్తము సంభావ్యమగుట**
**నుత్తర రామాయణోక్తియుక్తుఁడనైతిన్॥**

ఏ సందర్భమునందైన శ్రీరామచంద్రుడు ధీరోదాత్తుడుగనే వ్యవహరించును. అందుచే ఆయన కథ ఎల్లరు గౌరవింపదగినది. ఈ హేతువుచే తాను ఉత్తరరామాయణమును రచింపబూనితినని తిక్కన వక్కాణించెను.

నిర్వచనోత్తర రామాయణము ప్రథమాశ్వాసమున పూర్వరామాయణ కథను

1

సంగ్రహముగా మూలమున లేకపోయినను తిక్కన రచించెను. దీనిని బట్టి యతడు పూర్వ రామాయణమును పూరించుటకై నిర్వచనోత్తరరామాణమును రచించెనని చెప్పరాదు. వాల్మీకి రచించిన ఉత్తర కాండమును ముక్కకు ముక్కగా తిక్కన తెలిగింపలేదు. అందలి కథను మాత్రమాధారముగా గ్రహించి ప్రక్షిప్తములను, అనౌచిత్యములను పరిహరించి వలయుచోట్ల రసపోషణము చేసి మంగళాంతముగా, స్వయంసంపూర్ణముగా మార్చి స్వతంత్రకావ్యమో అనునట్లు తిక్కన నిర్వచనోత్తరరామాయణమును రచించెను. కావ్యము మంగళాంతముగా నుండుటకై ఆయన మాతృక యందలి రామనిర్యాణకథ వదలెను. పూర్వకథతో పొత్తు కలుపుటకై ప్రథమాశ్వాసమున పూర్వరామాయణకథ సంగ్రహముగా వర్ణింపబడినది. రావణుడు సూర్యచంద్రపాతాళ లోకములపై దండెత్తిపోయిన విషయములును, వాలిసుగ్రీవుల తండ్రియగు ఋక్షుని వృత్తాంతమును ప్రక్షిప్తములని విమర్శకులందురు. కావుననే వానిని తిక్కన వదలివేసెను. లక్ష్మణుడు సీతనరణ్యమున వదలివచ్చిన తరువాత అతనికి రాముడు చెప్పిన రాజ్యపాలనాది ధర్మములు, అనేక రాజులచరిత్రలు ప్రధానకథకు భంగము కలిగించునని కాబోలు ఆయన వానిని కూడ వదలివేసియుండును. ఇట్లే విభీషణవివాహసందర్భమున చెప్పబడిన సరమ జన్మవృత్తాంతమును ఔచిత్యమును గోరి తిక్కన వదలెను. ఈవిధముగా మూలకథను సంగ్రహపరిచినను రసవంతములైన భాగములందు కవితా శిల్పమును ప్రదర్శించుటకై తిక్కన మూలమునకు మెఱుగులు బెట్టెను.

నిర్వచనోత్తర రామాయణావతారికలో తిక్కన సర్వజనామోదకరములైన కవితాలక్షణములను ఆదర్శప్రాయముగ సూచించెను. అవి తిక్కన కవిత్వాశయములని చెప్పవచ్చును.

ఉ॥ భూరి వివేకచిత్తులకుఁబోలుననన్, దలపున్ దళంబులన్
సౌరభమిచ్చు గంధవహు చందమునన్ బ్రకటంబుసేసి, యిం।
పారెడు పల్కులన్ బడయ, నప్పలుకుల్ సరిగ్రుచ్చునట్లుగా
చేరుప నేరగా వలయు చేసెద నేఁగృతి యన్నవానికిన్॥

చం॥ పలుకుల పొందు లేక రసభంగము సేయుచు, ప్రాతవడ్డ మా
టలఁదమ నేర్పుఁజూపి యొకటన్ హృదయంబలరింప లేక, యే।
పొలమును గాని యెట్టి క్రమమున్ దమమెచ్చుగ లోకమెల్లన
వ్వులఁబొరయన్ జరించు కుకవుల్ ధర దుర్విటులట్ల చూడగాన్॥

కం॥ తెలుఁగు కవిత్వము చెప్పం
దలచిన కవి యర్థమునకుఁదగియుండెనదు మా।
టలుగొని, వళులున్ ప్రాసం
బులు నిలుపక యొగిని పులిమిపుచ్చుట చదురే॥

తే॥ ఎట్టి కవికైనఁదన కృతియింపు పెంపఁ
జాలుఁ గావునఁ గావ్యంబు సరసులైన।
కవుల చెవులకు నెక్కినఁగాని నమ్మఁ
దెందుఁ బరిణతి కలుగు కవీశ్వరుండు॥

ఉ॥ జాత్యముగామి నొప్పైన సంస్కృతమెయ్యెడఁజొన్ప, వాక్యసాం
గత్యము సేయుచోనైన గద్యము తోడుగఁజెప్పిపెట్ట, దొ।
ర్గత్యము దోప ప్రాసము ప్రకారము వేఱగు నక్షరంబులన్
శ్రుత్యనురూపమంచు నిడ, సూరుల కవ్విధ మింపు పెంపదే॥

కం॥ లలిత పద హృద్య పద్యం
ఋలన కథార్థంబు ఘటిత పూర్వాపరమై।
యలతి యలతి తునియలcగా
హల సంధించిన విధంబు నమరగ వలయున్॥

నిర్వచనోత్తర రామాయణమునాటి తిక్కన కవితాసిద్ధాంతములనిట్లు చెప్పవచ్చును. పూలరేకులచేత పరిమళమును ప్రకటించు వాయువు వలె కావ్యము రచింపదలచిన వానికి తన భావమును ప్రకటింప మనోహర శబ్దముల నెన్నుకొనుటకు ఆ శబ్దములను పూలదండ గ్రుచ్చినట్లు కూర్చుటకు నేర్పుకావలయును. అప్పుడు భూరివివేకచిత్తులు మెత్తురు. అనగా కవికి సహృదయులను రంజింపజేయు భావములుండవలయును. ఆ భావములను స్పష్టముగా అందింపగల శబ్దములుండవలయును. ఆ శబ్దములను పద్యములలో పూలదండవలె కూర్చు నేర్పుండవలయును. అప్పుడు రసిక విమర్శకులు మెత్తురు. కవి వాయువు. భావము పరిమళము. శబ్దములు పుష్పదళములు. కావ్యము పూలదండ. రసికులు మధుపములు. పలుకుల పొందులేక, రసభంగము చేయుచు ప్రాతవడ్డ మాటలలో తన నేర్పును చూపి ఏనియమము లేని తీరున ఆత్మతృప్తికి కవిత్వము వ్రాయు కుకవులు దుర్విటులవలె లోకుల పరిహాసమునకు పాత్రులగుదురు.

తెలుcగు కవి అర్థమునకు తగియుండెడుమాటలను కూర్చుటయే కాక ఆ పదములను యతిప్రాసములు చక్కగా కుదిరిన పద్యములందు కూర్పవలెను. ఛందస్సును బట్టి కావ్యమున సిద్ధింపగల శ్రావ్యతను తెలుcగుకవి సమగ్రముగా సాధింపవలెను. యతిప్రాసములు వాడుటయందు శ్రవ్యత సహకరింపని వర్ణములను స్వీకరింపరాదు. స్వీకరించిన కవి చతురుడుకాదు. సంస్కృతశబ్దము తెలుcగుబడి యందు అలవడినప్పుడు అనగా తత్సమ రూపము పొందినప్పుడు దాని విశేషణమును తేటగా చెప్పు సందర్భమున లింగవచనములు భేదింపనిచో బుధజనము మెచ్చును. సంస్కృతమున విశేషణ విశేష్యములు ఒకే లింగవచన విభక్తులందుండవలెను. నామవాచకవిశేషణములు భిన్నవిభక్తులందుండుట ఆంధ్రభాషా సంప్రదాయము. విభక్తి మారినను లింగవచనములు భేదింపనిచో పండితులు మెత్తురు.

కుకవికి, సుకవికి కూడ తన కావ్య మింపుగనే యుండును. కాని పరిణతి కలుగు కవీశ్వరుడు సరసులైన కవుల చెవుల కెక్కిననే తప్ప తన కావ్యము యొక్క రంజకత్వమును విశ్వసింపడు. ఇది "ఆపరితోషాత్ విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్" అను కాళిదాసుని సూక్తిని తలపించుచున్నది. సంస్కృతశబ్దములు సాధువులు కావచ్చు. కాని యవి ఆంధ్రజాతికి సంబంధించినవి కావు. అందుచే వానినెక్కడనుపయోగింపడు. అనగా తత్సమ రూపమును పొందని శుద్ధ సంస్కృత శబ్దరూపములను తెలుగు వాక్యములలో చొప్పించుట జాత్యము కాదు. జాత్యమనగా జాతి యందు పుట్టిన సంప్రదాయము. దీనినిబట్టి శివకవులు చేసినట్లు తాను చేయడు. మణిప్రవాళశైలి నవలంబింపడు. సంస్కృత వాక్యఖండములను యథాతథముగ తెలుగు వాక్యములలో నిరికింపడు.

పద్యములకు సంబంధమును కల్పించునప్పుడు కూడ గద్యమును గ్రహింపడు. అసమర్థత బయటపడునట్లుగా ప్రాసములందు భిన్నములైన అక్షరములను నిలిపి శ్రుతి సామ్యము సిద్ధించినదిగదా యని సరిపెట్టుకొనడు. డఢ, థధ, ణన, రఱ, లళ వంటి అక్షరములకు ప్రాసమైత్రి అంగీకరింపడని దీని యర్థము. పద్యరచనయందుగల శ్రుతిరమణీయతకు నెంతమాత్రము భంగము కలిగింపడు. చిన్నచిన్న తుంపులను కూర్పగా కాహళ ఏర్పడును. చిన్నచిన్న పద్యములను సంధింపగా కావ్యమేర్పడును. కాహళ యందు మొదటితుంపు కడ అవ్యక్తముగా బయలుదేరిన నాదము క్రమక్రమముగా అభివృద్ధి పొంది

చివరితుంపు నుండి అఖండమైన నాదధారగా అభివ్యక్తమగును. అట్లే కావ్యమునందు మొదటిపద్యమున అవ్యక్తముగా నుండిన భావము అనంతరపద్యములందు అభివృద్ధిచెంది కావ్యాంతమున అఖండరసధ్వని రూపమున అభివ్యక్తమగును.

వచన రహితముగా వ్రాయుటచే దీనికి నిర్వచనోత్తర రామాయణమను పేరు వచ్చినది. ఇది తిక్కన రచించిన ప్రథమ కావ్యమైనను దీనిలో మహాభారతము నందు సంపూర్ణముగా వికసించిన ఆయన కవితాకళ బీజరూపముననున్న దనవచ్చును. ఉత్తర రామాయణకథా వస్తువునందు రావణాదుల వృత్తాంతము, సీతారాముల ప్రవర్తనము అను రెండు ప్రస్ఫుట విభాగములు కలవు. ద్వితీయాశ్వాసము నుండి సప్తమాశ్వాసము సగము వరకు రావణాదుల వృత్తాంతము. ఆ తరువాత గల మూడున్నర యాశ్వాసములు సీతారాములకథ. ఈ రామాయణమున నాయకుని కథ కంటె ప్రతినాయకుని కథయే అధికముగా నున్నది.

మానవజీవిత ప్రతిపాదనము మానవ మానసిక తత్త్వవివరణము కవిత్వకళకు ముఖ్యలక్షణములు. తిక్కన శ్రీరాముని ధీరోదాత్తుడైన యుత్తమ మానవునిగా చిత్రించెను. సీతాపరిత్యాగసమయమున శంబూకముని సంహారవేళ శ్రీరాముడు పొందిన హృదయ సంక్షోభమును తిక్కన విపులముగా వర్ణించెను. విష్ణువు రాక్షసులను జయించిన ఘట్టమున వీరరసమును, సీతావనవాసగమన ఘట్టమున కరుణరసమును ఆయన సమర్థతతో పోషించెను. పాత్రల సంభాషణములను చిన్ననాటకమువలె ప్రత్యక్షము చేయుట మరియొక యుత్తమ కవితా శిల్ప లక్షణము. దీనినే నాటకీయత అందురు. నిర్వచనోత్తర రామాయణము నందలి రంభారావణ వృత్తాంతమును తిక్కన ఒక రూపకము వలె రచించెను.

**మహాభారతము:-**

మహాభారతాంధ్రీకరణము తిక్కన జీవితమునందే కాక ఆంధ్రసాహిత్య చరిత్రయందే ప్రముఖఘట్టము. ఆనాటికి తిక్కన హృదయము బహుముఖముగా పరిణతి చెందినది. ఆనాటికి దేశములో మతవైషమ్యము ప్రబలినది. జైనమత ప్రాబల్యము సమసిపోలేదు. శైవవైష్ణవులు శ్రుతిస్మృతులకు అర్థభేదము కల్పించి స్వమతాను కూలములైన వాక్యములను ఉదాహరించి తమ ఆధిక్యమును చాటుకొన మొదలిడిరి. స్వమత దురభిమానావేశములచే మతాచార్యులు రాజులనాశ్రయించి వారిని తమ మతానుయాయులుగా చేసి వారి యధికారబలమున నితర మతములవారిని హింసింప మొదలిడిరి. జనుల చిత్తములను మతోద్రేకములనుండి రక్షింప తిక్కన కంకణము కట్టుకొనెను. సర్వమతములకు సమన్వయము కల్పించునవి హరిహరనాథతత్త్వము, ధర్మాద్వైతభావమునని తిక్కన నిశ్చయించెను. ధర్మాద్వైతభావముతో పంచమవేదమైన భారతమును విరాటపర్వము నుండి స్వర్గారోహణపర్వము దాక పదునైదు పర్వములు తెనిగించి ఆయన హరిహరనాథున కంకితము గావించెను. భారత ప్రారంభముననే ఆ మహాకవి హరిహరనాథుని సేవించెను.

ఉ॥ శ్రీయన గౌరినాఁబరగు చెల్వకుఁజిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై, హరిహరంబగు రూపము దాల్చి, విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్త జనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వము గొల్తు నభీష్ట సిద్ధికిన్॥

వ్యాసమహర్షి మహాభారతమును ధర్మాద్వైతభావస్థితి యుండునట్లు రచియించెననియు భారతము ధర్మసమన్వయమును చాటుచున్నదనియు తిక్కన తలంచెను.

శా॥ విద్వత్సంస్తవనీయ భవ్యకవితా వేశుండు, విజ్ఞాన సం
పద్విఖ్యాతుఁడు, సంయమి ప్రకర సంభావ్యానుభావుండు కృ।
ష్ణద్వైపాయనుఁదర్థి లోకహిత నిష్ఠంబూని గావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైనయామ్నాయమున్॥

తిక్కన అద్వైతభావము కేవలము వాదము కొఱకు ఉపయోగించునది కాదు. అది సక్రమమై సంపూర్ణస్వానుభవమునకు వచ్చినట్టిది. ఆ అద్వైతము కర్మమార్గముతో ప్రారంభించి క్రమముగా భక్తిమార్గముతో పెరిగి తుదకు జ్ఞానమార్గములో నిలిచినది. నన్నయ కేవలము కర్మపరమగు వైదికదృష్టితో భారతమును చూచెను. ఇక తిక్కనయో దానిని భిన్నమతధర్మ సమన్వయ సాధనముగా హరిహరాద్వైత దృష్టితో చూచెను. తిక్కన హృదయమున లౌకిక వైదిక భావములు మేళవించినవి.

మహాభారత రచననాటికి తిక్కన 'సోమయాజి' యయ్యెను. అతడు వేదములు ప్రతిపాదించు కర్మమార్గమున నిపుణుడగుటయే కాక బ్రహ్మానంద సహోదరమైన రసానందముననుభవించు పరిపక్వహృదయము కలవాడయ్యెను. హరిహరనాథుడే తిక్కనను గూర్చి యిట్లు చెప్పెను.

ఉ॥ వైదికమార్గనిష్ఠమగు వర్తనమున్ దగ నిర్వహించుచున్
భేదము లేని భక్తిమతి నిర్మలవృత్తిగఁ జేయుచుండు మ।
త్పాద నిరంతరస్మరణ తత్పర భావము కల్మి నాత్మ స
మ్మోదముఁబొంది కావ్యరసమున్ గొనియాడుచునుండు దెప్పుడున్॥

ఈవిధముగా వేదాంత సాహిత్యములను సంపూర్ణముగా నిజజీవితములో సమన్వయించిన తిక్కన మహాకవిత్వదీక్షతో ఆంధ్రావళి మోదము పొందునట్లుగా మహాభారతాను వాదమునకు నుపక్రమించెను. ఆయనయే విరాటపర్వాదిని ఇట్లు చెప్పుకొనెను.

ఉ॥ కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁగ్రోలి, యాం
ధ్రావళి మోదమున్ బొరయునట్లుగ సాత్యవతేయ సంస్మృతి।
శ్రీవిభవాస్పదంబయిన చిత్తమునన్ మహాకవిత్వ దీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్॥

తిక్కన తాను రచించిన మహాభారతమును హరిహరనాథున కంకితము గావించెను. ఈ మహాభారతసృష్టియు నొకవిధమైన భగవత్పూజావిధానమని తిక్కన భావించెను. ఆయనయే అవతారికలో "అని పూని ఈదృశంబులగు పుణ్య ప్రబంధంబులు దేవసన్నిధింబ్రశంసించుటయు నొక్క యారాధన విశేషంబగుటంజేసి" అని స్పష్టముగా చెప్పెను. హరిహరనాథున కంకితముగా మహాభారతరచనము గావించుటచే తన జన్మము చరితార్థమైనదని తిక్కన భావించెను.

ఉ॥ ఇట్టి పదంబుగాంచి, పరమేశ్వరునింగృతినాథుఁజేసి, యే
పట్టునఁబూజ్యమూర్తియగు భారత సంహిత చెప్పఁగంటినా।
పుట్టు కృతార్థతన్ బొరసెఁ బుణ్యచరిత్రుఁడ నైతి నవ్విభున్
గట్టెదఁ బట్టమప్రతిమ కారుణికత్వ మహావిభూతికిన్॥

ఉ॥ కూర్చుట నూత్నరత్నమునకున్ కనకంబునకున్ దగున్, జనా
భ్యర్చితమైన భారతమపార కృపా పరతంత్ర వృత్తిమైఁ।

బేర్చిన దేవదేవునకుఁబ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి, నా
నేర్చిన భంగిఁజెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్॥

మహాభారత రచనముచే తిక్కన యశస్సును గాని, అర్థమును గాని కోరలేదు. అయన పునర్జన్మలేకుండ చేసికొన వలయుననియే భారతసృష్టికి శ్రీకారము చుట్టెను. భారతావతారికలో అయన స్వప్నవృత్తాంతము వర్ణించెను. ఒకనాటి స్వప్నమున తిక్కన తండ్రియగు కొమ్మన కనబడి హరిహరనాథుడు "నీవు రచించిన కిమస్తిమాలాం అను శ్లోకమునకు సంతోషించెను. నిన్ను కృతార్థుని జేయవచ్చుచున్నాడు" అని చెప్పెను. ఇంతలో ఆ హరిహరనాథుడు సాక్షాత్కరించి మహాభారతమును రచించి తనకంకితముగావింపుమని కోరెను. అప్పుడు తిక్కన హరిహరనాథునితో నిట్లనెను.

ఉ॥ ఇంతకు నేర్చు నీకు నొక యింతటిలోన మదీయవాణి న
త్యంత విభూతిఁ బెన్పెసగునట్టి నినున్ గొనియాడఁజేత దా।
నెంతటి పెద్ద, నీకరుణనిట్లు పదస్థుఁడనైతి, నింకజ
న్మాంతర దుఃఖముల్ దొలగునట్లుగఁజేసి సుఖాత్ముఁజేయవే॥

దానికి హరిహరనాథుడిట్లనెను.

తే॥గీ॥ జనన మరణాదులైన సంసార దురిత
ములకు నగపడకుండంగఁదొలగు తెరువు।
గను వెలుంగు నీకిచ్చితి ననిన లేచి
నిలిచి సంతోషమెద నిండ నెలవు కొనగ॥

రామాయణరచనాకాలము నాటికి నిర్వచనకవితా మార్గమే ఉత్తమమని భావించిన తిక్కన భారత నిర్మాణము నాటికి నన్నయ ప్రారంభించిన చంపూ కావ్యమార్గమే ఉత్తమమని భావించెను. అయన తన మహాభారతము నందలి ప్రతిపర్వమును ప్రబంధముగా నెంచెను. కావుననే భారతమును "ప్రబంధమండలి" యని పేర్కొనెను. విరాటపర్వము మొదలు స్వర్గారోహణ పర్వముదాక పదునైదు పర్వములను పండిత పామరరంజకముగా రచింపవలయునని తిక్కన భావించెను. అయన ఏమనెనో చూడుడు.

మ॥ హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వమట యుద్యోగాదులన్ గూడగా।
బదియేనింటిఁదెనుంగు బాస జన సంప్రార్థ్యంబులై పెంపునన్
దుదిముట్టన్ రచియించుటొప్పు బుధసంతోషంబు నిండారగన్॥

వ్యాసభారతమును యథాతథముగ తెలిగించుట తిక్కన లక్ష్యము కాదు. హరిహరనాథునభిప్రాయము కూడ అది కాదు. అయన తిక్కనతో నిట్లనెను.

కం॥ పారాశర్యుని కృతియయి
భారతమను పేరఁబరగు పంచమ వేదం।
బారాధ్యము జనులకుఁ ద
ద్గౌరవ మూహించి నీ వఖండిత భక్తిన్॥

తే॥ తెనుఁగు బాస వినిర్మింపఁదివురుటరయ
భవ్య పురుషార్థ తరుపక్వ ఫలము గాదె।

దీనికెడ నియ్యకొని వేద్కనూని కృతి ప
తిత్వ మర్థించి వచ్చితిఁదిక్క శర్మ॥

వినిర్మించుట యనగా విశేషముగా నిర్మించుట. మహాభారతము నున్నదియున్నట్లు తెలిగించినచో అది వినిర్మించుట కాదు. యథామూలానువాదమగును. మఱి వినిర్మించుట యనగా మూలగ్రంథతాత్పర్యమునకు భంగము లేకుండ కథా ప్రణాళికను మార్పక కుంచించియో, పెంచియో తెలిగించినచో అది నూతనముగా నిర్మించినట్లగును. ఇప్పట్ల తిక్కన నన్నయ ననుసరించెనని చెప్పదగును.

భారతాంధ్రీకరణమున తిక్కన నన్నయమార్గమునే అవలంబించి మూలభారతమును కొన్ని చోట్ల సంగ్రహపరచియు, కొన్ని చోట్ల విస్తరించియు మఱి కొన్ని భాగములు వదలియు స్వతంత్రముగా రచించెను. కాబట్టి తిక్కన యనువాదము మూలవిధేయము కాదు. మఱిస్వతంత్రము. ఆయన భగవద్గీత యందలి పదునెనిమిది అధ్యాయములను తెలిఁగింపలేదు. కాని భగవద్గీతా తాత్పర్యమునకు భంగము కలుగకుండ దాదాపు నలువది పద్యములు రచించెను. సత్సున జాతీయమును పూర్తిగ వదలి వేసెను. మూలభారతమున విస్తారముగా నున్న తత్వోపదేశ విషయములను సంగ్రహపరచి ప్రధాన కథకు భంగము రానట్లు రచించెను. రసవంతమైన విరాటపర్వమును విస్తరించి వ్రాసెను. కాబట్టి తిక్కన తత్వోపదేశ దృష్టితో కాక కావ్యకళాదృష్టితో భారతమును తెలిఁగించెననుట స్పష్టము.

తిక్కన కవిత్వమున దేశి తెనుఁగు మెండు. దేశితెనుఁగు మాటలందు కూడ అనాడు వ్యవహారమునందున్న పదములనే తిక్కన వాడెను. కాని ఆపదజాలమినాడు వాడుక నుండి తొలగినది. అందుచే ఇప్పుడు కొన్ని పదములు మనకర్థము కాక యున్నవి. శివకవులవలె తిక్కనయు జానుతెనుగునే వాడెను. కాని యొకభేదము కలదు. శివకవులు దేశీయ పదములను సంస్కరింపకుండ ఉన్నవానినున్నట్లు వాడిరి. కాని తిక్కన వ్యవహారమున వివిధరూపములుగ నున్న తెలుఁగు మాటలను శిష్టవ్యవహారయోగ్యములుగా సంస్కరించి కావ్యమున ప్రయోగించెను.

తిక్కన వృత్తములను గాని, జాత్యుపజాతులను గాని భావానుగుణముగ వాడెను. గాంభీర్యమును, ఉదాత్తతను, తీవ్రతను, మహోత్సాహమును వర్ణించుటకు మత్తేభశార్దూలములను, శృంగారకరుణములను ప్రతిపాదించుటకు ఉత్పల, చంపకమాలలను తిక్కన వాడెనని స్థూలముగా చెప్పవచ్చును. వర్ణనలు చేయుటకు సీసపద్యమును ప్రత్యేకముగా రచించెను. ఆ సీసపద్యమునందును నాల్గుపాదములును సమత కలిగియుండునట్లుగా భావమును, భాషయు కూర్చి వ్రాయును. తిక్కన సీసములు ప్రతిపాదము నందు ఏభాగమునకాభాగము తెగిపోవును. ఈ క్రింది పద్యమును తిక్కన సీసపద్యరచనమునకు తార్కాణముగా గ్రహింపవచ్చును.

సీ॥ ఎవ్వని వాకిట నిభమద పంకంబు
రాజభూషణ రజోరాజి నడ గు
నెవ్వని చారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపు గఱపు॥
నెవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి
మానిత సంపదలీనుచుండు
నెవ్వని గుణలత లేదు వారాసుల
కడపటి కొండపై కలయఁబ్రాకు॥

తే॥గీ॥ నతడు భూరిప్రతాప మహాప్రదీప
దూరవిఘటిత గర్వాంధకారవైరి।
వీరకోటీరమణి ఘృణి వేష్టితాంఘ్రి
తలుcడు కేవల మర్త్యుcడే ధర్మసుతుcడు॥

ఇట్టి సీసపద్యరచనా శిల్పమును మొదట నన్నెచోడుడవలంబించెను. తరువాత శ్రీనాథాదులు దానికి మెఱుcగు బెట్టిరి. మొత్తము మీద తిక్కనకు కందము, ఆటవెలది, తేటగీతి మున్నగు పద్యముల మీదనే యభిమానము మెండు. కవి చౌడప్ప చెప్పినట్లుగా కందపద్యరచనమున సోమయాజి దిట్టయే. స్త్రీ పర్వము నందు తిక్కన అనేక నూతన వృత్తములనుపయోగించెను.

సోమయాజి భారతకవితా శిల్పమును కొన్ని శీర్షికల క్రింద విభజింప వచ్చును. తిక్కన శైలి నాటకీయశైలి. ఆయన రచించునది శ్రవ్యకావ్యమైనను దానియందు దృశ్యకావ్యధర్మముల నారోపించెను. తానై తిక్కన కథ చెప్పడు. సర్వసన్నివేశములను పాత్రలసంభాషణమూలముననే తెలుపును. అందుచే తిక్కన భారతమును చదువుచున్నప్పుడు రూపకమును దర్శించుచున్నట్లుండును. తిక్కన పద్యములలో అనేక వాక్యము లిమిడియుండును. పరశురాముడు భీష్మునితో నిట్లనును.

చం॥ గురుడని నన్నెఱుంగు దనఘుండవు, నావచనంబు నందనా
దరణము సేసి తెన్నియొ విధంబుల పల్కెదు భక్తితోడ, నీ।
వెరవులు దక్కు మీయబల వేగమ పెండిలి సేయు మంతతో
మరలు మదీయకోపశిఖి మానదు వేఱొక వేయుcజేసినన్॥

ఈ పద్యమున నెనిమిది వాక్యములు గలవు.

చం॥ ఇది కడు ముద్దరాలు, పనులేమియు చేయగనేరదెంతయున్
మృదువొక కీడు పాటునకు మేకొనజాలదుదాత్త చిత్త, యెం।
టిదిరుగు దాని కోర్వ దొకటిని దనుదా నవరించచొప్పెఱుం
గదు తగనొండులన్ గొలువగా వెఱవెమ్మెయి కల్గునక్కటా॥

తిక్కన సామాన్యముగా దీర్ఘ సమాస రచన గావింపడు. అలతియలతి తెలుcగు పలుకులతో భావములను వ్యక్తీకరించును. అయినప్పటికి ఆ పదముల కూర్పు జిగి, బిగి కలిగియుండును. రచనమున దూరాన్వయములుండవు. సంస్కృతభాషాసంప్రదాయములు గోచరింపవు. ఈ క్రింది పద్యములను చూడుడు.

ఉ॥ వచ్చినవాడు ఫల్గునుcడవశ్యము గెల్తుమనంగరాదు రా
లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే।
హెచ్చుగుcగుందగున్, దొదరుటెల్ల విధంబుల కోర్చునట్లుగా
కిచ్చcదలంచి యొక్క మెయినిత్తఱిcబొందగుచేతయున్ దగున్॥

చం॥ కడుపసిబిడ్డ వీడొకటి కాదవునా నెఱుగండు ముందటె
య్యెడ నొక పాటెఱుంగ డెద యెంతయుcగోమలమెప్పుడైననేc।
గుడువగcబిల్తుగాని తనకుంగల యాకటి ప్రొద్దెఱుంగc డీ
కొడుకిటు పోకకున్ మనము కుందెడు విన్ననియూరడిల్లెడున్॥

కవితాశిల్పధర్మమును బట్టి తిక్కన యెడనెడ సంస్కృత పదభూయిష్ఠమైన ఓజోగుణమును చూపును.

పాత్రలు భావోద్రేకమును పొందినప్పుడు సామాన్యముగా నాయన యిట్టి రచనము గావించును. కీచకుడు మోహమును వ్యక్తపరచినపుడు ద్రౌపదియిట్లు మాటాడినదని తిక్కన వ్రాసెను.

శా॥ దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాపస్ఫురత్
గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతులేవురిప్డు వినుదోర్లీలన్ వెసన్ గిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణమున్ గొనుట తథ్యంబెమ్మెయింగీచకా!॥

తిక్కన అనువదించిన భారతభాగమున కాకువు ఎక్కువ పాత్రములు మాటాడునప్పుడు అమాటల యందలి కొన్ని యక్షరముల నొత్తి పలికిన నొక యర్థము వచ్చును. అయక్షరములనే తేలికగా పలికిన భిన్నార్థము వచ్చును. లోకవ్యవహారమున నిట్టి కాకువు బహువిధములుగా భాసించును. "మీ పెద్దతండ్రి యగు ధృతరాష్ట్రుడు అజ్ఞాతవాసానంతరము మీరెట్లుండిరో చూచిరమ్మని నన్ను పంపె"నని సంజయుడాడిన మాటకు ధర్మజుడిట్లు సమాధానము చెప్పెను.

కం॥ ఆ రాజు మా దెసంగల
కారుణ్యము కతమునకు సుఖంబున నిట్లీ
న్నారము నిను బుత్తెంచిన
గారవమున నాదు మది వికాసము నొందెన్॥

పాత్రముల మనోభావములకును, వారి ముఖస్వరూపమునకు, చేష్టలకు గల సంబంధమును చిత్రించుటలో తిక్కన సిద్ధహస్తుడు. పాత్రల మనస్సును బట్టి వారి ముఖాకృతియు చేష్టలు నుండును. వానిని కన్నులకు గట్టినట్లు తిక్కన చిత్రించును. కీచకుడు, ఉపకీచకులు సంహరింపబడిన పిదప సుదేష్ణ మందిరము ప్రవేశించుచున్న ద్రౌపది మానసిక సంతోషమును దానిని కప్పిపుచ్చుటకై యామె చేసిన ప్రయత్నమును తిక్కన అత్యద్భుతముగా వర్ణించెను.

సీ॥ ముదమున నెలమి సొంపొదవి వెమ్మొగమునఁ
దోపంగ వచ్చినఁద్రోచిత్రోచి
లలి నుల్లసిల్లుచు లలిత లోచన దీప్తు
లదర నుంకించిన నాగియాగి
సంతసంబున బాలిశములగు చెయ్వులు
తొడరఁజూచినఁజేయకుడిగియుడిగి
మనమున నుబ్బుమై మాట నాలుకకురాఁ
గడగిన నాడక కడపి కడపి॥

తే॥ ధీరయై యిట్లు సమ్మదపూరమునకు
గఱువతనమను బలితంపుఁ గట్టవెట్టి
వెలది యెఱుగని యదివోలె వికృతి లేక
యల్ల నెప్పటి యట్టుల యరుగుటయును॥

అట్లే కౌరవ సైన్యమును చూచి భయపడిన ఉత్తరకుమారుని స్వరూపము కన్నులకు కట్టునట్లు తిక్కన వర్ణించెను.

సీ॥ వెలవెలఁబారుచు వెగడొందుఁ బెదవుల
తడియారనెంతయుఁదల్లడిల్లు

జల్లన సంగంబు లెల్ల నింపఁజెమర్చు
బదములు గరములుఁగుదియ వడకు
హృదయంబు తటతట నదరంగఁబెలుకుబు
దీనదృష్టుల మోము తేటి చూచు
నెలుగు గద్గదికఁదొట్రిల సేద్పు, విడుమని
ప్రార్థించు మాటఁగీద్పాటు తోప॥

తే॥గీ॥ నిష్కళత శుద్ధ హేమంబు నిర్మలోజ్జ్వ
లాష్ట వైడూర్యములు తురగాఢ్యరదము
కరటి దశకంబు, నొకయూరు, పురము సొచ్చి
నపుడయిచ్చెద నీకను నార్తుడగుచు॥

తిక్కన కవిత్వమున తెనుగుదనమెక్కువ. తెనుగు దన మనగా కేవలము తెలుగు మాటలను గుదిగ్రుచ్చుట కాదు. ఇది అభిప్రాయములను వెల్లడించు పద్ధతికి సంబంధించినది. తెలుగువాడు తన యభిప్రాయములను ఎట్లు వెల్లడించునో తెలిసికొనినగాని కవిత్వములో తెనుగుదనము నెలకొనదు. దీనికి అసాధారణ లోకపరిశీలనము కావలయున్ను. తిక్కనలోనది పుష్కలముగా నున్నది. పరాభవము పొందిన ద్రౌపది విరాటరాజు సభకు విచ్చేసియిట్లనును.

ఉ॥ ఇందఱు చూడగా నిచట నిమ్మెయి నన్నుఁబతివ్రతాగుణా
స్పందిత వర్తనన్ బరమసాధ్వి ననిందితశీలఁగీచకుం
డెందును నెట్టి యంగనల నెవ్వరుఁజేయని యట్లు సేయగాఁ
గొందఱకైన నిష్ట కృపకున్ దరి గాదటియేమి సెప్పుదున్॥

రాయబారమునకు పోవుచున్న కృష్ణునితో ధర్మజుడిట్లనెను.

కం॥ మమ్మెఱుఁదెదిరి నెఱుఁగుదు
నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱియెఱుఁగుదు, వా
క్యమ్ముల పద్ధతి యెఱుఁగుదు
పొమ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు చెప్పన్॥

తిక్కన రచనములో విరాటోద్యోగపర్వములవలెనే తదితర పర్వములను మిక్కిలి రసవంతముగా నుండును.

విరాటపర్వమున కీచక వృత్తాంతములో శృంగారవీరరసములను పోషింపదలచి రసభావముల కనుగుణముగ విస్తరించి వ్రాసెను. ఉద్యోగపర్వమునందు సంజయు రాయబారమును, కృష్ణరాయబారమును అసాధారణరాజకీయ చాతుర్యముతో చిత్రించెను. తిక్కనకు గల రాజనీతివైదుష్యము ఈ ఘట్టములలో ప్రతిబింబించినది. ఈ భాగములు ధ్వనిప్రధానములు. యుద్ధ పర్వములో అయన తనకు గల యుద్ధ విజ్ఞానమును చక్కగా చూపెను. శాంతిపర్వాదులలో రాజనీతి ధర్మ వేదాంతాది విషయములను అరటిపండొలిచి చేతబెట్టినట్లు వివరించెను. మహాభారతము విశ్వవిజ్ఞాన కోశము. తిక్కన సోమయాజి విశ్వవిజ్ఞాన సమన్వితుడైన కవిబ్రహ్మ అట్టియాయన మహాభారత రచనము ముగిసిన పిదప చం. హరిహరనాథ! సర్వభువనార్చిత! నన్ దయజూడుమెప్పుడున్ అని వ్రాయుట ఆయన హృదయ సంస్కార పరిపాకమునకు ప్రబల తార్కాణము.

# మూలఘటిక కేతన

తిక్కన సోమయాజికి సమకాలికుడై అతనితో సన్నిహిత సంబంధము గల కవి మూలఘటిక కేతన. ఇతడు వేంగిదేశము నందలి 'వెంటిరాలు' అను అగ్రహారమునకు పెద్ద. అతడే దశకుమారచరిత్రమున "వేగి విషయమున వెంటిరాలను పేరనభిరామమగు నగ్రహారమునకు నగ్రణియగువాని" అని చెప్పుకొనెను. పిదప కేతన నెల్లూరి కేగి తిక్కన సోమయాజి నాశ్రయించి ప్రసిద్ధికి వచ్చెను. ఇతని తల్లిదండ్రుల పేర్లయందు మార్పాటు కనబడుచున్నది. దశకుమార చరిత్రములో తల్లి సంకమాంబయనియు, తండ్రి మారయయనియు చెప్పుకొనిన కేతన విజ్ఞానేశ్వరీయము నందు తల్లి గంగమాంబ యనియు తండ్రి ప్రానయ యనియు చెప్పెను.

కేతన రచించిన గ్రంథములు మూడు మనకు లభించుచున్నవి. 1. దశకుమారచరిత్ర. ఇది చంపూ కావ్యము. 2. ఆంధ్రభాషాభూషణము. ఇది వ్యాకరణ గ్రంథము. 3. విజ్ఞానేశ్వరీయము. ఇది ధర్మశాస్త్ర గ్రంథము.

సంస్కృతము నందు ఆచార్యదండి రచించిన దశకుమారచరిత్రము ప్రసిద్ధమైన గద్యగ్రంథము. అందు రాజవాహనాది దశకుమారుల సాహసకృత్యములు వర్ణింపబడినవి. దానిలో శృంగార హాస్యరసములును గలవు. ఆ గద్యకావ్యమునే కేతన ద్వాదశాశ్వాసములు గల చంపూ కావ్యముగా తెలిగించి తిక్కన సోమయాజి కంకితము గావించెను. "దండినః పదలాలిత్యం" అని యొక సూక్తి గలదు. లలితలలిత సంస్కృత పదజాలమును సుందరముగా నుపయోగించి ఆచార్యదండి దశకుమారచరిత్రమును రచించెను. "అట్లే ఆంధ్రకవి కేతన కవిత్వము కూడ లలితపదవిలసితమై ద్రాక్షాపాకముగా నున్నది" అని లక్ష్మీరంజనముగారనిరి. వారియభిప్రాయముతో నేకీభవించుట సద్విమర్శకులకు సాధ్యము కాదు.

కేతనకు అభినవ దండి బిరుదమున్నట్లు ఆయనయే చెప్పికొనెను. "అభినవ దండినాఁ బొలుపు మీరినవాని" నని దశకుమార చరిత్రమున గలదు. ఈ బిరుదు దశకుమారచరిత్రాను వాదమును బట్టి వచ్చియుండును. కవిత్వము చెప్పి తిక్కన సోమయాజిని మెప్పించుట బ్రహ్మకైన సాధ్యము కాదనియు అట్టి సోమయాజి మెచ్చుకొనునట్లుగా దశకుమారచరిత్రము చెప్పితిననియు కేతన చాటుకొనెను.

**ఆ.వె.॥** **కవిత చెప్పియుభయకవిమిత్రు మెప్పింప**
**నరిది బ్రహ్మకైన నతడు మెచ్చఁ**
**బరగదశకుమార చరితంబు చెప్పిన**
**ప్రోఢ, నన్ను వేఱె పొగడనేల॥**

దశకుమారచరిత్రమును సమీక్షించునపుడు విమర్శకులలో నేకాభిప్రాయము లేదు. ఇతనికి అభినవ దండియను బిరుదు తగదని కొందఱు విమర్శకులనగా మఱి కొందఱు కేతన కవిత్వముత్తమోత్తమమని పేర్కొనిరి. సంస్కృత గద్యకావ్యము ననువదించునపుడు కేతన నన్నయ తిక్కనల అనువాదపద్ధతినే అవలంబించెను. కథావృత్తాంతమును సంగ్రహముగా కావ్యప్రారంభమున కేతన పేర్కొనెను. అతడు రసోచిత కథల నించుక పెంచుచు మిగిలిన వానిని కుదించుచు దశకుమార చరిత్రమును రచించెను. మూలము నందలి నవమోచ్ఛ్వాసమును (అదియే ఉత్తర పీఠిక) కేతన వదలివేసెను. అపహారవర్మ కథయందలి వేశ్యావృత్తాంతము తగ్గించిన కేతన విశ్రుతుని కథ యందలి రాజనీతులను పెంచెను. ఇట్లు అతడు కేవలము కథకే ప్రాముఖ్యము కల్పించి వర్ణనల కవకాశము కల్పింపక ఈ కావ్యమును రచించెను.

కేతన కవిత్వము ఎడనెడ ద్రాక్షాపాకముతో నొప్పుచుండును. అతడు సంస్కృత సమాసభూయిష్ఠముగను, దేశిపదమయముగను కవిత్వము చెప్పగలడు. ఈతని కవితాశైలి నిరర్గళమైన ధారాశుద్ధి కలిగి అన్వయకాఠిన్యము లేక నిర్దుష్టము, అక్లిష్టము, హృదయరంజకము నైనదనుటలో సందేహము లేదు. మొత్తముమీద కేతన తేటతెలుగు మాటలతో సరళముగా వ్రాయనిచ్చగించును. ఈ క్రింది పద్యములాతని రీతికి తార్కాణములు.

మత్తే॥ చటులస్యందన ఘట్టనన్ దెరలి, యశ్వవ్రాతచంచత్ ఖురో
ద్భట పాదాతపదాహతిన్నెగసి, యుద్యద్వారణ శ్రేణికా
కట నిష్యంది మదాంబు వృష్టి నడవంగా భూరజఃపుంజ ము
త్కట దర్పోద్ధత వృత్తినొత్తి నడచెన్ దండెత్తి యుద్దండుఁడై॥

మత్తే॥ కొడుకా! పుట్టిననాడు నిన్నదయతన్ ఘోరశ్మశానంబులో
నడురే యెవ్వరు కానకుండఁబటునానాభూత సంఘంబుపా
ల్పడనే వైచిన, నన్నుఁదల్లియని సంభావించి రక్షింపని
క్కడి కేలా చనుదెంచి తిప్పుడనుచున్ గన్నీటనూఱార్చుచున్॥

ఉ॥ అల్లుడవీవు రాజ్యమునకంతకు నర్హుడవీవు భూమికిన్
దల్లివి తండ్రివిన్ బహు విధంబుల దాతవు నీవు మాకులం
బెల్ల సముద్ధరింప నుదయించిన పుణ్యుఁడవీవు, నీకునే
నెల్లి మదీయపుత్రిఁబురమెల్ల నెఱుంగగఁబెండ్లిచేసెదన్॥

దశకుమారచరిత్రమున ముఖ్యముగా సాహసే లక్ష్మీ అను నీతి ప్రతిపాదింపబడినది. ఇందలి కథలందు నీతివినీతులతోపాటు జార, చోర, హత్యా, ద్యూత, వంచనాదులు, ఉపకారదాక్షిణ్య కృతజ్ఞతాదులు ప్రతిపాదింపబడినవి. దశకుమార చరిత్రాంధ్రీకరణముతో నాంధ్రసాహిత్యమున నూతనాభిరుచి ప్రారంభమైనది. నన్నయ ఆంధ్రులకు పురాణాభిరుచిని కల్పించెను. నన్నెచోడుడు ప్రబంధరుచులను చవిచూపెను. ఇక కేతనయో చిత్ర కథాభిమానమును రేకెత్తించెను. సామాన్యముగా ప్రతి మానవుని యందు బాల్యమునుండియు విచిత్రకథాశ్రవణకుతూహలముండును గదా, అదియే పరిణతి చెంది ప్రౌఢవయస్సున పద్యరూపమున కేతనచే ప్రతిపాదింపబడినది. ఈ కాలముననే కవిభల్లటుడు భేతాళ పంచవింశతిని, భాస్కరుని కేతన కాదంబరిని చంపూ రూపమున నాంధ్రీకరించిరి. మంచన కేయూరబాహుచరిత్రమును సృష్టించెను. దీనినిబట్టి కేతన కాలమునాడు లౌకిక ప్రపంచమునందు, సాహిత్య ప్రపంచమునందు కథాభిరుచి విశేషముగా నున్నదని యూహింపవచ్చును.

కేతన రచించిన రెండవగ్రంథము ఆంధ్రభాషాభూషణమను వ్యాకరణము. ఇది 180 పద్యములు గల లఘువ్యాకరణము. ఇంతకు పూర్వములక్షణమును తెలుపు గ్రంథము లేదనియు, తానే మొట్టమొదట దానిని రచించుచున్నాడననియు కేతన చెప్పుకొనెను.

కం॥ మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నడు నెవ్వరును జెప్పరేఁజెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చగ
నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్॥

తే॥గీ॥ సంస్కృత ప్రాకృతాది లక్షణము చెప్పి
తెనుఁగునకు లక్షణము చెప్పకునికి యెల్ల

కవిజనంబుల నేరమి కాదు నన్ను
ధన్యుఁగావింపఁదలచిన తలపు గాని॥

దీనినిబట్టి ఆంధ్రభాషాభూషణము ప్రథమాంధ్ర వ్యాకరణమేమో యనునూహ కలుగుచున్నది. ఇది సంగ్రహవ్యాకరణము. ఆ మాట కేతనయే చెప్పెను.

తే॥గీ॥ కంచి నెల్లూరు మతియోరుగల్లయోధ్య
యను పురంబులపై గంగకరుగుమనిన॥
పగిదినొక త్రోవ చూపెద, బహుపథంబు
లాంధ్రభాషకుఁగలవని యరసికొనుడు॥

ఈతని మూడవ గ్రంథము విజ్ఞానేశ్వరీయము. ఇది ధర్మశాస్త్రము. ధర్మశాస్త్రముల నాంధ్రీకరించుటకు కేతనయే ప్రథముడు. మొత్తము మీద ఈతని రచనములు మూడును మూడు నూతన మార్గములను త్రొక్కినవే. యాజ్ఞవల్క్యమహర్షి ఆచారకాండము, ప్రాయశ్చిత్తకాండము, వ్యవహారకాండమునను మూడు కాండములు గల స్మృతిగ్రంథమును రచించెను. దీనికి యాజ్ఞవల్క్యస్మృతి యని పేరు. ఈ స్మృతికి విజ్ఞానేశ్వరుడు "మితాక్షరి" యను పేరుతో నొక వ్యాఖ్యానము చేసెను. మితాక్షరితో కూడిన యాజ్ఞవల్క్యస్మృతిని కేతన తెలిగించి దానికి విజ్ఞానేశ్వరీయము అని పేరు బెట్టెను. ధర్మశాస్త్రమైన ఈ గ్రంథమును కూడ కేతన మనోహరముగా రచించెను. ఇందలి శైలియు సులభ సుందరముగా నుండును.

ఉ॥ పుత్రులు లేరు నాకు నిది పుత్రిక దీనినలంకరించినీ
క్షేత్రముగాక నిచ్చెద నకిల్బిషమానస! నీకు దీనికిన్॥
బుత్రుఁడు పుట్టగా నతడు పుత్రుడునాకనిపల్కికొన్నయా
పుత్రుఁడు నౌరసుండు సరిపుత్రులకెల్లను బెద్దలిద్దఱున్॥

ఆ॥వె॥ స్త్రీ ధనంబు పేరఁజెల్లిన ధనమెల్లఁ
గూతుఁజేరుఁ, గూతు కూతుఁజేరు॥
కూతు కానకున్నఁగొడుకుపాలగుఁగాని
వేఱు పాలివారు వెదకలేరు॥

## అథర్వణాచార్యులు

అథర్వణాచార్యుఁడు బ్రాహ్మణుడని కొందఱు జైనాచార్యుడని కొందఱు చెప్పుచున్నారు. జైనాచార్యుడనుటలో వింతయేమియు లేదు. నన్నయకు ముందు జైన బౌద్ధమతము లాంధ్రదేశములో ప్రజాసామాన్యమునందు బహుళవ్యాప్తి గాంచెను. జైనపండితులు దేశభాషాభిమానులై కావ్యములను, లక్షణగ్రంథములను సృష్టించిరి. తమిళకర్ణాట భాషలను పరిశీలించినచో ఈ విషయము తేటతెల్లమగును. అట్లే ఆంధ్రదేశమందలి జైనులు కూడ ఆంధ్రభాషా సేవ చేసియుందురు. ఈ దేశమున జైనమతమడుగంటిన తరువాత జైనకవులు రచించిన గ్రంథములును నశించియుండును.

అథర్వణాచార్యుఁడు తిక్కన సోమయాజికించుక పూర్వుడు గాని లేక సమకాలికుడు గాని కావచ్చును. అథర్వణఛందస్సునందలిదని ఈ క్రింది పద్యమొకటి లభించినది.

కం॥ మగణమ్ముఁగదియ రగణము
వగవక కృతిమొదట నిలుపువానికి మరణం॥

బగు నిక్కమంద్రు మఱియదె
యగునని యిడి తొల్లి టేంకణాదిత్యుడనిన్॥

ఇట టెంకణాదిత్యుడనగా కుమార సంభవకర్తయగు నన్నెచోడుడు. కాబట్టి అథర్వణాచార్యుడు నన్నెచోడుని తరువాతి వాడనుట స్పష్టము.

అథర్వణాచార్యుడు రచించినట్లు చెప్పబడుచున్న నాలుగు గ్రంథములు గలవు. 1. ఛందశ్శాస్త్రము 2. భారతము(విరాటోద్యోగ భీష్మపర్వములు) 3. వికృతి వివేకమను అథర్వణకారికావళి 4. త్రిలింగశబ్దానుశాసనము.

లక్షణగ్రంథములందుదాహరింపబడిన పద్యములను బట్టి అథర్వణుడు ఛందశ్శాస్త్రమును రచించెనని తెలియుచున్నది. అయాలక్షణగ్రంథములలో అథర్వణుని ఛందస్సు నందలివని దాదాపు ముప్పది పద్యములవరకు నుదాహృతములైనవి. కాని ఆ ఛందశ్శాస్త్రమిప్పుడెచ్చటను గానరాదు. మఱియు లక్షణగ్రంథములందుదాహృతములైన పద్యములన్నియు అథర్వణుని ఛందశ్శాస్త్రములోని వగునో కావో నిశ్చయముగా చెప్పలేము. లక్షణకర్త లొక్కొక్కప్పుడు ఒకరిపద్యములనింకొకరివిగా నుదాహరించుటయు కలదు. అథర్వణుని పేరనున్నయొక పద్యములో యతులిరువది యెనిమిది యని కలదు. ఈ పద్యమతనిదే యైనచో నతడు అనంతుని తరువాతివాడని చెప్పవలసి యుండును. ఏలయన అనంతామాత్యుడు ఇరువది నాలుగు యతులనే పేర్కొనెను. సామాన్యముగా ఆంధ్రలక్షణగ్రంథములలో యతుల సంఖ్య అభివృద్ధి చెందుచు వచ్చినదే కాని పెరిగి తగ్గినది కాదు.

అథర్వణభారతము నుండి కూడ లక్షణగ్రంథములలో పద్యము లుదాహరింపబడినవి. అపద్యములు తప్ప అతని భారతము మనకు లభింపలేదు. దొరకిన అపద్యములను బట్టి అథర్వణుని భారత కవిత్వము ప్రౌఢమని చెప్పవచ్చును.

మత్తే॥ నతనానావనినాథ యూథమకుట న్యస్తాబ్జరాగోజ్జ్వల
ద్ద్యుతివిభ్రాజిత పాద పీఠు, లలనాదోశ్చామరోద్ధూత మా
రుతలోలా సినీల కుంతలుఁ బ్రభారుగ్ధాముఁ గేయూరశో
భిత బాహా పరిఘున్ సువర్ణధరణీభృద్ధైర్యుదుర్యోధనున్॥

కం॥ పదిదినములైదు ప్రొద్దులు
పదపడి రెన్నాళ్ళు నొక్క పగలున్ రేయున్।
కదనంబు సేసి మడిసిరి
నదిసుత గురుకర్ణశల్యనాగపురీశుల్॥

అథర్వణుని పేర సంస్కృతభాషలో రచియింపబడిన రెండాంధ్ర వ్యాకరణములు కనబడుచున్నవి. అందొకటి వికృతివివేకము. దీనికే అథర్వణకారికావళి యని నామాంతరము. రెండవది త్రిలింగశబ్దానుశాసనము. ఈ రెండు వ్యాకరణములు కూడ అథర్వణాచార్యునివేయని వఱ్ఱులచిన సీతారామస్వామి శాస్త్రిగారియభిప్రాయము. వారి యభిప్రాయములతో నేకీభవించుట విమర్శకులకు సాధ్యము కాదు.

1. అథర్వణుడు వికృతి వివేకమును రచించినట్లు అహోబలపండితునకు పూర్వమెవ్వరును తెలుపలేదు. అప్పకవీయప్రారంభమున ననేక లక్షణగ్రంథములు పేర్కొనబడినవి. వానిలో అథర్వణుని ఛందశ్శాస్త్రము కూడ కలదు. కాని అతని వ్యాకరణములేవియు పేర్కొనబడలేదు.

ఆంధ్రశబ్దచింతామణికి వివరణమును, సంపూర్ణగ్రంథమునగు అథర్వణకారికలను బాలసరస్వతియు, అప్పకవియు నుదాహరించిరని చినసీతారామస్వామిశాస్త్రిగారు వ్రాసిన వాక్యములు ప్రామాణికములు కావు. కొన్ని ప్రతులలో ప్రక్షిప్తవాక్యములు మాత్రము కలవు. అహోబల పండితుడు మాత్రమే ఆంధ్రశబ్దచింతామణికి సంస్కృతమున వ్యాఖ్యానముచేయుచు అథర్వణకారికలను విశేషముగా నుదహరించి నన్నయను ప్రథమాచార్యునిగా, అథర్వణుని ద్వితీయాచార్యునిగా పేర్కొనెను.

2. అథర్వణుని గ్రంథము నందలి విషయములన్నింటిని తన వ్యాఖ్యానమున కూర్చుటచే ఆగ్రంథమును పండితులిక చూడనక్కఱలేదని అహోబలుడు వ్రాసెను. చింతామణి వ్యాఖ్యాన కృత్యాదియందు ఈ విషయమును అసందర్భముగా వ్రాయవలసిన అవసరమాతనికి లేదు.

3. అహోబలపండితుడు ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యానములో సూచించిన అథర్వణకారికలు తప్ప ఇతరములైన అథర్వణకారికలేవియు కనబడవు.

4. అథర్వణుడే యథార్థమునకు వికృతి వివేకము రచించినచో దాని కృత్యాదియు, అనుక్రమణికయు నుండెడివి. మఱియు అహోబలుడు ఆ కారికలను వరుసగా తనవ్యాఖ్యానమున ఉదాహరించుటయు సాగదు గదా.

5. అథర్వణకారికలలోని శ్లోకములను అప్పకవి ఆంధ్రీకరించెననియు, అందుచే నాతడు అథర్వణుని గ్రంథమెఱిగి యుండెననియు చినసీతారామస్వామిశాస్త్రిగారు చెప్పుచున్నారు. అప్పకవి తనగ్రంథమున అనేక లక్షణగ్రంథములనుండి యుదాహరణములను గైకొని తత్కర్తల పేర్లు చెప్పియున్నాడు. అట్టివాడు అథర్వణకారికలను తాను తెనిగించియున్నచో ఆతని పేరెత్తకుండనుండడు గదా! అథర్వణుని పేర ఛందశ్శాస్త్రము కలదని ఆతడు గ్రంథాదిని చెప్పియేయున్నాడు. అథర్వణుని ఛందస్సు నుండియు, భారతము నుండియు లక్ష్యములను గైకొని అప్పకవి వానికడ అథర్వణుని పేరుదాహరించి యున్నాడు. అథర్వణుని వికృతి వివేకము నుండి కొన్ని శ్లోకములను తెలిగించిన మాట వాస్తవమే యయినచో తన కావ్యాదిని అనేక లక్షణగ్రంథముల పేర్లు చెప్పిన యాతడు వికృతి వివేకము మాట యెత్తలేదేమి? దీనిని బట్టి అప్పకవి అథర్వణకారికావళిని ఎఱిగియుండడనుటయే పరమసత్యము.

అథర్వణకారికలు వ్రాయుటకు ముందే త్రిలింగశబ్దానుశాసనము వ్రాయబడినదని ప్రసిద్ధి. మద్రాసు ప్రాచ్య పుస్తక భాండాగారమున దోషభూయిష్ఠమైన ఒక త్రిలింగశబ్దాను శాసన ప్రతియున్నది. ఆ భాండాగారాధ్యక్షులు ఆగ్రంథమునందలి విషయములను బట్టి అది పదునైదవ శతాబ్దికి తరువాతిదై యుండునని వ్రాసిరి. తెలుగు శబ్దము త్రిలింగశబ్దభవమనునభిప్రాయము పదునాల్గవ శతాబ్ది తరువాత గాని కలుగలేదనియు, అంతకు పూర్వము ఆంధ్రము, తెలుఁగు, తెనుఁగు అను పదములే వాడుకలో నున్నవనియు చరిత్రకారులు నిర్ణయించిరి. కాబట్టి పదునాల్గవ శతాబ్దికి ముందు త్రిలింగశబ్దమున్నదనుట సాహసము. దీనినిబట్టి చూచినను త్రిలింగశబ్దానుశాసనము అథర్వణరచితము కాదని స్పష్టమగుచున్నది.

## బద్దెన (భద్రభూపాలుఁడు)

భద్రభూపాలుడు(బద్దెన) సూర్యవంశక్షత్రియుడు. జయంతి రామయ్య పంతులుగారు ప్రకటించిన శాసనలములను బట్టి యితడు క్రీ.శ.1260 ప్రాంతము వాడగును. ఈ కాలమున

గణపతిదేవుని పుత్రియగు రుద్రమాంబ కాకతీయరాజ్యమును పరిపాలించుచుండెను. కాన భద్రభూపాలుడు ఆమెకు సామంతరాజై కృష్ణాతీరమున చిన్నరాజ్యమును పాలించుచుండెనని విశ్వసింపవచ్చును.

బద్దెన కవి నీతిశాస్త్రముక్తావళిని రచించెను. దానియందు ఈ క్రింది పద్యములు గలవు. ఈ పద్యములను బట్టి బద్దెన నీతిశాస్త్ర ముక్తావళిని రచించుటకు ముందు సుమతి శతకమును రచించినట్లు తెలియుచున్నది.

కం॥ శ్రీవిభుఁడ, గర్వితారి
క్ష్మావర దళనోపలబ్ధ జయలక్ష్మీ సం॥
భావితుఁడ సుమతి శతకము
గావించిన ప్రోడఁగావ్య కమలాసనుఁడన్॥

కం॥ రాజవర మకుట మణిగణ
పూజితపదయుగుఁడ, హేమభూభృద్ధైర్య
భ్రాజితుఁడ, బద్దెనాఖ్యుఁడ
రాజోచిత నీతులొప్ప రచియింతుఁదగన్॥

ఈ పద్యములను బట్టి తానుప్రజాసామాన్యమునకుపయోగించు నీతులను దెల్పెడి సుమతి శతకము నదివరకు రచియించి యుంటిననియు, రాజులకుపయోగించు నీతులను దెల్పెడి వేఱొకగ్రంథము నిప్పుడు రచియించుచున్నాడననియు బద్దెన చెప్పినట్లు స్పష్టమగుచున్నది. ఈ రాజనీతి గ్రంథమే 'నీతిశాస్త్రముక్తావళి'.

పైనుదాహరించిన "శ్రీవిభుఁడ" నను పద్యము కొన్ని తాళపత్రప్రతులలో లేదు. అందుచే బద్దెన సుమతిశతకమును రచింపలేదని యొక వాదము కలదు. కాని అది పొరపాటు. ఆ పద్యమును బట్టి బద్దెనకు కావ్యకమలాసనుడు అనగా కావ్యబ్రహ్మ అను బిరుదమున్నదని తెలియుచున్నది. ఈ బిరుదు నీతిశాస్త్రముక్తావళి యందలి ఈ బిరుదు నీతిశాస్త్రముక్తావళి యందలి ఈ పద్యమునందు కూడ కనబడుచున్నది.

చం॥ఇ నయమునఁగాని భూమిప్రజనమ్మదు, నమ్మినఁగాని యర్థసం
చయమును, దంత్ర వృద్ధియును జాలదు, చాలినఁగాని శత్రులన్
బయిచని యోర్వరాదు, ప్రతిపక్షమడంగినఁగాని భూమి య
క్షయముగ నేలరాదనిరి కావ్యచతుర్ముఖ! బద్దెభూపతీ!॥

దీనినిబట్టి కావ్యబ్రహ్మ బిరుదాంచితుడైన బద్దెన సుమతీ శతకమును, నీతిశాస్త్రముక్తావళిని రచించెనని నిర్ణయింపనగును.

**సుమతి శతకము:-** ఆంధ్రదేశము నందలి ఆబాలగోపాలము సుమతీ శతకము నెఱుగును. దీనిని బద్దెన రచించెనాయను సందేహము కలదు. ఏలయనగా ఒకానొక సుమతిశతక తాళపత్రప్రతిలో భీమన సుమతిశతకమును రచించినట్లొకపద్యము కలదు. అదియును గాక కూచిమంచి తిమ్మకవి వంటి లాక్షణికుడు తన లక్షణగ్రంథములో సుమతి శతక పద్యమునుదాహరించి అది వేములవాడ భీమకవి కృతమని వ్రాసెను. అందుచే సుమతీ శతకకర్త భీమనయని కొందఱనుచున్నారు. దీనివలన బద్దెనయు, భీమనయు సుమతిశతక కర్తలని తేలినది. వీరిరువురును గాక సుమతియనుజైన పండితుడొకడు ఈ శతకమును రచించెనని యొక వాదము కలదు.

**నీతిశాస్త్రముక్తావళి:-**

ఈ గ్రంథనామము నీతిసారమని కొన్ని ప్రతులలో కలదు. రాజనీతియని మఱికొన్ని ప్రతులలోకలదు. కాని ఈ గ్రంథము యొక్క నిజనామము నీతిశాస్త్రముక్తావళి యయినట్లు ఈ క్రింది గ్రంథాంతపద్యమున కలదు.

ఉ॥ **శ్రీవిభుఁడైన బద్దెనృపశేఖరు చేసిన నీతిశాస్త్రము**
**క్తావళి శిష్టలోకహితమయ్యెడుఁగావుతనాఁడు నాటికిం।**
**దీవర గర్భుడున్ శశియుఁదిగ్మమరీచియు భూతధాత్రియున్**
**దేవగణంబులున్ బుధులు దిక్పతులున్ గలయంతకాలమున్॥**

నీతిశాస్త్రముక్తావళి రుద్రదేవ మహారాజు రచించిన సంస్కృత నీతిసారమునకు నాంధ్రీకరణమని కొందఱయభిప్రాయము. సంస్కృత నీతిసారమునకు ఆంధ్రనీతిసారమును రుద్రదేవమహారాజే రచియించెనని కొందఱందురు. బద్దెన రచించిన నీతిశాస్త్రముక్తావళి ప్రతాపరుద్రుని సంస్కృతనీతిసారమునకు ఆంధ్రీకరణమైనను కాకపోయినను ప్రతాపరుద్రుని ఆంధ్రనీతిసారము, బద్దెన నీతిశాస్త్రముక్తావళియు నొక్కటి కావనుట మాత్రము నిశ్చయము.

నీతిశాస్త్రముక్తావళి దాదాపు 150 పద్యములు గల చిన్నకావ్యము. వేమన పద్యము వలెనే నీతిశాస్త్రముక్తావళియందును బద్దెన తన్నుతాను సంబోధించుకొనుచు పద్యములు రచించెను. అతడు కీర్తి నారాయణా! దశదిశాభరణాంకా! నరేంద్ర చతురాననుడా! నయతత్వనిధీ! రాజరాజమనోజా! సర్వజ్ఞనిధీ! మున్నగు సంబోధనములను తనకు వాడుకొనెను. నీతిశాస్త్రముక్తావళి కవిత్వము సులభపద సంయుతమై ప్రౌఢమై నీతిబోధకముగా నున్నది. అతని కవిత్వమునకు నుదాహరణములుగా నీక్రింది పద్యములను జూపవచ్చును.

కం॥ **సతి కంటె నబల వసుమతి**
**సతి పతి లేకున్నఁజెడదు, సత్యము, ధాత్రీ।**
**పతి లేనినాఁడు సద్య**
**చ్చ్యుతి వసుమతి కంద్రు నన్నెచోడనరేంద్రా!॥**

చం॥ **కులము కుపుత్రుచేఁజెలిమి కూర్పమిచేఁదనయుందుముద్దుచేఁ**
**బలుకనృతంబుచే, నడత పానముచే, ముని సంగమంబుచే।**
**వలను బ్రతిజ్ఞచే దొర వివాదముచేఁదన యొప్పు లేమిచేఁ**
**గలిమి మదంబుచే మతి వికారముచేఁజెడు బద్దెభూపతీ!॥**

ఉ॥ **వాన సమస్తజీవుల కవశ్యము ప్రాణము, ప్రాణమైనయ**
**వ్వానయుఁబల్మరున్ గురియ వచ్చినఁదిట్టుదురెల్లవారలున్।**
**హీనమనస్కుఁడై యొరుల యిండ్లకుఁబల్మరుఁబోవు నేనియున్**
**మానిసికట్ల వచ్చు నవమానమనూనము మానభంగమున్।**

## పాల్కురికి సోమనాథుఁడు

వీరశైవాంధ్ర వాఙ్మయమునకు మల్లికార్జున పండితారాధ్యుడు బ్రహ్మవంటి వాడైనచో పాల్కురికి సోమనాథుడు విష్ణువువంటివాడు. ఇతడు వీరశైవకవి. శివకవి యనగా శివుడే పరదైవతమని నమ్మువాడు. బ్రహ్మాది దేవతాగణమంతయు శివుని పరివారమని శైవుల విశ్వాసము. శివమతస్థుడు కానివాడు భవియగును. శైవమతస్థులగు కవులు శివకవులు కాగా తదన్యమతస్థులగు కవులు భవికవులగుదురు. భక్త్యావేశము, పాండిత్యశక్తి, కవిత్వరచనా నైపుణ్యము గల మహనీయునకై వీరశైవలోకమెదురు చూచుచున్నప్పుడు పాల్కురికి సోమనాథుడుద్భవించెను. అతడు పండితులను సంతృప్తి పఱచుటకై సోమనాథభాష్య, రుద్రభాష్యాదులను సామాన్యజనుల ఆదరణకై బసవపురాణ, పండితారాధ్యచరిత్రాదులను రచించెను. అన్యరాష్ట్రములలో సయితము వీరశైవమతప్రచారము గావించుటకు కన్నడభాషలో కూడ గ్రంథరచన గావించెను. ఈవిధముగ వాఙ్మయరూపమున వీరశైవమతమునకు నిరుపమాన సేవ యొనర్చి తన్మతప్రచారము విశేషముగ చేసి అది శాశ్వతముగ నుండునట్లు గావించినవాడు పాల్కురికి సోమనాథుడు. వీరశైవులు బసవేశ్వర, పండితారాధ్యులతో పాటు సోమనను గూడ గురుపీఠముగా గ్రహించిరి. అతనిని 'భృంగి' యవతారమని భావించిరి.

వీరశైవమతస్థాపకులగు బసవేశ్వర పండితారాధ్యులు చరిత్రములను మొట్టమొదట బహురసవంతముగా ఉద్రేకకరముగ వ్రాయుటచే కర్ణాటాంధ్ర వీరశైవకవులు సోమనాథునిపై అచంచల గౌరవము చూపిరి. అదియును గాక సోమనాథుడు కర్ణాటాంధ్రభాషలందు కవియై వీరశైవమతప్రతిపాదక గ్రంథములను రచించెను. ఈతని ఆంధ్రకావ్యములు కన్నడ సంస్కృతభాషలకు అనువదింపబడినవి. సోమనాథుడు వీరశైవమతాభిమానావేశములుగల విద్వత్కవి. వీరశైవలోకమునకు ఆచార్యపురుషుడు. మహాప్రతిభావంతుడు. సోమనాథుడు లేకపోయిన వీరశైవాంధ్రవాఙ్మయమే లేదు.

ఆంధ్రవాఙ్మయమున భాష, భావము, రూపము మొదలైన ప్రతివిషయము నందు క్రొత్తబాట త్రొక్కి సోమనాథుడు తన ప్రతిభను చాటెను. వివిధ మతములను గుర్తెఱింగి, వివిధభాషలనభ్యసించిన వాడగుటచే వానియన్నిట గల గుణసౌకర్యములను తమమత ప్రచారమునకు కావ్యరచనమునకు నుపయోగించుకొనెను. వీరశైవమతము మొట్టమొదట వైదికమతము నెదుర్కొనవలసియున్నది. అందుచే వైదికమతవాఙ్మయ మందున్నట్లుగా వీరశైవమతమున కూడ శ్రుతి, స్మృతి, పురాణేతిహాసములను, కావ్యస్తుత్యాదులను నెలకొల్పవలయునని సోమనాథుడు భావించెను. దానికి తగినట్లుగా చతుర్వేదసారము, అనుభవసారము, రుద్రభాష్యము, బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, వృషాధిపశతకము, బసవరగడ, బసవోదాహరణము మున్నగు వానిని ఒక్కొక్కజాతి గ్రంథమునకు నొకదానిని ప్రతినిధిగా రచించెను. రచించి ఆగ్రంథములకు వైదికవాఙ్మయము ననుకరించి వేదసారము, భాష్యము, పురాణము, చరిత్రము, శతకము, ఉదాహరణము అనుపేర్లుపెట్టి వీరశైవవాఙ్మయమునకు ప్రతిష్ఠాగౌరవములు కూర్చెను.

వైదికమతగ్రంథములన్నియు సంస్కృత భాషయందుండుటచే ఆ మతము సామాన్యజనులకు నందుబాటులో లేదనియు, జైనబౌద్ధులు తమమత గ్రంథములను దేశభాషలలో సులభశైలితో రచించుటచే వారిమతములు సామాన్యజనులలో విశేషప్రచారమొందినవనియు గ్రహించిన సోమనాథుడు దేశికవితామార్గమవలంబించి దేశీయచ్ఛందమగు ద్విపదలో జానుతెనుగు భాషయందు సులభగ్రాహ్యములగునట్లు తనకావ్యములను రచించెను. ద్విపదలో రచింపబడుటచే

వాల్మీకిరామాయణమును కుశలవులు పాడినట్లుగా సోమనాథుని కావ్యములు సహితము రసావేశముతో పాడుకొనుటకు వీలుగా నున్నవి.

ఇక పండితులను కూడ తృప్తి పఱచుటకు, వీరశైవమతమునకు ప్రాచీనతను, ప్రామాణ్యమును కూర్చుటకు సోమనాథుడు మిక్కిలి ప్రయత్నించెను. అతడు చతుర్వేదములనుండి అనుకూలమైన ప్రమాణవాక్యములను గ్రహించి చతుర్వేదసారమును, రుద్రభాష్యమును రచించెను. అంతేకాక శ్రుతి, స్మృతి పురాణాదులనుండి ప్రమాణవాక్యములను గ్రహించి సందర్భము వచ్చినప్పుడెల్ల బసవపురాణపండితారాధ్యచరిత్రములలో కూర్చెను. వైదికమతపురాణేతిహాసములలో నీతిధర్మోపదేశములు చేయుటకు వీలుగా ఉపాఖ్యానములు పెక్కులు రచింపబడును. అట్లే సోమనాథుడును భక్తిమహిమనుపదేశించుటకై పూర్వులును, సమకాలికులునగు వీరశైవభక్తుల కథలను ఉపాఖ్యానములుగా బసవపురాణపండితారాధ్యచరిత్రములలో చిత్రించెను.

ఈవిధముగా పాల్కురికి సోమనాథుడు వీరశైవమత వాఙ్మయమునకు విశిష్టలక్షణములతో యోగ్యతాగౌరవములను కూర్చుటయే కాక వైదిక వాఙ్మయముతో సమానమైన ప్రాచీనతను, ప్రామాణ్యమును, ప్రాశస్త్యమును ఆపాదించెను. వీరశైవమత మూలపురుషులైన బసవేశ్వరపండితారాధ్యులనే నాయకులుగా చేసి, వారియందు దైవత్వమారోపించి అవతారపురుషులనొనరించి వారిచరిత్రములకు పురాణపావనత్వమును చేకూర్చెను. విశ్వామిత్రునివలె సృష్టికి ప్రతిసృష్టి చేయగల ప్రతభాశాలి సోమనాథుడు. కార్యశూరుడు. సంస్కారప్రియుడు. తిరస్కారపరుడు. సంపూర్ణస్వతంత్రుడు. కావ్యలక్షణములను, భాషాసంప్రదాయములను పూర్తిగా నెఱిగినవాడు. కాని యవి తన కవిత్వమునకు అడ్డుగా నున్నచో వానినతిక్రమింపనెంత మాత్రము జంకడు. సోమనాథుడు శాసించుటకే గాని శాసింపబడుటకిష్టపడడు. ఇతనికి వీరశైవమతమునందు పట్టుదలయు, నుద్రేకము అత్యధికము. వీనికి తోడు శాస్త్రజ్ఞానము, బహుభాషాపాండిత్యము, ఉపాసనాబలము గూడ నుండుటచే మతవిషయములలో గాని, సారస్వత విషయములలో గాని యితడు ప్రపంచమున నెవ్వరిని లెక్కచేయలేదు. ఇట్టివాడగుటచేతనే వీరశైవమతవాఙ్మయమునీతని వలననేటివరకు నామరూపములతోనైన నిలిచినవి. వైదికమతవాఙ్మయమునకు వేదవ్యాసుడెట్టివాడో వీరశైవమతవాఙ్మయమునకు పాల్కురికి సోమన అట్టివాడు.

ఇతడు సర్వతోముఖపాండిత్యము కలవాడని ఈతని కృతులే చాటుచున్నవి. ఈతనికి "తత్త్వవిద్యాకలాప కవితావిచార" అనియు "అన్యవాదకోలాహల" అనియు, "ప్రత్యక్షభృంగీశావతార" అనియు బిరుదులు కలవనియు కర్ణాటకవులు చెప్పుచున్నారు.

పాల్కురికి సోమనాథుడు మొదటిప్రతాపరుద్రుని కాలమున అనగా క్రీ.శ.1195 ప్రాంతమున జీవించియుండెనని ఒకానొకప్పుడు పండితులు నిర్ణయించిరి. కాని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, నేలటూరి వేంకటరమణయ్యగారు ఈతడు క్రీ.శ.1295 నుండి 1323 వరకు కాకతీయ సామ్రాజ్యమును పరిపాలించిన ద్వితీయ ప్రతాపరుద్రుని కాలము నుండి నట్లు తలంచిరి.

పాల్కురికి సోమనాథుడు జంగమ కులజుడు గాని బ్రాహ్మణుడు గాడనియు అందుచేతనే బసవపురాణ పండితారాధ్యచరిత్రములలో బ్రాహ్మణ నింద చేసెననియు, జంగములకు కూడ వేదాధ్యయనాధికారము కలదనియు బండారు తమ్మయ్యగారు విశ్వసించిరి. కాని సోమనాథుడు చతుర్వేదసారమునందు, పండితారాధ్యచరిత్రము నందునుదాహరించిన వేదమంత్రములు, వైదికాచారరహస్యములు బ్రాహ్మణేతరుల కగమ్యగోచరములగుటను బట్టి బ్రాహ్మణేతరులు వేదాధ్యయనార్హులు గారని సోమనాథుడు సోమనాథ భాష్యమున వ్రాసిన వాక్యములను బట్టియు,

చతుర్వేదపారగుడనని అతడు తన్ను గూర్చి చెప్పుకొనుటనుబట్టియు కన్నడకవులీతనిని ఆరాధ్యనామముతో పేర్కొనుటను బట్టియు సోమనాథుడు బ్రాహ్మణకులజుడని నిర్ధారితమగుచున్నది. అతడు ఆరాధ్యబ్రాహ్మణుడనియే పలువురు పండితశ్రేష్ఠులు తలచుచున్నారు. అదియును గాక వీరశైవమతము ప్రారంభమైనప్పుడు జంగమశబ్దము జాతివాచకముగా వ్యవహారము నందు లేదు. తరువాతికాలమున జంగములు ప్రత్యేకజాతిగా నేర్పడిరి.

సోమనాథుని యింటిపేరు పాల్కురికి. కాబట్టి యాతని నివాసస్థలము పాల్కురికి కావచ్చును. గ్రామనామములనుబట్టి గృహనామము లేర్పడుట తెలుగునాట వెలసిన యొక సంప్రదాయము. కాని ఈ పాల్కురికి గ్రామ మెక్కడనున్నదో నిర్ణయించుట యందు పండితులు పలుపోకడలు పోయిరి. తెలంగాణమునందు నల్గొండ జిల్లా యందలి జనగామ తాలూకాలో నున్న పాలకుర్తియను గ్రామమే సోమనాథుని జన్మస్థానమనియు, ఆ కవి వంశీయులిప్పటికిని ఆగ్రామమున నివసించుచున్నారనియు, ఆ గ్రామమందలి శివలింగమునకు గల సోమేశ్వరుడను పేరే ఈతని తల్లిదండ్రులీతనికి పెట్టిరనియు పండితులు పెక్కురు విశ్వసించిరి. కాని చిలుకూరినారాయణరావుగారు మైసూరు రాష్ట్రములో తుముకూరు తాలూకాలో హాల్కురికి అను గ్రామము కలదనియు, కన్నడభాష యందలి హకారము ఆంధ్రమున పకారముగా మారును గావున హాల్కురికియే పాల్కురికి యనియు, ఇదియే సోమనాథుని నివాసస్థలమనియు వ్రాసిరి. మఱియు పాల్కురికి సోమన బసవపురాణపండితారాధ్యచరిత్రములను కర్ణాటాంధ్రరాష్ట్రముల పొలిమేరలో నున్న శ్రీశైల ప్రాంతము నందుండి సోమనాథుడు రచించినట్లుగా తెలియుచున్నదని వారు నిరూపించిరి. మఱియు సోమనాథుడు వార్ధకమున లింగైక్యమొందిన కలికెయను గ్రామము కూడ శ్రీశైల ప్రాంతమునందే యుండుట ఈ వాదమునకు బలము చేకూర్చుచున్నదనియు వారి తలంపు. కాని పండితులు తెలంగాణము నందలి పాలకుర్తియే పూర్వకాలమున పాలకురికిగా నున్నదని నిశ్చయించి అదియే సోమన జన్మస్థానమని నమ్ముచున్నారు.

సోమనాథుడు బసవపురాణమందు తనతండ్రి విష్ణురామిదేవుడనియు, తల్లి శ్రియాదేవి యనియు పేర్కొనెను. కాని పండితారాధ్యచరిత్రము రచించు నాటికి అతని వీరశైవము ముదిరినది. కావుననే భక్తి తన్మయత్వముతో

"పెనుపారు భక్తుల పెంపుడు కొడుక
బసవని పుత్రుండ బసవగోత్రుండ"

అని వ్రాసికొనెను. వీరశైవమతదీక్షితుడైన పిదప సోమనాథుడు కులగోత్రమాతాపితల నామములను స్పష్టముగా చెప్పికొనలేకపోయెను.

అనుభవసారమును బట్టి బసవపురాణమును బట్టి యితని కవితా గురువు కరస్థలి విశ్వనాథుడని తెలియుచున్నది. ఈతనికి శివదీక్షనొసగిన మతగురువు గురులింగార్యుడు. మఱియొక గురువు కట్టకూరి పోతిదేవర.

సోమనాథుడు 1. అనుభవసారము 2. చతుర్వేదసారము 3. చెన్నమల్లు సీసములు 4. వృషాధిపశతకము 5. ఆంధ్రబసవోదాహరణము 6. బసవపురాణము 7. పండితారాధ్యచరిత్రము 8. బసవరగడ అను తెలుగు కృతులను రచించెను. సంస్కృతము నందు సోమనాథ భాష్యము, రుద్రభాష్యము, నమస్కారగద్య, అక్షరాంకగద్య, పంచప్రకార గద్య, బసవోదాహరణము అను కావ్యములను రచించెను. వీనిలో రుద్రభాష్యమింతవరకు కానరాలేదు. సోమనాథుడు కన్నడభాషయందును కావ్యములు రచించెను.

సోమనాథుడు ఉత్తమ కవిత్వాశయములు కలవు. అతని కవితా వ్యవసాయము రెండు రకములుగా సాగినది. సోమనాథుడు మొదట నన్నయవలె మార్గకవితా పద్ధతి నవలంబించి వృత్తములతో కావ్యరచన కావించెను. కాని కాలక్రమమున అతని హృదయము మారినది. ద్విపద ఉత్తమ ఛందస్సనియు, మతప్రచారమునకు చక్కగా నుపయోగించుననియు సోమనాథుడు నిశ్చయించుకొనెను. మఱియు జాను తెనుగు కవితాభాషగా నుండదగునని సిద్ధాంతము చేసెను. నన్నెచోడుడు కూడ జానుతెనుగు మీది యభిమానమును ప్రకటించినను అతడు మార్గకవితా పద్ధతిని పూర్తిగా విడనాడలేకపోయెను. సోమన అట్టివాడు కాదు. అతడేమనెనో చూడుడు.

"ఉరుతరగద్య పద్యోక్తుల కంటె
సరసమైఁబరగిన జాను తెలుంగు
చర్చింపగా సర్వసామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు కోర్కి దైవార
తెలుఁగు మాటలనంగ వలదు, వేదముల
కొలదియగాఁజూడుడిలనెట్టులనిన"

బసవ పురాణములో నిట్లు చెప్పిన సోమనాథుడు పండితారాధ్యచరిత్రమున

"ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన।
మానుగా సర్వసామాన్యంబు గామి
జానుతెనుఁగు విశేషము ప్రసన్నతకు" అనియు॥

"తేటతెనుంగున ద్విపద రచింతు" అనియు చెప్పెను. పామరులకు తెలియుటకై యితడిట్టి శైలినవలంబింపవలసి వచ్చెను. నన్నెచోడునికే మతప్రచార ప్రయోజనము పట్టలేదు. అతనిది కావ్యకళాదృష్టి.

సంస్కృత భాషయందలి అనుష్టుప్పు చదువుటకు, అన్వయము చేసికొనుటకు బహుసులభముగా నుండును. వాల్మీకి రామాయణమా ఛందముననే కలదు. దానిని కుశలవులు శ్రీరాముని యెదుట గానము చేయుటకు అనువుపడినది. అనుష్టుప్పువలె తెలుంగులో పాడుటకనువైన లఘుచ్ఛందము ద్విపద. ఈ ద్విపద సర్వసామాన్యమైనదే కాని క్రొత్తది కాదు. జానపదవాఙ్మయము ద్విపదయందో, ద్విపద వికారమనదగిన ఛందము నందో యుండును. సోమనాథునకు పూర్వము పండితుడెవ్వడు ద్విపదలో కావ్యములను వ్రాయలేదు. నన్నయాదుల భారతరచన వృత్తములతో గూడి సంస్కృత భూయిష్ఠముగా నున్నది. ఆ మార్గకవిత దేశికవితయగు జానపదవాఙ్మయమును కప్పిపుచ్చినది. సంస్కార శూన్యమై, పండితాదరదూరమై, జీర్ణమైయున్న ద్విపదను సర్వజనాదరపాత్రము చేసి దానికి సారస్వత గౌరవము కూర్చి అందు కావ్యరచనమును గావించిన ప్రప్రథముడు పాల్కురికి సోమనాథుడు. అంతేగాక అతడు ద్విపదకు పావనత్వము నారోపించి పండితారాధ్యచరిత్రమున "ఐహికాముష్మికద్విపద హేతువగుట ద్విపదగాగఁబరగు" అని అతిశయోక్తిని కూర్చెను.

సోమనాథుని పాండిత్యమపారము. సర్వతో ముఖము. అతడు సర్వజ్ఞుడుగా గోచరించును. ఈతనికి చతుర్వేదములు, షట్ఛాస్త్రములు, అష్టాదశపురాణములు, చతుష్షష్టికళలు, కావ్యనాటకాలంకార శాస్త్రములు, వివిధ వేదాంతశాఖలు, వివిధ మత సిద్ధాంత సంప్రదాయములు, బహుభాషలు, అనేక దేశసాంఘికాచారములు, నానావిధజనుల ఆహారవిహార వేషవైఖరులు

కరతలామలకములు. సోమనాథుడీ పాండిత్యమంతయు వీరశైవమతమునకు ప్రామాణ్యము చేకూర్చుటకు, పరమతములను ఖండించుటకు, ఆయా గ్రంథముల నుండి ప్రమాణ వాక్యములనుదాహరించుటకు నిష్టము వచ్చినట్లుపయోగించుకొనెను. వీరశైవమతము మీద, పరమేశ్వరుని మీద నితనకి గల భక్తికి మితిలేదు. ఆ మతమునకు, ఆదేవునకు తన ధన మానప్రాణములను సర్వమును త్యాగము చేసిన ఆవేశపరుడు. అసలు వీరశైవమతమే ఉద్రేకభూయిష్ఠమైనది.

సోమనాథుడు బసవపురాణమున

"అల్పాక్షరముల ననల్పార్థ రచన
కల్పించుటయ కాదె కవి వివేకంబు" అని చెప్పినను అతడా ధర్మమును తన కావ్యములకు సమన్వయించుకొనజాలక పోయెను. ఈ ధర్మము ప్రకారమే యాతడు కావ్యరచన సాగించి యున్నచో అది వ్యంగప్రధానమై పండితైక మాత్రానుభవయోగ్యమై యుండెడిది. సామాన్యజనులకు దూరమయ్యెడిది. కావున తన లక్ష్యమునకు భంజకమైన ఆ ఉత్తమ కావ్య ధర్మమును త్యజించి సోమనాథుడు తన కావ్యములను కేవలము వాచ్యప్రధానములుగనే రచించెను. అందుచే ఇతడు దేనిని వర్ణించినను సవిస్తరముగ, సంపూర్ణముగా నుండును. కన్నులకు కట్టినట్లుండును. వర్ణించు విషయమునందలి సమస్తాంగములను ఇతడు వర్ణించును. ఇట్టి రచన పాఠకుల కావేశము కల్గించును. ఆవేశమే సోమనాథుని కవిత్వమునకు జీవగఱ్ఱ. ఈతని కవితాధార పరువులెత్తునేగాని మందగమనము చేయదు. సోమనాథుని వర్ణనములు ప్రబంధములయందలి అష్టాదశవర్ణనముల వలె కథాగమనమునకు ప్రతిబంధకములైనవి. అయినను ఇతడు లక్ష్యపెట్టలేదు. ఈవిధముగా నతడు తన ముఖ్య ప్రయోజనమైన మతప్రచారమునకు అడ్డువచ్చునని తలంచి కావ్యాత్మయగు ధ్వనిని తిరస్కరించెను.

1. అనుభవసారము:- లభించిన కృతులలో అనుభవసారమే సోమనాథుని ప్రథమకృతిగా కనబడుచున్నది. దీనిలో కథారూపమైన ఇతివృత్తమేదియు లేదు. ఈగ్రంథరచనము నాటికి సోమనాథునకు బసవేశ్వరుని గూర్చి తెలియుట గాని ఆతని యందు భక్తి కుదురుట కాని సంభవించినట్లు కానరాదు. అందుచేతనే శివతత్వసారకృతికర్తయగు మల్లికార్జున పండితారాధ్యుని మూడు పద్యములలో స్తుతించిన సోమనాథుడు బసవేశ్వరుని పేరైన నెత్తలేదు. అనుభవసారములో గురుభక్తి మహిమ, భక్తి స్వరూపము, భక్త లక్షణము, శివపూజా విధానము, జంగమసేవ మొదలగు శైవధర్మములు తెలుపబడినవి. ఈ గ్రంథమున సోమనాథుడు నన్నయ రచనా పద్ధతినే అవలంబించెనని చెప్పవచ్చును. అప్పటి కింకనాతనికి దేశికవితపై వలపు పుట్టలేదు. వనమయూరము, మాలిని, క్రౌంచపదము మొదలగు విశేషవృత్తము లిందు కలవు. సోమనాథుడు పద్యరచనా విధానమున కావించిన సంస్కారములిందు కానబడును. అతని పద్యరచన నన్నయాదుల పద్యరచనము కంటె భిన్నముగ నున్నది.

కం॥ కొలుచుటయె భక్తి, భక్తికిఁ
దలకమియె వ్రతంబు, వ్రతము దవులుటయెని॥
శ్చలకృప, శివు నిశ్చలకృప
కలుగుట యది ముక్తి పథము కరుణాభరణా!॥

కం॥ గురు సన్నిధి గర్వించుట
గురు సన్నిధిఁదన్నుఁతాను కొనియాడుటయుం॥
గురు సన్నిధి శంకింపమి
గురు పాతకమండ్రు బుధులు గురుభక్తినిధీ!॥

అనుభవసారము నందు ద్విప్రాస, త్రిప్రాస, కందములను కూడ రచియించి సోమనాథుడు చిత్రకవిత్వమార్గమును చూపెను.

కం॥ కన్నిదునే పరసతులకు
తన్నిదునే భక్తుదన్యదైవంబులకున్
వెన్నిదునే భవములకున్
మున్నిదునే మనము విషయములకు మహాత్మా!॥

ఈ ప్రథమకావ్యమున వృత్తములు, సీసములు, కందములు కలవు.

2. చతుర్వేదసారము:-

చతుర్వేదసారములో 300 సీసపద్యములు గలవు. శ్రుతి, స్మృతి పురాణముల నుండి గ్రహింపబడిన యుక్తులతో శివమహిమమిందు ప్రతిపాదింపబడినది. ఇందు విభూతి, రుద్రాక్ష, లింగధారణ మాహాత్మ్యములును, అశుచికారణములు, శీలలక్షణము మున్నగు విషయములు కలవు. ప్రతిసీసపద్యము బసవలింగ యను సంబోధనముతో ముగియును. చతుర్వేదసారమునందలి యాక్రింది పద్యము నన్నయరచించిన "ధర్మతత్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" అను పద్యమును బోలుచున్నది.

సీ॥ వైదికులిది శుద్ధ వైదికంబని యెన్న
శాస్త్రజ్ఞులిది ధర్మశాస్త్రమనగ
తార్కికులిది మహాతర్కంబనంగఁబౌ
రాణికులిదియె పురాణమనగ॥
నాగమ విదులు దివ్యాగమంబిది యన
తంత్రజ్ఞులిది వీరతంత్రమనగ
భక్తివారంబిది భక్తి మార్గంబన
ముక్త్యర్థులిది మహాముక్తిదమన॥

ఆ॥వె॥ కవులు భువిని యిదియె కావ్యంబనంగ, స
జ్జనులకెల్ల మిగుల సంతసముగ॥
నిర్వికల్పరతిఁజతుర్వేదసారమన్
పద్యముల్ రచింతు బసవలింగ!॥

3. వృషాధిపశతకము:-

వృషాధిప శతకము సోమనాథుని బసవేశ్వర భక్తిపారవశ్యమును తెల్పుచున్నది. "బసవా!బసవా!బసవా!వృషాధిపా!" అను మకుటము గల 108 ఉత్పల, చంపకమాలలిందు గలవు. దీనిలో శివస్తోత్రములు చేయబడెను. బసవేశ్వరుని లీలలు, గురుభక్తుల చరిత్రములు వర్ణింపబడెను. వీరశైవమతము, వీరశైవకవిత్వము అవేశపూరితములైనవని తెలుపుటకు ఈ శతకమొక్కటియె చాలును.

సోమనాథుడిందు యమకాది శబ్దాలంకారములను విశేషముగా నుపయోగించెను. దీర్ఘసమాసఘటితములైన పద్యములిందు గలవు. ఆతని బహుభాషాపాండిత్యమును సూచించు పద్యములును గలవు. తమిళ, కర్ణాట, మహారాష్ట్ర శుద్ధాంధ్రభాషల యందు ప్రత్యేకముగ కొన్ని పద్యములను, వివిధ భాషాపదమిశ్రితములగు మణిప్రవాళపద్యములను రచియించి సోమనాథుడు తన అఖండభక్తి పారవశ్యమును ఈ శతకమున వెల్లడించెను. జీవేశ్వరులను నాయికానాయకులుగా వర్ణించుట

విశిష్టాద్వైతమతస్థుల సంప్రదాయము. భగవంతుడు నాయకుడు, భక్తుడు నాయిక యన్నదే యా సంప్రదాయము. సోమనాథునకు బసవేశ్వరుడే నాయకుడు తానే నాయిక. అట్లు కానిచో ఈ క్రింది పద్యము వ్రాయునా!

ఉ॥ నాయొడయండ, నావిభుండ, నాహృదయేశ్వర, నామనోరమా
నాయిలవేల్ప, నావరద, నాగురులింగమ, నాదుజంగమ౹
నాయధినాథ, నావరుండ, నన్నుగృపామతిం బ్రోవుమయ్యదే
వా!యమి బృందవంద్య బసవా!బసవా!బసవా!వృషాధిపా!॥

ఆంధ్రభాషయందు విస్తారముగా వెలువడిన భక్తి రసపూరితమైన శతక వాఙ్మయమునకు వృషాధిపశతకమే మార్గదర్శకమని చెప్పవచ్చును.

**4. చెన్నమల్లు సీసములు:-**

ఇందు చెన్నమల్లు అను మకుటము గల 32 సీసపద్యములు గలవు. సోమనాథుడు జీవసమాధి పొందదలచి భూబిలమునకు ఏర్పరచిన 32 మెట్లను దిగుచు ఒక్కొక్క మెట్టునకు ఒక్కొక్క పద్యము చొప్పున మొత్తము 32 సీసపద్యములను రచించెనని వీరశైవులు చెప్పుదురు. ఈ చెన్నమల్లు అను మకుటము శ్రీశైలమల్లికార్జునుని సంబోధనమై యుండునని బండారు తమ్మయ్యగారి యభిప్రాయము. ఈ సీసపద్యములలో భక్త, మాహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యములను ఆఱు స్థలములు వర్ణింపబడినవి.

**5. బసవోదాహరణము:-**

సంస్కృతాంధ్రభాషలలో సోమనాథుడు బసవోదాహరణమును రచించెను. ఎనిమిది విభక్తులలో ఎనిమిది పద్యములను, కళికలను, ఉత్కళికలను రచించి చివర సర్వవిభక్తులు నుండునట్లు ఒక పద్యము రచించినచో అది ఉదాహరణమగును. ఈ ఉదాహరణకావ్యములు పరమేశ్వరస్తోత్రరూప కావ్యములకు శ్రీకారము చుట్టినవాడు సోమనాథుడే.

**6. బసవ రగడ:-**

రగడల రచనము కర్ణాటభాషలో జరిగినట్లు ఆంధ్రసాహిత్యమున జరుగలేదు. కవిత్రయ కావ్యములలో రగడలు లేవు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని కాలము నుండియే ఆంధ్ర కవులు తను కావ్యములలో రగడలు చేర్చుచు వచ్చిరి. ప్రబంధములలో సామాన్యముగా పుష్పాపచయ వర్ణనమునకు రగడలుపయోగింపబడెను. మనకు లభించిన రగడలలో సోమనాథుని బసవరగడయే మొట్టమొదటిది. దీనిలో 108 పాదములు గలవు. సోమనాథుని రగడ సలక్షణమైనది. దీనికి "శరణు బసవ" అనునది మకుటము.

ఆంధ్ర వాఙ్మయము విశేషముగా సంస్కృత వాఙ్మయముపై నాధారపడి యున్నది. ప్రారంభముననే నన్నయ భారతమును సంస్కృతము నుండి యాంధ్రీకరించెను. ఆయన తరువాతి కవులందరు ఆ మార్గమునే యవలంబించి భావము, భాష, రూపము అను మూడింటియందును సంస్కృత సాహిత్యమునకే దాస్యము చేసిరి. పురాణములనో, తదంతర్భాగములనో తెలిగించుటకు పూనుకొనిరి. మూలకథనే కాక మూలమందలి వర్ణనములు, భావములు, సంస్కృత వృత్తములతో తెలుగునకు తెచ్చిరి. అందుచే ఆంధ్ర వాఙ్మయమునకు స్వతంత్ర వ్యక్తిత్వము లేకపోయినది. ఆంధ్ర కవులలో స్వాతంత్ర్యమును చూపినవారు ఎక్కువమంది లేరు. కేవలము అనువాదమును మాని పురాణముల

యందలి చిన్న కథను స్వీకరించి అష్టాదశ వర్ణనములను జోడించి సందర్భోచితముగా రసపాత్ర పోషణము చేసి తెలుగు కవులు ప్రబంధమును వ్రాసిరి. కాని ప్రబంధ కవిత్వము సైతము సంస్కృత మార్గమునే పట్టినది. ప్రబంధమునందలి కథ, వర్ణనములు, శైలి, ఛందస్సు సంస్కృతానుకరణములే. కాని ఆంధ్ర సాహిత్య ప్రపంచమున సంపూర్ణ స్వాతంత్ర్యమును చూపి ఆంధ్రతాముద్రను వేసి ఆంధ్ర జాతీయచ్ఛందస్సులో దేశికవితా పద్ధతితో కావ్యరచనము గావించి సమకాలికుల నెదిరించి వారి సంప్రదాయములకు నెదురీది సర్వవిధముల ఆంధ్ర జాతీయ కావ్యములను రచించినవాడు పాల్కురికి సోమనాథుడే. ఆ యాంధ్ర జాతీయ కావ్యములే బసవ పురాణ, పండితారాధ్య చరిత్రములు. వీనియందలి కథ ఏ సంస్కృత పురాణేతిహాసములలోనిదో కాదు. బసవేశ్వరుడు, పండితారాధ్యుడు దేశీయ చరిత్ర యందలి వ్యక్తులు. ఈశ్వర భక్తులు, సోమనాథుడు వారిని కథానాయకులనుగా చేసి మహానాయక లక్షణోపేతులను గావించెను. వారిరువురు ప్రమథుల యవతారములు. శివునితో సమానమైన శక్తిగలవారట.

**7. బసవ పురాణము:-**

సోమనాథుడు రచించిన బసవ పురాణము అపూర్వ ద్విపద కావ్యము. వీర శైవమత స్థాపకుడగు బసవేశ్వరుని మహామహిమాన్విత వ్యక్తిగా సోమనాథుడిందు చిత్రించెను. బసవేశ్వరుని చరిత్రమును పూసలలోని దారమువలె పూర్వులు సమకాలికులునగు పలువురు భక్తుల చరిత్రములతో కలియునట్లు సోమనాథుడు రచించెను. బసవేశ్వరుడు నందీశ్వరుని యవతారము. నందీశ్వరుడు బసవేశ్వరుడై మండంగి మాదిరాజు, మాదమాంబ అను శివభక్తిపరులకు జన్మించెను. తండ్రి ఉపనయనమొనర్ప ప్రయత్నింపగా బసవేశ్వరుడు తండ్రితో వాదించి ఉపనయనము నిరాకరించెను. తల్లిదండ్రుల విడనాడి వీరశైవులలో కలిసెను. పిదప మేనమామ బలదేవదండనాయకుని కుమార్తెయగు గంగాంబికను పరిణయమాడెను. కల్యాణ పట్టణము రాజధానిగా పశ్చిమ చాళుక్య రాజ్యమును పరిపాలించు చున్న బిజ్జలుని కడ మంత్రిత్వమంగీకరించి బసవేశ్వరుడు రాజ్య విస్తారమునకు, వీర శైవమతప్రచారమునకు పరిశ్రమించుచుండెను. అతడు శివభక్తులను దగ్గరకు చేర్చుచు వారి నాదరించుచు ప్రజాధనము వెచ్చించుచుండెను. భక్తి పరవశులై వర్ణ భేదముల రూపుమాపదలచి హీనకులజులగు మడివాలు మాచయ్య మున్నగు శివభక్తులతో కొలువునకు వచ్చుచుండెను. భక్తులలో జాతిభేదమును పాటింపరాదనియు, హీనకులజుడైనను భక్తి సంపన్నుడైనచో భక్తిరహితుడగు బ్రాహ్మణుని కన్న సర్వవిధముల శ్రేష్ఠుడనియు బసవేశ్వరుడు బ్రాహ్మణులను ధిక్కరించుచుండెను. అతని ధాటికాగలేని యితరులు బిజ్జలునితో బసవేశ్వరునిపై కొండెములు చెప్పుచుండిరి. బసవేశ్వరుని మిత్రులైన కొందరు శివభక్తులు శైవులు కాని వారిపై నత్యాచారములు సలుపుచుండిరి. బిజ్జలునకు, బసవేశ్వరునకు రవరవలు పెరిగెను. బసవేశ్వరుని అనుచరులు బిజ్జలుని చంపిరి. చివరకు బసవేశ్వరుడు కల్యాణ పట్టణమును శపించి సంగమేశ్వరునందైక్యమై అవతారము చాలించెను. కల్యాణ పట్టణమందు వీరశైవులకును, జైనులకును ఘోరయుద్ధము జరిగి ఆ పట్టణము నశించెను. బిజ్జలుని తనయులు రాజ్యకాంక్షతో అన్యోన్యము పోరాడి అనతికాలముననే నశించిరి. ఇది బసవ పురాణము నందలి కథ. ఈ కథను సోమనాథుడు భక్త్యావేశముతో రచించెను. బసవేశ్వరుడు శివునితో సమానమైన శక్తి కలవాడని సోమనాథుని తలంపు. అతడిట్లు బసవేశ్వరుని గూర్చి వ్రాసెను.

"బసవుండు కేవల భక్తుడే తలప
నసమాక్షుడా రూపమై నిల్చెగాక
బసవుఁడు వసుధపై ప్రభవించునంత

బసవని నరుఁడని పలుకంగఁదగునె
హరుఁడు నిరాకారుఁడైనచో బసవఁ
డరయంగ సాకారుఁడై చరియించు"

వీర శైవమతము భక్తి ప్రధానమైనది. కావున బసవ పురాణమునందలి పాత్రములందరు భక్తులే. కాని యీ భక్తులందరు అచ్చులో పోతబోసినట్లొకే మాదిరిగా నుండక విభిన్న వ్యక్తిత్వములతో అలరారుచున్నారు. సోమనాథుడు మహా భక్తుడు. అతడు భక్తుల హృదయములను యథావిధిగా వ్యాఖ్యానము చేసెను. ముగ్ధభక్తిని వర్ణించుటలో అతడు ప్రజ్ఞావంతుడు. బసవపురాణమున తృతీయాశ్వాసమందలి రుద్రపశుపతి, బెజ్జమహాదేవి, గొడగూచి, సంగయ్య, కన్నప్ప మున్నగు ముగ్ధ భక్తుల చరిత్రములను సోమనాథుడు రమణీయముగా వర్ణించెను. బెజ్జమహాదేవి శివునకు తల్లిదండ్రులు లేరను వార్త విని తానే తల్లియై యతనికి పరిచర్యలు చేయును. గొడగూచియను బాలిక తల్లిదండ్రులు నిత్యమును తమ యూరి లింగమూర్తికి కుంచెడు పాలు ఆరగింపబెట్టు వ్రతమును నెఱపుచుండిరి. ఒకనాడు వారు పొరుగూరి కేగుచు తమ వ్రతమును పాటించు విధిని కొమార్తయగు గొడగూచికి నప్పగింతురు. అమె యా పాలను దేవాలయమునకు గొనిపోయి లింగమూర్తి యెదుట పెట్టును. వానిని స్వామి స్వయముగా త్రాగునని తన అమాయకత్వముచే తలపోసి ఆతడట్లు చేయకుండుట గాంచి ఆమె వాపోయిన విధమును సోమనాథుడు హృదయమును ద్రవించునట్లు వర్ణించెను.

పాలేల ఆరగింపవు లింగమూర్తి
కాచుట చాలదో కమ్మవల్వమినో
పాచియె విఱిగెనో పదుచనేననియొ
ప్రొద్దెక్కెనో యొండె పొగయు వల్చెడినో
బుద్ధి పుట్టదో నెయ్యి పోయకుండితినొ
కడువేడియో నీరు కలిసినవనియొ
యెడ వాద్యములు లేక యేనె తెచ్చినవొ
చాలవో యివి అలపాలుగావనియొ
పాలపై చిత్తమేఁబడితినవనియొ.

అనుచు గొడగూచి అమాయికముగా బాధపడును.

సహజములైన ప్రకృతి వర్ణనములు సోమనాథునకు మంచినీళ్ళప్రాయము. ఈ సందర్భముననతడు స్వభావోక్తినే సంభావించును. అదియతని లోకజ్ఞానమును వెల్లడించును. ఆంధ్రవాఙ్మయమున కవులు కోడికూతను వర్ణించుపట్టున ఉత్ప్రేక్షాద్యలంకారముతో సాము చేసిరి. సోమనాథుడు వర్ణించిన కోడికూతయెంత సహజ రమ్యముగా నున్నదో చూదుడు.

"తొలికోడి కనువిచ్చి, నిలిచి, మై పెంచి
జలజల క్కలు సడలించి, నీల్గి
గ్రక్కున కాలార్చి, కంఠంబు విచ్చి
ముక్కున నీకలు చక్కొల్పి, కడుపు
వెక్కించి, మెడసాచి, నిక్కి, మిన్సూచి
కొక్కురో కుఱ్ఱని కూయక మున్న."

**పండితారాధ్య చరిత్రము:-**

సోమనాథుని కృతులలో పండితారాధ్య చరిత్రమే చిట్టచివరిదిగా కన్పించును. అతడు దీనిని చరమ వయస్సులో రచించియుండును. ఈ కావ్యములో ఆంధ్రదేశమున వీర శైవమత వ్యాప్తికై పాటుబడిన మల్లికార్జున పండితారాధ్యుని చరిత్రము వర్ణింపబడినది. దీక్షా, పురాతన, వాద, మహిమ, పర్వత ప్రకరణములను పంచప్రకరణములలో పండితారాధ్యుని దివ్య జీవితము చిత్రింపబడినది. బసవ పురాణమువలె ఈ కావ్యము కూడ జాతీయచ్ఛందమగు ద్విపదలో కూర్పబడినది. సోమనాథుడు పాండిత్యము పండువారిన నిండుప్రాయమున దీనిని రచించుటచే ఇందలి రచనము అనేక విధముల బసవపురాణ రచనము కంటె ప్రౌఢతరముగా నుండును.

పండితారాధ్య చరిత్రమున సోమనాథుడు ద్విపద రచనముపై పండితులకున్న నిరసనమును పరిహరించుటకై ఎంతో ప్రయత్నించెను. ద్విపదను సమర్థించుచు నతడు సుదీర్ఘముగా రచన గావించెను. అంతేగాక ఉత్తమ కావ్యలక్షణము లేవియో నాతడు ప్రతిపాదించెను. సంస్కృతాలంకారికులు పది కావ్యగుణములను పేర్కొనగా సోమన నలువది తొమ్మిదింటిని పేర్కొనెను. అట్లే ఆలంకారికులు పది కావ్యదోషములను పేర్కొనగా ఇతడు ఇరువదియైదింటిని చెప్పెను. పండితారాధ్య చరిత్రములో

**"సత్కృతి యన నూత్నసంగతి తనర**
**తొమ్మిది రసములు తొలుకాడ, దాని**
**యిమ్మడి వర్ణనలెసగ, తద్ద్విగుణ**
**మగు నలంకారంబులెసలార వాని**
**ద్విగుణార్థ భావముల్ దీటుకొనంగ**
**తేటతెనుంగున ద్విపద రచింతు."**

అని సోమన ప్రతిజ్ఞ బూనెను. నవరసములు, అష్టాదశ వర్ణనములు, ముప్పది యాఱలంకారములు, డెబ్బది రెండు భావములు నిండియుండునట్లు నిశ్చయించి, దోషములను తొలగించి, గుణములను గ్రహించి కవి కావ్యము రచియింపవలెనని సోమనాథుని యభిప్రాయము కాబోలు.

పండితారాధ్య చరిత్రమున వెల్లడియగు సోమనాథుని కవితా లక్షణములను గూర్చి యిట్లు చెప్పవచ్చును. సోమనాథుడు శ్రుతి, స్మృతి ప్రమాణములను లెక్కకు మిక్కిలిగా కుప్పించుట యందు, అతిగహనములగు నుపనిషద్రహస్యములను తేటతెల్లముగా చొప్పించుటయందు పరమత సిద్ధాంతములను ప్రదర్శించి ఖండించుటయందు ద్విపదను బహురూపములుగా మలిచెను. వైద్యము, సంగీతము, రసవాదము, చౌర్యము, ద్యూతము మున్నగు ప్రత్యేక శాస్త్ర విషయములుగాని, సందర్భములు గాని వచ్చినప్పుడు వానికి సంబంధించిన పారిభాషికపదములను సంపూర్ణముగా ప్రదర్శించిన గాని ఆతనికి తృప్తి లేదు. ప్రతిపాదింపనెంచిన విషయము పాఠకుల మనస్సులయందు లెస్సగా హత్తుకొని దాని మూలమున వారికి రసానందము కలుగుటకై సమానార్థకములగు పర్యాయపదములను మార్చి, మార్చి అతడు పుంఖానుపుంఖములుగా ప్రయోగించెను. సోమనాథుడు నవరసములను వీరశైవభక్తికి అంగములుగా వర్ణించి పోషించెను. గాని వానిని ప్రత్యేక భావములతో ఇతరాంధ్రకావ్యములందు వలె పోషింపలేదు. ప్రబంధములలో వర్ణింపబడు శృంగారమువలె విప్రలంభ సంభోగాదులు కాకపోయినను

అతడు పండితారాధ్య చరిత్రమున గురుభక్తాండారి కథలో మిండభక్తుల శృంగారమును హృదయంగమముగ వర్ణించి రతిశాస్త్ర రహస్యములను గూడ వివరించెను. ఇతర కవులు సామాన్యముగ నొక యలంకారమున కొక విషయమునే గ్రహింతురు. కాని సోమనాథుడు ఒక యలంకారమున కనేక విషయములను గ్రహించి అనేక నిదర్శనములతో అలంకారమాలికను కుప్పలు కుప్పలుగా గూర్చి రచించును. ఇట్టి రచన సామాన్య జనుల హృదయమున భావములు హత్తుకొనునట్లు చేసి ఆకర్షించి వారిని ఉద్రేకపూరితులను చేయును. పండితారాధ్య చరిత్రమునందు పెక్కు చోట్ల ప్రబంధకవితా పద్ధతి కలదు. శైలియు శబ్దార్థాలంకార భూయిష్ఠమై యుండును. మొత్తము మీద కావ్యప్రారంభమున ప్రతిపాదించిన కవితాదర్శనములకు లక్ష్యముగా సోమనాథుడు పండితారాధ్య చరిత్రమును రచించెను.

## మారన

మారన మార్కండేయ పురాణమును తెలిగించెను. మార్కండేయ పురాణములో భారతమునందు సంపూర్ణముగా చెప్పబడక సంశయాస్పదముగానున్న కథలు సంపూర్ణముగా చిత్రింపబడినవి. మారన ఆశ్వాసాంత గద్యలయందు "శ్రీమదుభయ కవిమిత్ర తిక్కన సోమయాజి ప్రసాదలబ్ధ సరస్వతీపాత్ర తిక్కనామాత్య పుత్ర" అన చెప్పుకొనెను. దీనిని బట్టి యితడు కవిబ్రహ్మయగు తిక్కన సోమయాజి శిష్యుడనియు, తిక్కనామాత్యుని పుత్రుడనియు తెలియుచున్నది. తిక్కనామాత్యపుత్రయని గద్యము నందుండుటచే మారన మహాభారతకర్తయగు తిక్కన సోమయాజి కుమారుడని కొందఱనుకొనజొచ్చిరి. కాని అది సత్యము కాదు. గురువును, తండ్రిని వేఱువేఱుగా చెప్పియుండుటచే వారిరువురును ఒక్కరు గారనుట స్పష్టము. వారిరువురును ఏకనామము గలవారగుటచే నీభ్రాంతి కలిగినది.

మార్కండేయ పురాణము గన్నయ మంత్రికి అంకితము చేయబడినది. ఈ నాగయ గన్నమంత్రి క్రీ.శ. 1295 మొదలు 1326 వరకు కాకతీయ సామ్రాజ్యము నేలిన ద్వితీయ ప్రతాపరుద్రుని ఆస్థానమునందలివాడు. మారన చేసిన వర్ణనములను బట్టి ఈ గన్నయ మంత్రి సేనాధిపతియయినట్లును, ఏకశిలానగరాధిపతి అయినట్లును కనబడుచున్నది. అతడు ఇప్పటి పురపాలక సంఘాధ్యక్షుని వలె నగరాధ్యక్షుడై కీర్తిగాంచెను. మార్కండేయ పురాణములో గన్నయను "కాకతి క్షితీశ్వర పురపాలన ప్రకటశౌర్య విశేషణ" అని కవి సంబోధించెను. ఈ గన్నయ మంత్రి ద్వితీయ ప్రతాపరుద్రుని మరణానంతరము మహమ్మదీయ మతమును స్వీకరించి ఢిల్లీ చక్రవర్తిని కొలిచి యాతనికి రాజ్యకార్య నిర్వాహకుడయ్యెను.

మారన కవిత్వము సరళముగా, శ్రావ్యముగా దేశిపదభూయిష్ఠమై యుండును. వర్ణనాంశములకంటె, కథాంశములకే మారన తన కవిత్వమున నధికముగా ప్రాముఖ్యమిచ్చును. ఈ గ్రంథము నందలి శృంగారము ఔచిత్యముతో కూడి యొప్పుచున్నది. ఈ పురాణము నందలి వర్ణనాంశములు కొన్ని మహాభారతమునందు తిక్కన గావించిన వర్ణనములను పోలుచున్నవి. మొత్తము మీద ఆంధ్ర మార్కండేయపురాణము మాతృకకు అతి సన్నిహితముగా నుండును. అతని కవితా చాతుర్యమునకు తార్కాణముగా నీక్రింది పద్యములను చూపవచ్చును. చంద్రమతి లోహితాస్యుని మరణానంతరము పొందిన వేదనను మారన ఇట్లు వర్ణించెను.

చం॥ ఉరగము చేతఁజచ్చిన తనూద్భవునిన్ గొని, వేదనా
పరవశయున్, వికీర్ణకచభారయు, నుద్గత బాష్పపూరయున్
గరతల తాడితాస్యయును గద్గదికా వికలార్తనాదయున్
జరణ విపర్యయాపగత సత్వరయానయునై పొరింబొరిన్.

ఉ॥ ఘోరనఁబొంగి శోకరసపూరము నిర్భరబాష్పపూరమున్
వారక కన్గవన్ దొరుగ, వాతెరలాలలు గ్రమ్ముదేర, హో
హారవముల్ సెలంగ, విరియంబడి వేసవి ధూళి న
క్కూరిమి పట్టిఁబేర్కొనుచుఁగోమలి మేదినిఁజేతులాగుచున్.

మారన రచించిన యీ మార్కండేయ పురాణము అనేకాంధ్ర కావ్యములకు కథాభిక్ష పెట్టినది. ఈ పురాణములో హరిశ్చంద్రోపాఖ్యానము, మనుచరిత్రము, బహుళాశ్వ చరిత్రము, కువలయాశ్వ చరిత్రము మున్నగు ప్రసిద్ధ ప్రబంధములకు నాధారములైన కథలు గలవు. పెద్దన వంటి కవి మార్కండేయ పురాణమునందలి భావములను కొన్నిటిని యథాతథముగా స్వీకరించెనని చెప్పినచో మారన కవిత్వమును గూర్చి వేఱ చెప్పనేల.

## మంచన

మంచన కేయూర బాహుచరిత్రమును రచించెను. దానిని నందూరి గుండమంత్రికి అంకితము గావించెను. మంచన పూర్వకవిస్తుతిలో నన్నయ, తిక్కనలను మాత్రమే పేర్కొనియుండుట చేతను క్రీ.శ. 1206 వరకు వెలనాటిని పాలించిన పృధ్వీశ్వరునకు మంత్రియగు నందూరి కేతనకు గుండయామాత్యుడు మనుమడగుట చేతను మంచన కవి క్రీ.శ. 1300 ప్రాంతమున ఉండి యుండునని చెప్పవచ్చును.

రాజశేఖరకవి విద్ధసాలభంజిక అను నాటికను సంస్కృతమున రచించెను. ఆ నాటిక యందలి యితివృత్తమునందు కొన్ని మార్పులు చేసి మంచన కేయూరబాహు చరిత్రమును రచించెను. కాని యాతడు విద్ధ సాలభంజిక కథను గైకొన్నట్లు తెలుపలేదు. నందూరి గుండయమంత్రి మంచనతో

కం॥ స్థాయిరసము శృంగారం
బయి యలవడఁ, గథలు నీతులైయెడనెడరాఁ
గేయూరబాహు చరితము
చేయుము నీవాంధ్ర భాష శిల్పము మెఱయన్.

అందుచేతనే కాబోలు విద్ధసాల భంజిక కథకు పంచతంత్రహితోపదేశముల యందలి నీతికథలను తన కాలమున వ్యవహారమున నున్న నీతి కథలను ఇరువది రెండింటిని చేర్చి మంచన కేయూరబాహు చరిత్రమును వ్రాసెను. అసలు కంటె కొసరెక్కువ యైనట్లు ప్రధానకథకంటె ఉపాఖ్యానము అధికమైనది. ప్రధానకథ 233 గద్య పద్యములలో నుండగా ఉపాఖ్యానములు 468 గద్యపద్యములైనవి.

కేయూరబాహు చరిత్రమందలి కవిత్వము సరసమై సలక్షణముగా నున్నది. మంచన విద్ధసాలభంజిక యందలి యితివృత్తమునే కాక దానియందలి శ్లోకముల భావములను, పదములను స్వీకరించెను. అతడు తన కావ్యమును ప్రబంధమని పేర్కొనెను. ఇట ప్రబంధమనగా ఆంధ్రసాహిత్యమున వెలసిన ప్రత్యేక సాహిత్య ప్రక్రియయగు మనుచరిత్రాదుల వంటిదని యర్థము కాదు. మంచన వాడిన ప్రబంధ పదమునకు కేవలము కావ్యమనియే అర్థము. అయినను అతడు తరువాతి ప్రబంధకవులకు కవితాభిక్ష పెట్టిన పద్యముల నెన్నిటినో రచించెను. కేయూరబాహు చరిత్రమునందలి సూర్యోదయ వర్ణన మిట్లున్నది.

చం॥ జలజవనంబు కూర్మి చెలి, జక్కవదోయి ముదంబు, నిక్కుచు
క్కల పయిదాడికాడు, త్రిజగంబుల మ్రొక్కులయిక్క, వేదముల్
మొలిచిన పాదు, యోగులకు మోక్షము వాకిలి, ప్రాణికోటికిన్
వెలుగన నొప్పు నవ్వెలుగు వేగమ తూర్పునఁదోచెనత్తఱిన్.

ఇది అచ్చముగా ప్రబంధ కవి వ్రాసిన పద్యమువలెనే యున్నది.

కృతిపతియగు గుండయామాత్యుడు నీతికథలు కావ్యమున నుండవలయునని చెప్పెను గదా. ఆ నీతికథలను పెక్కింటిని చిన్నవానిని, పెద్దవానిని మంచన రమణీయముగా రచించెను. ఎడనెడ చక్కని చిక్కని నీతిపద్యములు వ్రాసెను. ఒక్క యుదాహరణము.

కం॥ చెలిమి శిలాక్షరమెప్పుడు
నలుక జలాక్షరమును జనులగు వారలకున్
జెలిమి జలాక్షరమెప్పుడు
నలుక శిలాక్షరము కుజనులగు వారలకున్.

ఇంత సులభసుందరముగా తేటతెలుగు మాటలలో కవిత్వము వ్రాయగల మంచన ప్రకరణోచితముగ దీర్ఘసమాసభూయిష్ఠరీతియు నుపయోగించును.

మ॥ అరయన్ దుష్టజనుల్ స్వదుశ్చరణజాత్యంధుల్, నిజాచారధీ
గరిమాతిస్తుతిమంతు, లాత్మధనరక్షాజాగరూకేక్షణుల్
పరదోషేక్షణ దివ్యచక్షు లితర ప్రజ్ఞాప్రశంసా నిరం
తరమౌన వ్రతులన్యవిత్తహరణ ధ్యాన క్రియా నైష్ఠికుల్.

మంచన కావ్యావతారికయందు ఈ క్రింది పద్యము వ్రాసెను.

ఉ॥ బాలరసాల పుష్పనవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుఁగూడు భుజించుట కంటె సత్కవుల్
హాలికులైన నేమి? మఱియంతకునాయతి లేనినాడు కౌ
ద్దాలికులైన నేమి? నిజదారసుతోదర పోషణార్థమై.

ఈ పద్యమే కొలది మార్పులతో పోతన భాగవతమునందు కలదు.

## ఎఱ్ఱన యుగము

### భాస్కర రామాయణము

ప్రాచీన చంపూరామాయణములలో భాస్కర రామాయణము ప్రప్రథమము. భాస్కరుడను మహాకవి రచించుటచే దీనికి భాస్కర రామాయణమను పేరు వచ్చినదని పండితులు చెప్పుచున్నారు. మఱి యీ భాస్కరుడెవ్వడు? ఈ విషయమున ఈ రామాయణ కర్తృత్వము వివాదగ్రస్తమగుట శోచనీయము. కొందఱు పండితులు తిక్కన సోమయాజి తాతయగు మంత్రి భాస్కరుడు ఈ రామాయణమును రచించెననియు చెప్పుచున్నారు. ఆ మంత్రి భాస్కరుడు కవి యని, తిక్కనయు, కేతనయు వక్కాణించిరి. తిక్కన తన తాతను గూర్చి వ్రాయుచు

తే॥గీ॥ సారకవితాభిరాము గుంటూరు విభుని
మంత్రి భాస్కరు మత్పితామహుని దలచి

అని చెప్పెను. దశకుమార చరిత్రమును చెప్పిన కేతన మంత్రి భాస్కరుని "శాపానుగ్రహశక్తియుక్తుడు", "సాహిత్య విద్యాపారీణుడు" అని వర్ణించెను. ఈ వర్ణనములను బట్టి మంత్రి భాస్కరుడే రామాయణమును రచించెనను భ్రాంతి కలుగును. అది కేవలము భ్రాంతి మాత్రమే.

భాస్కరమంత్రి ఈ చంపూరామాయణమును రచింపలేదని చెప్పుటకు రెండు, మూడు ప్రబల కారణములు కలవు. ప్రాచీన కవులెవ్వరు మంత్రి భాస్కరుని కవిగా స్తుతింపరైరి. కొఱవి గోపరాజువంటివారు భాస్కరుని స్తుతించునపుడు

"హుళక్కి భాస్కరుడు" అని స్పష్టముగా చెప్పిరి. దీనిని బట్టి ప్రాచీనులు అప్పకవి వంటి లాక్షణికులు సైతము హుళక్కి భాస్కరుడే రామాయణ కర్తయని నమ్మినట్లు చెప్పవచ్చును. అదియునుగాక భాస్కర రామాయణమునందే ప్రబలమగు సాక్ష్యమొకటి కలదు. యుద్ధకాండములో మొట్టమొదటి 1140 గద్యపద్యములను హుళక్కి భాస్కరుడు రచించెను. పిదప "శ్రీ నుతమూర్తియైన రఘుశేఖరుతేజము" అను పద్యము నుండి కాండాంతము దాక అయ్యలార్యుడు రచించెను. ఆతడు కాండాంతమున "అమర హుళక్కి భాస్కర మహాకవి చెప్పగనున్న యుద్ధకాండము తరువాయి చెప్పె"నని తన్ను గూర్చి చెప్పుకొనెను. హుళక్కి భాస్కరుడే ఈ రామాయణమును రచించెనని చెప్పుటకిది ప్రబల హేతువు గదా. మఱియు ఈ రామాయణము నందలి కొన్ని కాండములు సాహిణి మారన అనునాతనికి అంకితములైనవి. ఈ సాహిణి మారన క్రీ.శ. 1295 మొదలు 1323 వరకు కాకతీయ సామ్రాజ్యము నేలిన ద్వితీయ ప్రతాపరుద్రుని కొలువులో అశ్వసైన్యాధ్యక్షుడుగ నుండెను. మంత్రి భాస్కరుడు క్రీ.శ. 1200 ప్రాంతమువాడు. కావున మంత్రి భాస్కరుడు భాస్కర రామాయణ కర్తయనుట పొసగదు. ఇంతేకాక సాహిణి మారన హుళక్కి భాస్కరుడు సమకాలికులని స్పష్టమగు సాక్ష్యము కలదు. సోమదేవరాజీయమందు ద్వితీయ ప్రతాపరుద్రుని సభలో హుళక్కి భాస్కరుడు మొదలుగా గల ప్రబంధకవీశ్వరులు అశ్వముల కధికారియైన సాహిణి మారనయు నున్నట్లు చెప్పబడినది. ఇన్ని హేతువులచే హుళక్కి భాస్కరుడే రామాయణ కర్తయగుచున్నాడు.

ఈ రామాయణమును అనేకులు పూర్తి చేయుటకు గల కారణములను పండితులూహించిరి. భాస్కర రామాయణమునందు ముఖ్యపాత్ర వహించినవాడు హుళక్కి భాస్కరుడే. అతని కుమారుడు మల్లిఖార్జున భట్టు. సాహిణి మారనకు పుత్రుడు భాస్కరుని శిష్యుడునగువాడు కుమార రుద్రదేవుడు. అయ్యలార్యుడు భాస్కరునకు తరువాతి వాడని విమర్శకులు తలంచుచున్నారు. ఈ నలుగురును భాస్కర రామాయణమును పూర్తి చేసిరి. రామాయణాంధ్రీకరణము అచిర కాలములో పూర్తిచేయ తలంచుటచేతను, తన కుమారుడును శిష్యుడును సమర్థులగు కవులగుటచే వారిని ప్రోత్సహించుటకును భాస్కర మహాకవి ఈ మార్గము నవలంబించియుండెను.

ఈ నలుగురిలో మల్లికార్జునభట్టు బాలకాండమును, కిష్కింధ కాండమును, సుందరకాండమును రచించెను. కుమారరుద్రదేవుడు అయోధ్యా కాండమును రచించెను. భాస్కరుడు అరణ్య కాండమును ముగించి యుద్ధకాండమున 1140 గద్యపద్యముల దాక వ్రాయగలిగెను. ఈ కాండములో మిగిలిన భాగమును అయ్యలార్యుడు రచించెను.

ఈ భాస్కర రామాయణమునకు మూలము వాల్మీకి రామాయణము. కవిత్రయము వలెనే భాస్కరరామాయణ కవులును యథామాతృకానువాదము చేయరైరి. నలుగురు కవుల తెలిగింపగుటచే భాస్కర రామాయణ కవితారీతి తుల్యముగా లేదు. ఈ నలుగురిలో భాస్కరుడు మహాకవియని నొక్కిచెప్పవచ్చును. ఈతని కవిత్వము నన్నయ కవిత్వమువలె తత్సమపదబాహుళ్యము కలిగి ప్రసన్నముగా నుండును. యుద్ధవర్ణనము లందీతడు తిక్కన సోమయాజి ననుసరించెను. అంతేగాక సందర్భము వచ్చినప్పుడు సంస్కృత రామాయణ శ్లోకములను తెలిగించెను. సీతాపహరణానంతరము రాముడు మహాశోకసంతప్తుడయ్యెను. ఆ సందర్భమున జయదేవుడు ప్రసన్న రాఘవములో "సౌమిత్రేనను సేవ్యతాం తరుతలం చణ్డాంశు రుజ్జృమ్భతే" అను శ్లోకమును సంభాషణాత్మకముగా రచించెను. దానిని భాస్కరుడు యథాతథముగ తెలిగించెను.

చం॥ తపనుఁడు వేఁడఁజొచ్చెననుఁ, దమ్ముఁడ వృక్షముక్రిందఁబెట్టు, నాఁ
దపనుఁడు రేయిలేఁడు వసుధావర చంద్రుఁడు గాని; చంద్రునిన్
నృపసుత! యెట్లెఱంగితివి నీవు; మృగాంకము చూడనున్కి, హా
చపల మృగాక్షి! చంద్రముఖీ! జానకి! యెక్కడ నున్నదానవే!

భాస్కరుడు సంభాషణములను చక్కగా రచించును. ఉదాహరణమునకు సీతారావణుల సంభాషణమును చూపవచ్చును. రావణుడు సీతావృత్తాంతమును తెలియగోరును. అప్పుడు సీత

కం॥ చిరపుణ్యుఁడు జనకుండను
నరపతిసుత సీతయంద్రు నన్ను నయోధ్యా
వరుఁడగు దశరథ ధరణీ
శ్వరు కోడల నేను, రామచంద్రుని భార్యన్.

తన వృత్తాంతమంతయు చెప్పిన సీతతో రావణుడిట్లనెను.

కం॥ నీ తెఱఁగు పతి తెఱంగును
జేతో ముదమొదవ నాకుఁ జెప్పితి వనితా!
నా తెఱఁగు నా బలంబును
నీతో నెఱిఁగింతు వినుము నెయ్యంబొదవన్.

చం॥ కమలభవుండు తాత, గుణగణ్యుఁడు విశ్రవసుండు తండ్రి హే
మమయ వినూత్న రత్నమయమండిత మాత్మపురంబు లంక, వి
క్రమము త్రిలోకభీకర, మఖండ శుభాకరమైన దైత్యరా
జ్యమునకు నేను భర్తఁబటుశౌర్యుఁడ, రావణనామధేయుఁడన్.

ఈ విధముగా భాస్కరుడీఘట్టమును రచించెను.

మిగిలిన ముగ్గురు కవులలో లక్ష్మీరంజనముగారి యభిప్రాయము ప్రకారము మల్లికార్జున భట్టు ఉత్తమ కవి. తండ్రియంత సమర్థుడు కాకపోయినను సరసకవియే యని వారనుచున్నారు. బాలకాండము నందుకన్న కిష్కింధా, సుందరకాండముల యందు మల్లికార్జునభట్టు కవిత్వము మేలుగా నున్నది. వాలి భార్యయగు తారశోకమును మల్లికార్జున భట్టు సవిస్తరముగా వర్ణించెను.

అయోధ్యాకాండమును వ్రాసిన కుమారరుద్రదేవుడు భాస్కరునకు తగిన శిష్యుడని లక్ష్మీరంజనముగారు నిర్ణయించిరి. ఈతనికి సంగ్రహ రచన ప్రీతికరము.

అయ్యలార్యుడు మిగిలిన ముగ్గురు కవులవలె రసవత్కవిత్వమును వ్రాయలేదని ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహకర్త తీర్పు. కాని భాస్కరుని తరువాత అయ్యలార్యునకే ఆసనము పెట్టిన విమర్శకులు కొందరు కలరు. అయ్యలార్యునకు దీర్ఘ సమాసభూయిష్ఠమైన ప్రౌఢరచన యిష్టము. కానియతని కవిత్వమున ఔచిత్యము శూన్యము.

భాస్కరరామాయణమునందు దానికంటె పూర్వమున వెలసిన గోనబుద్ధభూపాలుని ద్విపద రామాయణమందు అవాల్మీకములైన అంశములు అనేకము కలవు. ద్విపద రామాయణమునందలి అవాల్మీకములనే భాస్కర రామాయణ కవులు తమ కావ్యమున చేర్చిరని చెప్పిరి. ఈ యభిప్రాయము సమంజసమనిగాని, అసమంజసమని గాని చెప్పలేదు. రామాయణ గాథ దానియందలి సన్నివేశములు, ఆనాటి ప్రజానీకములో రకరకములుగా మార్పులు పొంది వాడుకకెక్కియుండును. ఆ కథలు రసవంతములుగా నుండుటచే ద్విపద రామాయణ కర్త, భాస్కర రామాయణ కవులు తమతమ కావ్యములలో వానిని చేర్చి యుండవచ్చును. భాస్కర రామాయణము నందలి అవాల్మీకాంశములు

1. గౌతముడహల్యను పాషాణము గమ్మని శపించుట,

2. శైశవమున రాముడు తన కాలిని విరుచుటచే మంథర ఆతని పట్టాభిషేకమును భగ్నము గావించుట. తనకిచ్చిన రెండు వరములను గూర్చి రాజునడుగుమని మంథర కైకకు దుర్బోధ చేయుట.

3. జంబు కుమారుని వృత్తాంతము.

4. వాలి భార్యయగు తార శ్రీరాముని శపించుట.

5. సంపాతి తన కుమారుడగు సుపార్శ్వుని లంకకుబోయి సీతను వెదకి రమ్మని పంపుట.

6. కాలనేమి వృత్తాంతము.

7. శుక్రాచార్యోపదేశమున రావణుడు పాతాళహోమము చేయుట.

8. విభీషణుడు రామునకు రావణుని ఆయువుపట్టు తెలియజేయుట.

కథా ఘట్టములందే కాక వర్ణనములందు కూడ భాస్కర రామాయణ కవులు స్వాతంత్ర్యము వహించిరి. మల్లికార్జున భట్టు బాలకాండ ప్రారంభమున ప్రబంధముల యందు వలె నయోధ్యాపుర వర్ణనమును మాతృకను మించి చేసెను. యుద్ధకాండమున సేతువు కట్టుటకు ముందు వానర సైన్యాధిపతియగు నలుడు వినాయక ప్రార్థనము చేసినట్లు భాస్కర రామాయణమున కలదు. ఇది వాల్మీకి రామాయణమున లేదు.

–0–

47

# ఎఱ్ఱనయుగము

## ఎఱ్ఱన

క్రీ.శ. 1323 సంవత్సరమున ద్వితీయ ప్రతాపరుద్రుడు మహమ్మదీయులకు పట్టువడి ఢిల్లీకి తరలింపబడెను. ఆయన మార్గమధ్యముననే మరణించెను. ఇంతటితో కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమయ్యెను. ఆంధ్రదేశము తురుష్కాక్రాంతమయ్యెను. అయినను తెలుగువారు క్రుంగి కృశించి పోలేదు. ఆంధ్ర వీరులగు ముసునూరి ప్రోలయ నాయకుడు, ముసునూరి కాపయనాయకుడు అను వీరవరేణ్యుల నాయకత్వమున ఆంధ్రులు జాతీయ కూటమిగా నేర్పడి ఆంధ్రదేశము నుండి తురుష్కులను పారద్రోలి తిరిగి స్వాతంత్ర్యమును సంపాదించుకొనిరి. ప్రోలయ, కాపయ నాయకులకు సహాయము చేసిన వీరులలో ప్రోలయ వేమారెడ్డి యొకడు. ఈతడు అద్దంకి రాజధానిగా రెడ్డి రాజ్యమును సంస్థాపించెను. ఈ కాలముననే తెలంగాణమునందు రాచకొండ రాజధానిగా వెలమవీరులు మఱియొక స్వతంత్ర రాజ్యమును స్థాపించిరి.

ప్రోలయ వేమారెడ్డి క్రీ.శ. 1324 నుండి 1353 వరకు రెడ్డి సామ్రాజ్యము నేలెను. ఎఱ్ఱాప్రెగ్గడ ప్రోలయ వేమారెడ్డికి రామాయణమును, హరివంశమును అంకితము గావించెను. కావున అతడు ప్రోలయ వేమారెడ్డికి సమకాలికుడగును. విమర్శకులు ఎఱ్ఱాప్రెగ్గడ క్రీ.శ. 1285-1355 సంవత్సరముల నడిమి కాలము వాడని నిర్ణయించిరి.

ఎఱ్ఱాప్రెగ్గడ తండ్రి సూరన, పితామహుడు ఎఱ్ఱపోతసూరి, శంకర స్వామి గురువు. ఎఱ్ఱాప్రెగ్గడ పూర్వులు వేగినాటి యందున్న కరాపర్తి నివాసులని లక్ష్మీనృసింహావతారమును బట్టి తెలియుచున్నది. ఇక అరణ్య పర్వాంతమున ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన పద్యమును బట్టి అతడు పాకనాటియందలి గుడ్లూరులో నివసించెనని తెలియు చున్నది. విప్రనారాయణ చరిత్రమును రచించిన చదలువాడ మల్లన ఎఱ్ఱాప్రెగ్గడను తన వంశపురుషునిగా నుతించెను. ఎఱ్ఱాప్రెగ్గడ ఇంటిపేరు చదలవాడ అని కొందరు భావించిరి. ఏది ఏమైనను ఎఱ్ఱాప్రెగ్గడ పితామహాదులు వేగినాటిలోని కరాపర్తి గ్రామమున నుండిరనియు తరువాత నీతని తల్లిదండ్రులు పాకనాటి యందలి గుడ్లూరు చేరిరనియు ఎఱ్ఱాప్రెగ్గడ సంతతివారు చదలవాడ గ్రామమున నివసించిరనియు విశ్వసింపవచ్చును.

ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన గ్రంథములు మనకు మూడు లభించుచున్నవి. 1) భారతారణ్యపర్వ శేషము, 2) లక్ష్మీనృసింహావతారము (దీనినే నృసింహ పురాణమను చున్నారు, కాని ఆ పేరును శంభుదాసుడు వాడలేదు), 3) హరివంశము. ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణమును రచించినట్లు హరివంశమును బట్టి తెలియుచున్నది. ప్రోలయ వేమారెడ్డి కనిష్ఠ సోదరుడగు మల్లారెడ్డి మొట్టమొదట ఎఱ్ఱాప్రెగ్గడనాదరించి పిదప తన యన్నకు నతనిని సమర్పించెను. వేమారెడ్డి నోట ఎఱ్ఱన ఇట్లు పలికించెను.

**శా॥** **నా తమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిన్నాతత**
**శ్రీతోడన్ సముపేతుఁజేసి యెలమిన్ జేపట్టి మాకిచ్చుటన్**
**జేతోమోదమెలర్ప రామకథ మున్జెప్పించి యత్యుత్తమ**
**ఖ్యాతిన్ బొందితినింక నేను దనియన్ కావ్యామృతాస్వాదనన్.**

దీనిని బట్టి చదలువాడ మల్లన చెప్పిన మాటను బట్టి ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణమును

రచించెనని చెప్పవలయును. మఱియు కూచిమంచి తిమ్మకవి తన సర్వ లక్షణసార సంగ్రహములో ఎఱ్ఱన రామాయణము నుండి పద్యములుదాహరించెను. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఒకానొక సంకలన గ్రంథములో కూర్పబడిన ఎఱ్ఱాప్రగ్గడ రామాయణ పద్యములను సేకరించిరి. ఆ మహాకవి రచించిన రామాయణము లభింపక పోవుట ఆంధ్రుల దురదృష్టము. కాబట్టి ఎఱ్ఱన రచించిన కృతులు నాలుగని మనము విశ్వసింపవచ్చును.

ఏ క్రమమున ఎఱ్ఱాప్రెగ్గడ కావ్యములను రచించెనో దానిని నిర్ణయించు విషయమున పండితులలో భేదాభిప్రాయములు కలవు. లక్ష్మీనృసింహావతారమున ఆరణ్యపర్వశేషమును రచించినట్లు ఎఱ్ఱన చెప్పుకొనెను. రామాయణమును రచించినట్లు హరివంశమున గలదు. దీనినిబట్టి ఆరణ్యపర్వశేషము తరువాత లక్ష్మీనృసింహావతారమును, రామాయణము తరువాత హరివంశమును ఎఱ్ఱన రచించెనని వాదప్రతివాదములెట్లున్నను ఎఱ్ఱాప్రెగ్గడ ఆరణ్యపర్వశేషము, లక్ష్మీనృసింహావతారము, రామాయణము, హరివంశమునను క్రమమున కావ్యములు రచించెనని చెప్పనగును.

ఆరణ్యపర్వ శేషము:-

ఆరణ్యపర్వమున నన్నయభట్టు రచనము "శారదరాత్రులు" అను పద్యముతో ముగిసినదనియు, ఎఱ్ఱాప్రగ్గడ కవిత్వము "స్ఫురదరుణాంశరాగరుచి" అను పద్యముతో ప్రారంభమైనదనియు లోకము విశ్వసించుచున్నది. ఆరణ్యపర్వమున మొత్తము 2900 గద్యపద్యములు గలవు. వానిలో నన్నయ 1300 గద్యపద్యములను, ఎఱ్ఱాప్రగ్గడ 1600 గద్యపద్యములను రచించిరి. దీనిచే ఆరణ్యపర్వమును అర్ధాధికముగా ఎఱ్ఱాప్రెగ్గడ రచించెననుట స్పష్టము. ఆరణ్యపర్వ కథా మధ్యభాగము నుండి రచించుటచే ఎఱ్ఱనకు కావ్యావతారిక రచించు నవకాశము లేకపోయినది.

ఆరణ్యపర్వాంతమున నాతడిట్లు వ్రాసెను.

సీ॥ భవ్యచరిత్రుఁడాపస్తంబ సూత్రుండు
శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యాన సంసక్త చిత్తుఁడు, సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుండిలఁబొకనాటిలో నీలకం
ఠేశ్వరస్థానమై యెసకమెసగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు
ధన్యుఁడు ధర్మైక తత్పరాత్ముఁ.

తే॥గీ॥ డెఱ్ఱనార్యుండు సకలలోకైక విదితు
డయిన నన్నయభట్టు మహాకవీంద్రు
సరస సారస్వతాంశ ప్రశస్తి తన్నుఁ
జెందుటయు సాధుజన హర్షసిద్ధిఁగోరి.

కం॥ ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁగొంత దోపఁదద్రచనయకా
నారణ్యపర్వశేషము
పూరించెఁగవీంద్ర కర్ణపుట పేయముగాన్.

కాన ఆశ్వాసాద్యంత పద్యములందు నన్నయ వలెనే రాజరాజనేంద్రునే సంబోధించుచు అంత్యగద్యలందు నన్నయ రచితమనియే ఎఱ్ఱన వ్రాసెను.

ఇట్టివే మఱికొన్ని కారణములను బట్టి నడకుదుటి వీరరాజు పంతులుగారు ఎఱ్ఱన ఆరణ్య పర్వశేష కర్తృత్వమునకు ఎసరు పెట్టెను. ఇక్కడ నొకమాట చెప్పవలయును. వీరరాజు పంతులునకు ఎఱ్ఱాప్రెగ్గడపై అకారణముగా నిరాధారభావమేర్పడినది. నాచన సోమనాథుని ఉత్తర హరివంశ కవిత్వము కంటె ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వము హీనమైనదనియు ఎఱ్ఱాప్రగ్గడయే తనకు పూర్వుడగు సోముని కవిత్వము ననుసరించెననియు వారు సిద్ధాంతములు చేసిరి. అట్లే మరల ఎఱ్ఱాప్రెగ్గడ భారతారణ్యపర్వశేషమును పూరింపలేదనియు నన్నయ భారతమున మూడు పర్వములను పూర్తిగ వ్రాసెననియు, ఆరణ్యపర్వమున చరమ భాగము క్రిమిదష్టము కాగా ఎఱ్ఱన అక్కడక్కడ అక్షరములను, పదములను అతికెనే గాని, పద్యరచనము చేయలేదనియు వాదము చేసి తమ వాదమునకనుకూలముగా కొన్ని ఉపపత్తులను వారు వెదకిరి. అవి వాదమునకు నిలవవు.

ఎఱ్ఱాప్రగ్గడ నన్నయ రచనగా తాను ఆరణ్యపర్వశేషమును పూరించినట్లు చెప్పిన మాట నిజమే. దీనికి తోడు తిక్కనయు, మారనయు నన్నయభట్టు భారతమున మూడు పర్వములు రచించెనని చెప్పిరి. ఈ సాక్ష్యమును పట్టుకొని వీరరాజుగారు నన్నయ భారతారణ్యపర్వమును సంపూర్ణముగా రచించెనను వాదమును సాగదీసిరి. సామాన్య దృష్టికిది సమంజసముగా తోపవచ్చును. పరిశీలించిన ఈ వాదము దుర్బలమే కాక అర్థరహితము. నన్నయకు అతని కృతులను స్తుతించునప్పుడు గణితశాస్త్రపరముగా రెండు పర్వముల తరువాత, ఆరణ్యపర్వమున రెండాశ్వాసములు ముగించి మూడవ ఆశ్వాసమున 142 పద్యములను రచించెనని లెక్కవేసి పద్యములలో నెవ్వరును వ్రాయరు. కావుననే తిక్కనగాని, మారనగాని నన్నయ మూడు పర్వములు రచించెనని సాధారణముగా చెప్పిరి. తిక్కన తన భారతమును హరిహరనాథునకు అంకితమొనర్చెను. మఱియు భారత పర్వములలో నొక్కొక్కదానిని ఒక్కొక్క ప్రబంధముగా రచించెను. నన్నయయు ఆ భారత భాగమును రాజరాజనరేంద్రునకు అంకితమీయలేదు గాని అతనిని శ్రోతగా వర్ణించెను. అప్పటికే సగభాగమునకు శ్రోతగానున్న రాజరాజనరేంద్రుని పదచ్యుతిని గావించి ఆస్థానమున హరిహరనాథుని నెలకొల్పు తిక్కన తలంపలేదు. ఆతడు గావించునది విశిష్టమై నూతనమైన మహాకావ్యము. కావుననే నూతన పర్వముతో రచన సాగించి హరిహరనాథునకు అంకితమీయ గోరెను. అందుచే తిక్కన ఆరణ్యపర్వమును పూరింపక వదలివేయవలసి వచ్చినది. కనుకనే ఆరణ్యపర్వ మధ్యభాగము నుండియు చేపట్టినను ఎఱ్ఱాప్రెగడ అతుకుగా కనబడనీయక నన్నయపేరనే రచనము కొనసాగించి, అట్లనియే, ఆ పర్వాంతమున చెప్పికొనెను. పర్వాంతమందు ఎఱ్ఱన రచించిన స్వవిషయ పద్యములు ప్రక్షిప్తములని వీరరాజు పంతులుగారు వాదింపజూచిరి. ఈ వాదమునకు తలయు తోకయు లేదు. లక్ష్మీనృసింహావతారమున ప్రబంధ పరమేశుడనగా అరణ్య పర్వశేషోన్నయము నిర్వహించినట్లు ఎఱ్ఱన చెప్పికొనెను. ఇట 'ఉన్నయము' అను పదమునకు ఉద్ధరణమని యర్థము చెప్పి ఆరణ్య పర్వశిథిల భాగములను మాత్రమే ఎఱ్ఱాప్రెగ్గడ ఉద్ధరించెనని వీరరాజుగారు వాదించిరి. కాని యిది సరికాదు. అరణ్యపర్వశేషోన్నయమనగా ఆరణ్య పర్వ శేషపూరణమనియే అర్థము. మఱియు నీ క్రింది హేతువులచే ఎఱ్ఱాప్రెగ్గడ ఆరణ్య పర్వశేషమును రచించెనని నొక్కి వక్కాణింపవచ్చును.

1) ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన ఇతర కృతులలో మధ్యాక్కరలు లేనివనియు, అరణ్య పర్వశేషములో మాత్రమే అవి కలవనియు, ఆ మధ్యాక్కరలు న్ననయ రచిత భారత భాగములో మాత్రమే యున్నవనియు, కావున ఎఱ్ఱాప్రెగ్గడ అరణ్యపర్వశేషమును రచింపలేదని వాదము కలదు.

దీనికి సమాధానము లేకపోలేదు. నన్నయ కవితారీతి తోపజేయుటకై అతడు వాడిన మధ్యాక్కరలనే ఎఱ్ఱాప్రెగ్గడ ఆరణ్యపర్వశేషమున మాత్రము వాడెనని చెప్పవచ్చును. కాని మధ్యాక్కర రచనలలో నన్నయకు ఎఱ్ఱాప్రెగ్గడకు భేదము కలదు. నన్నయయతిని నాల్గవ గణప్రారంభమున వాడగా ఎఱ్ఱన మూడవ గణ ప్రారంభమున వాడెను. దీనివలన నైనను ఎఱ్ఱాప్రెగ్గడ ఆరణ్య పర్వశేషమును రచించెనని స్పష్టపడును గదా.

2) శ్రీనాథుడు భీమఖండమునందు పూర్వకవుల స్తుతులలో నన్నయ తిక్కనలను మాత్రమే పేర్కొని ఎఱ్ఱాప్రెగ్గడను పేర్కొనకుండుటచే అతడు భారతారణ్య పర్వశేషమును రచింపలేదని వాదము. ఈ వాదము నిస్సారము. ఆ శ్రీనాథుడే శృంగార నైషధమునను, కాశీకంధమునను నన్నయ తిక్కనలతో పాటు ఎఱ్ఱాప్రెగ్గడను కూడా స్తుతించెను. శృంగార నైషధములో

తే॥గీ॥ ధీరమతి, నన్నపార్యుని, దిక్కయజ్వ
శంభుదాసుని గరమర్థి సన్నుతించి – అని శ్రీనాథుడు వ్రాసెను.

3) కవితాశైలిని బట్టి కూడ ఆరణ్యపర్వమును ఎఱ్ఱాప్రెగ్గడ వ్రాయలేదని వాదించిరి. ఏలయన లక్ష్మీనృసింహావతార శైలి హరివంశశైలికి భిన్నము. ఆ రెండు కావ్యముల కవితాశైలులు ఆరణ్యపర్వశేషమున కానరావు. దీనికి హేతువు కలదు. సంస్కృత పద సమాసభూయిష్ఠమైన నన్నయశైలికిని, దేశీయ పదమయమైన తిక్కన శైలికిని వారధి వలె ఉండదగినది ఎఱ్ఱన రచించిన ఆరణ్యపర్వశేషము. ఈ రహస్యమును గుర్తించిన ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషమున నన్నయ తిక్కన శైలులకు వారధి వంటి కవితాశైలిని ప్రవేశ పెట్టెను.

4) ఆదిపర్వమునందు, ఆరణ్యపర్వమునందు కర్ణుని జన్మవృత్తాంతము భిన్నముగా వర్ణింపబడినది. ఆద్యారణ్య పర్వములను నన్నయ యొకడే రచించినచో కర్ణ జన్మ వృత్తాంత వర్ణనమున భిన్నత్వముండుటకు వీలులేదు. ఈ కారణముచే ఎఱ్ఱాప్రెగ్గడయే ఆరణ్యపర్వమును రచించెననుట సత్యమగును.

"నన్నయభట్ట తిక్కకవినాథులు చూపిన త్రోవపావనంబెన్న" అని ఎఱ్ఱాప్రెగ్గడ త్రికరణశుద్ధిగా నమ్మెను. నన్నయ తిక్కనలు ఆవేశించిరేమో అనునట్లు ఆయన ఆరణ్యపర్వ శేషము రచించెను. ఆరణ్యపర్వమున "శారద రాత్రులు"ను పద్యముతో నన్నయభట్టు కవిత్వము ముగియుచున్నదని సంప్రదాయ విదులనుచున్నారు. దాని తరువాత ఎఱ్ఱన ఈ క్రింది పద్యముతో ఆరణ్యపర్వశేషమునకు శ్రీకారము చుట్టెను. ఈ పద్యము ఇక్కడి శరత్కాల వర్ణనమంతయునని చెప్పవచ్చును. నన్నయయే రచించెనా అను భ్రాంతి కలుగును.

చం॥ స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై, దళత్కముల వైభవజృంభణ ముల్లసిల్లను
ద్ధురతర హంససారసమధువ్రత నిస్వనముల్ సెలంగగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁజూడగా.

ఇంతేకాక సందర్భము వచ్చినప్పుడెల్ల ఎఱ్ఱన నన్నయభట్టు పద్యములను యథాతథముగ నుపయోగించుకొనును. శిశుపాల వధాఘట్టమున నన్నయ రచించిన పద్యమునకు ప్రతిబింబాకార సంవాదముగా ఈ క్రింది పద్యమును రచించెను. ఇది ఘోషయాత్రానంతరము స్వకీయ రాజధానికి దుర్యోధనుడు మరలిన ఘట్టము నందలిది.

చం॥ రయ విచలత్తురంగమ తరంగములన్, మదనాగనక్ర సం
చయములఁ జంచలచ్చటుల సైనిక మత్స్యములన్ మహోన్నతం
బయి కురురాజ చంద్రునుదయంబునఁదద్దయుఁబొంగెఁ బ్రస్ఫురత్
భయద మనోహర ప్రకటభంగులఁదద్భుట వార్ధి యుద్ధతిన్.

అరణ్యపర్వశేషమున మొట్టమొదట నన్నయ కవితాశైలికి చక్కగా సరిపోవునట్లు రచనము సాగించిన ఎఱ్ఱాప్రెగ్గడ క్రమక్రమముగా సంస్కృత పదజాలమును తగ్గించి ఆరణ్యపర్వాంతము చేరుసరికి తిక్కన దేశీయ పదరచనా శైలితో చక్కగా కలసి పోవునట్లు శైలిని మార్చెను. ఇది అసిధారావ్రతము.

ఆరణ్యపర్వమున ఘోషయాత్ర, సైంధవ పరాభవము, రామాయణము, సావిత్ర్యుపాఖ్యానము, కర్ణజన్మ వృత్తాంతము మున్నగు ఘట్టములు గలవు. ఎఱ్ఱన వీనిని తిక్కన కవితాశిల్పము మూర్తీభవించినట్లుగా రచించెను. పాత్రల మనస్తత్వ వర్ణనమును గావించుటలో తిక్కన అసాధారణ చాతుర్యమును చూపెను. ఎఱ్ఱనయు నామార్గమున పోయెను. తనపై మోహము పెంచుకొనిన సూర్యుని చూచి కుంతి యిట్లనెను.

చం॥ జగములయందు ధర్మువును సత్యము నీయదిగాదె? యెందునే
తగవులు నీయెఱుంగని విధంబులె? యిట్టిది నీదు భంగికిన్
దగవగునేని మార్పలుకుదాననె యే? నగుగాక నీకు నిం
పగు తెఱగాచరింపుమిట; యావల నయ్యెడు నిందకోర్చెదన్.

ఈ పద్యము తిక్కన పద్యరచనా విధానమునకు ప్రతిబింబము. ఈ పట్టున కొడుకును నడిగంగలో త్రోయుచున్న కుంతి మనస్తత్వమును హృదయము ద్రవించునట్లుగా ఎఱ్ఱన వర్ణించెను.

ఆ॥వె॥ కొడుక నిన్నుఁగాంచు కొఱత నోములకాని
పెంచి గారవించి పేర్మినీదు॥
ప్రోపుఁగుడువఁగాంచు పుణ్యంబు తుదిముట్ట
నేల చేయనైతి నేను గుఱ్ఱ!

మత్తే॥ నెఱయన్ బున్నమచందురున్ జెనయు నీ నెమ్మోమునన్ దీయమై
చిఱునవ్వొప్పగఁజూడనీక, పులకల్ చెల్వొంద నిన్ గ్రుచ్చియ
క్కఱ దీఱన్ బొరినక్కునన్ గరము వీకన్ జేర్ప నీకిత్తతిన్
వఱదన్ ద్రోవగఁజేసెనే యకట దైవంబెందుఁజొత్తున్ సుతా!

ఒక్కొక్కచోట ఎఱ్ఱన కన్నులకు కట్టునట్లుగా పాత్రములను వర్ణించును. మాయామృగ రూపమును ధరించిన మారీచుని చేష్టలను ఎఱ్ఱాప్రెగ్గడ యిట్లు వర్ణించెను.

మత్తే॥ పఱచున్ దవ్వుగఁజేయలంతి నిలుచున్, ఐట్టీక యాసాసలన్
బిఱువోవున్ బొదలందుడిందుఁ బొడమున్ బిట్టుల్కి వేదాటుఁగ్ర
మ్మఱి చూచున్, జెవి దార్చినిల్చు, మలయున్, మట్టాడుఁగోరాడు, నే
మఱి నట్లుండుఁ దృణంబు మేయు, నలయున్, మాయా మృగంబిమ్ములన్.

అట్లే సావిత్రికి గోచరించిన యముని ప్రబంధపరమేశ్వరుడీ విధముగా వర్ణించెను. భయంకరత్వము మూర్తీభవించిన యముని వర్ణించిన ఈ పద్యమును పఠించునపుడు సహృదయులకు భయానుభూతియే కలుగును.

మత్తే॥ కనియెన్ గోమల నీలమేఘ విలసత్ కాలాంజనాకారు, ఘో
రని శాతోత్కట దంష్ట్రు, నుజ్వలచలత్ రక్తాక్షుఁబ్రత్యగ్రకాం
చన వర్ణాంబరు, నంత్యకాల దహన జ్వాలా ప్రచండున్ జగ
జ్జన సంత్రాసుని నొక్క దివ్యుఁబటుపాశ ప్రౌఢ హస్తోద్ధతున్.

కావ్యమునకు నాత్మ ధ్వనియని ఆనందవర్ధనుడు తీర్పు చేసెను. ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషము ధ్వనిమయముగా నుండును. అతడిప్పట్టున తిక్కన త్రోవ తొక్కెను. పాండవులను పరాభవింపగా ఘోషయాత్ర చేసిన దుర్యోధనుడు గంధర్వులచే శిరస్త్రాదనము చేయించుకొనెను. సోదరసహాయుడైన అర్జునుడు దుర్యోధనుని అతని పరివారమును బంధవిముక్తుల గావించి ధర్మరాజు కడకు గొనివచ్చెను. అప్పుడు ధర్మరాజు దుర్యోధనున కిట్లనెను.

ఉ॥ ఎన్నడునిట్టి సాహసములింక నొనర్పకుమయ్య, దుర్జనుం
డన్నన సాహసక్రియలయందుఁ గడంగి నశించుఁగావునన్
గ్రన్నన తమ్ములన్ దొరలఁగైకొని యిమ్ములఁబొమ్మువీటికిన్
సన్నుత దీని కొండొక విషాదము పొందకు మీమనంబునన్.

"దుర్యోధనా! ఏనాడునిట్టి సాహసములు చేయవలదు. దుర్జనుడు సాహస క్రియలు చేసి చివరకు నాశమగు"నని ధర్మరాజు నభిప్రాయము గదా! దుర్యోధనుడు దుర్జనుడై సాహసక్రియలు చేసెనని వ్యంగ్యము. ధర్మరాజు దుర్యోధనుని దుర్జనుడని స్పష్టముగా అనకయే అనెను. ఆతడు మెత్తని పులివలె మాటాడెను. ఎఱ్ఱన కవితావైభవమిట్టిది.

**లక్ష్మీనృసింహావతారము :**

దీనినే నృసింహ పురాణమనుచున్నారు. ఎఱ్ఱన దీనిని అహోబల నరసింహ స్వామి కంకితము చేసెను. ఇదియాతని స్వతంత్ర గ్రంథము. భారత, భాగవతాది పురాణముల వలె లక్ష్మీనృసింహావతారము సంస్కృతము నుండి తెలిగింపబడినది కాదు. ఇందలి కథను బ్రహ్మాండాది పురాణముల నుండి గ్రహించి ఔచిత్యపోషణము కొఱకు మార్పులు చేసి ఎఱ్ఱాప్రెగ్గడ దీనినొక ప్రబంధముగా తీర్చిదిద్దెను. సంస్కృతమున నృసింహపురాణము కలదు. దానికిని దీనికిని పోలికయే లేదు.

లక్ష్మీనృసింహావతారమున ప్రహ్లాదచరిత్రము వర్ణింపబడినది. సనకసనందనాదులు విష్ణుద్వారపాలకులుగా నుండు జయవిజయులను శపించుట ఇందలి కథకు బీజము. హిరణ్యకశిపుని వధ ఫలము. ఈ కావ్యమున మొదటి మూడాశ్వాసములందలి వర్ణనములు కవికల్పితములు. ప్రబంధములందు వలె పురర్తు చంద్రోదయాది వర్ణనములతో గూడి ప్రధాన కథకు భంగము కలుగని కథాసౌష్టవముతో రచింపబడినది. ఇందలి వచనములు సైతము ప్రబంధశైలితో నడచినవి. ఈ కావ్యమున వస్త్వైక్యము పాటింపబడి ఔచిత్యము బాగుగా పోషింపబడినది. మొదటి మూడాశ్వాసములందు కథ భిన్నరసభావముల కూడికతో సుళ్ళు తిరిగినది. ఏ రసమునకు స్థిరత్వము లేదు. నాలుగైదాశ్వాసములలో ప్రహ్లాదుని భక్తియు, హిరణ్యకశిపుని రౌద్రమును వర్ణింపబడినది. కావున ఈ కావ్యము వివిధ రసమిశ్రమైనది. మొత్తము మీద పురాణ కథకు ప్రబంధ లక్షణములు కల్పించినవాడెఱ్ఱాప్రెగ్గడ.

లక్ష్మీనృసింహావతారమును ఆంధ్ర వాఙ్మయము నందలి ప్రప్రథమ క్షేత్ర మాహాత్మ్యమని చెప్పవచ్చును. క్షేత్రము యొక్క ఆ క్షేత్రమున వెలసిన దైవతము యొక్క తత్సమీపమున ప్రవహించు నది యొక్క మహిమను వెల్లడించు కావ్యములను క్షేత్ర మహాత్మ్యములందురు. భీమఖండము, కాళహస్తీశ్వర

మాహాత్మ్యము, పాండురంగ మాహాత్మ్యము మున్నగునవి ప్రసిద్ధి క్షేత్ర మాహాత్మ్య కావ్యములు. లక్ష్మీనృసింహావతారమున అహోబల క్షేత్రము యొక్క, అక్కడ వెలసిన నరసింహస్వామి యొక్క తత్సమీపమునందలి నదియగు భవనాశిని యొక్క మహిమ వర్ణింపబడినది. క్షేత్ర మాహాత్మ్యమయ్యు వర్ణనాశోభితమైన ప్రబంధమగుటయే లక్ష్మీనృసింహావతారము యొక్క విశిష్ట లక్షణము.

కావ్యమున ఔచిత్యము ఆత్మయని క్షేమేంద్రుడు నిర్ణయించెను. ఎఱ్ఱాప్రెగ్గడ ఔచిత్యము కొఱకై కథయందు కొన్ని మార్పులు చేసెను.

1) హిరణ్యాక్ష హిరణ్యకశిపులు విష్ణుద్వారపాలకులైన జయవిజయులు. ఒకనాడు సనకసనందనాదులు విష్ణుదర్శనార్థము పోగా నది సమయముగాదని వారడ్డగించిరి. అంత నామహర్షులు కోపగించి అసురయోని జనింపుడని వారిని శపించిరి. పిమ్మట విష్ణువక్కడికి వచ్చి మహర్షుల ననునయించి జయవిజయులచిరకాలమున తన్ను చేరునట్లుగా మహర్షులనర్థించెను. ఇది మూల కథ. ఇందనౌచిత్యములు కలవు.

జయవిజయులకు వైకుంఠమొసగు నధికారము విష్ణువునకే యుండగా మహర్షులను యాచింపనేల? సకల భూతాంతర్యామియగు విష్ణువునకు తెలియకయే ఈ సంఘటనలు జరుగునా? జయవిజయులొనర్చిన స్వల్ప దోషమునకు ఘోరశాపముచితమా? అను సందేహములు కలుగకమానవు. వీనినన్నింటిని పరిహరించుటకై లక్ష్మీనరసింహావ తారమున విష్ణువు సనకసనందనాదులతో జయవిజయులొనర్చిన దోషము తనదేయనియు వారు స్వల్పకాలముననే తననోనైక్యమగుదురనియు, ఆ సంఘటనములన్నియు తన మాయాబలమున వారికి శ్రేయస్సు కలుగుటకై కల్పింపబడినవనియు చెప్పెను. ఈ మార్పు వలన మూలకథకౌచిత్యము చేకూరినది.

2) హిరణ్యకశిపుడు విష్ణువు చేతిలో తన సోదరుడు మరణించుటచే హరిని, తదనుచరులగు దేవతలను ద్వేషించి దేవలోకముపై దండెత్తినట్లుగా భాగవతమున కలదు. ఇందు వ్యక్తిగతమగు కలహము కలదు. ఎఱ్ఱన బంధు వినాశమను సాధారణ కారణము కంటె మఱియొక యుచిత కారణమును కల్పించెను.

దేవతలు, రాక్షసులు సవతి బిడ్డలు. దితి రాక్షసమాత. ఆమె కశ్యప ప్రజాపతికి జ్యేష్ఠ భార్య. కావున రాక్షసులు పెద్దభార్య బిడ్డలగుదురు. ఈ హేతువుచే త్రిలోకాధిపత్యమునకు దైత్యులకెక్కువ యధికారముండెననియు, ఆ హక్కును సాధించుటకై హిరణ్యకశిపుడు స్వర్గముపై దండెత్తెననియు ఎఱ్ఱన కల్పించెను.

3) తనకు మరణము లేకుండునట్లు హిరణ్యకశిపుడు బ్రహ్మను వరమడిగెనని భాగవతమున కలదు. దీని ప్రయోజనము హరిపై పగసాధించుటయే గదా! కాని హిరణ్యకశిపుడు ప్రత్యక్షముగా దానినడుగలేదు. ఇట ఎఱ్ఱన కొద్దిమార్పు చేసెను. హిరణ్యకశిపుడు ఇంద్రత్వమును గోరి తపము చేయుచుండగా బ్రహ్మ దానినుండి వానిని మరలింపనెంచి, అతనికి ఇంద్రపదవి కంటె అధికమైన దానినిచ్చెదనని ఆశపెట్టినట్లును అంత హిరణ్యకశిపుడు మరణము లేకుండుటను కోరినట్లును లక్ష్మీనరసింహావతారమున కలదు. తరువాత హిరణ్యకశిపుని మరణమునకు మఱియొక యుపపత్తిని కల్పించి ఎఱ్ఱన ఔచిత్యమును చేకూర్చెను.

4) హిరణ్యకశిపుని తపమునకు భయపడి ఇంద్రాదులు బ్రహ్మతో మొరపెట్టు కొనగా అతడు వరమిచ్చినట్లు భాగవతమున కలదు. కాని లక్ష్మీనరసింహావతారమున బ్రహ్మతానై వరమిచ్చినట్లుండును.

5) భాగవతములో హిరణ్యకశిపుడు చేసిన బ్రహ్మస్తుతి అతని రాక్షసత్వమునకు విరుద్ధముగా వేదాంతమయమై యున్నది. ఇట ఔచిత్యమును గోరిన ఎఱ్ఱన "సముచితార్థ మధుర బహువిధస్తోత్ర సమ్మర్ద రచన మున్నుగా నతడిట్లని విన్నవించె" నని మాత్రమె రచించెను.

6) హిరణ్యకశిపుడు తపము చేయుచుండగా నతని భార్య లీలావతిని ఇంద్రుడు చెఱపట్టెనను ఘోర విషయమును, లీలావతీదేవి శతసంవత్సర గర్భవృత్తాంతమును, హిరణ్యకశిపుని శతదివ్య సంవత్సర తపమును భాగవతమున గలవు. ఔచిత్యము కొఱకు ఎఱ్ఱన వీనిని పరిహరించెను.

7) శ్రీమహావిష్ణువు నృసింహరూపమున స్తంభమునందే యావిర్భవించుటకు నొక కారణమును ఎఱ్ఱన కల్పించెను. లక్ష్మీనరసింహావతారమున ప్రహ్లాద హిరణ్యకశిప సంవాదము "సమంచిత కాంచన రత్నఖచిత మహాస్తంభ శతసంభారమండితమగు సభా మంటపము"న జరిగినట్లు ఎఱ్ఱన వర్ణించెను. అందుచే ఒకానొక స్తంభమునందు హరిని జూపుమని హిరణ్యకశిపుడు ప్రహ్లాదునడుగుటయు, అంత హరి దానినుండి యుద్భవించుటయు క్రమముగా పరిణమించినవి.

లక్ష్మీనృసింహావతారము రచించునాటికే ఎఱ్ఱన "ఉన్నత సంస్కృతాంధ్ర చతురోక్తి పథములఁగావ్యకర్త"యై ప్రబంధ పరమేశ్వరుడను బిరుదు సంపాదించి యుండెను. ఎఱ్ఱన తాతయతనిని "ప్రబంధ రచనా ప్రావీణ్యము నీకు సహజపరిణతసిద్ధ"మని ప్రశంసించి యుండెను. ఎఱ్ఱనయు లక్ష్మీనరసింహావతారమును ప్రబంధమని పేర్కొనెను. మునులు సైతము రోమహర్షణునుత్తమమైన తీర్థమును గూర్చి "పరమోదాత్త ప్రబంధోక్తులతో నెఱిగింపు" మని యడిగిరి. వీనినిబట్టి ఎఱ్ఱన దీనిని ప్రబంధముగా రూపొందించెనని గ్రహింపవచ్చును. ప్రకృష్టబంధత్వము ప్రబంధ లక్షణము. ఆ లక్షణము అనగా అశిథిల బంధురమై ప్రౌఢమైన పదముల కూర్పు లక్ష్మీనరసింహావతారమందంతట గోచరించుచున్నది.

ఎఱ్ఱన కవితలో సంస్కృతాంధ్ర పదములు సమాన భాగములుగా కనబడును. అతని కవితారీతి సర్వత్రధారాశుద్ధి కలిగి యెచ్చటను గుంటువడక సుందరమై ప్రకాశించుచున్నది. ద్విత్వాక్షరప్రాసములతో కూడిన పద్యములు కూడ అప్రతిహతగతితో సాగిపోవుట అతని కవితాధారాశుద్ధికి తార్కాణము. అతడు రసానుకూల పదప్రయోగమున మిక్కిలి నిపుణుడు. ద్వితీయాశ్వాసమందలి వసంతర్తువు యొక్కయు, అచ్చరుల లీలా విలాసముల యొక్కయు, పంచమాశ్వాసమందలి నరసింహావిర్భావము యొక్కయు వర్ణనల పరికించిన ఈ విషయము తేటతెల్లమగును. నరసింహావతారము చంపూ కావ్యము గదా! కాన దీనిలో ఎడనెడ వచనములు కలవు. ఎఱ్ఱన సాధారణముగా కథాకథనమునకును, వర్ణనములకును, నీరస విషయ వివరణమునకును, వచనములనుపయోగించును. ఆ వచన రచన కూడ ధారాళమై శబ్దార్థాలంకార సుందరమై యొప్పారుచుండును. లక్ష్మీనరసింహావతారమున వైకుంఠపుర వర్ణన వచనము, శరదృతు వర్ణన వచనము, అంగవర్ణన వచనము, స్తంభోద్భవ వచనము ప్రత్యేకముగా పేర్కొనదగినవి.

నన్నయ తిక్కన వలెనే ఎఱ్ఱనయు భావప్రధానమైన కవితాకళనారాధించెను. హిరణ్యకశిపుని వర్ణనము ప్రాతఃకాల వాయువర్ణనము చూచినచో అతని కవితాతత్త్వము స్పష్టమగును. దైత్యులయందు నాయకుడగు హిరణ్యకశిపుని శంభుదాసుడిట్లు వర్ణించెను.

సీ॥ కనలు బింకపుఁగింకఁగలుగు వేడిమియెల్ల
నెక్కటియై యొడలెత్తె ననఁగఁ
గరకుఁబ్రల్లదమునఁగల్గు పోడిమి యెల్ల

నచ్చుమై తెగఁబొడవయ్యె ననఁగఁ
గటికిచ్చై తనరారు గర్వంబునకుఁ గల
చేగ యెల్లను రూపు చెందెననఁగఁ
వెగ్గలంబై పేర్చు వీరంబునకుఁగల
పసిక యెల్లను మేను పడసెననఁగఁ.

ఆ॥వె॥ ప్రళయకాల దహనుఁబోలించు దొరయనఁ
జండ దండధరుని సఖుఁడనంగఁ
దేజరిల్లె నైజతీవ్ర మానమున, హి
రణ్య కశిపుడప శరణ్యరిపుడు.

ఈ క్రింది ప్రాతఃకాల వాయు వర్ణనము ఆహ్లాదకరముగా నున్నది.

సీ॥ వెడవెడ మూతులు విచ్చు తామరలపై
సుడిసి నెత్తావులు సూఱలాడి
యనుగు తోటలు సొచ్చి యలరు తేనియఁజేసి
యలదేటి పదువులఁజెలగి నడచి
రాయంచ కవల నిద్రలు దెల్పి కొలకులఁ
దరగ యుయ్యలయాట తగులు పఱిచి
సోర్ణగండులు సొచ్చి సురతఖేదము నందు
చెలువలఁజెలువుర సేదదేర్చి.

తే॥గీ॥ యదరి గృహపతాకికలకు నాట గఱపి
ప్రోది నెమళుల యఱకల పొదులు విప్పి
మంద సంచారముగ సుకుమారమగుచు
మెఱసెఁబ్రత్యూష సమయ సమీకరణంబు.

సంస్కృత భాగవతమున ప్రహ్లాద కథ ప్రసిద్ధము. అది పోతన వలన ఆంధ్ర లోకమున సుప్రసిద్ధము. ప్రహ్లాద చరిత్రమును రచించిన ఎఱ్ఱన పద్యములు కొన్ని పోతన పోతలోబడి పద్యములవలె విప్పారినవి. లక్ష్మీనరసంహావతారమున ఈ క్రింది పద్యము కలదు.

ఆ॥వె॥ కుడిచినపుడు, నిద్రగూరినయపుడు
మేలుకొనినయపుడు మెలగినపుడు
విష్ణుకీర్తనంబు విష్ణుచింతయ కాని
పలుకడొండు, బుద్ధిఁదలపడొండు.

ఈ పద్యమే పోతన భావుకతతోనిట్లు రూపాంతరమొందినది.

శా॥ పానీయంబులు త్రావుచున్, గుడుచుచున్, భాషించుచున్, హాసలీ
లానిద్రాదులు సేయుచున్, దిరుగుచున్, లక్షించుచున్, సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ, చింతామృతా స్వాదసం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁడే తద్విశ్వమున్ భూవరా!

## హరివంశము

హరివంశమున హరివంశ పర్వము, విష్ణుపర్వము, భవిష్య పర్వముననను మూడు పర్వములు గలవు. హరివంశ పర్వముల తుదను 'ఖలేషు' అని యుండును. అందుచేనది భారతమునకు ఖిలమగును. ఖిలమనగా పరిశిష్టము. ఆదిపర్వము మొదలుకొని స్వర్గారోహణ పర్వము వరకు గల గ్రంథము భారతమనియు, హరివంశముతో కూడిన గ్రంథమును మహాభారతమనియు నందురు. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమును తెలిగించి తనను చేపట్టిన మల్లారెడ్డి సోదరుడును, రెడ్డిరాజునగు ప్రోలయ వేమారెడ్డికి నంకితము గావించెను. వేమారెడ్డి సవినయముగా ఎఱ్ఱాప్రెగ్గడను పూజించి యిట్లనియెను.

తే॥గీ॥ సకల భాషా కవిత్వ విశారదుడవు
సాధుసమ్మతుడవు నిత్య సౌమ్యమతివి
భవ్యుఁడవుఁగాన నీమీదఁబరగఁబక్ష
మేను గలిగియుండుదు నెప్పుడెఱ్ఱనార్య!

శా॥ నా తమ్ముండు ఘనుండు మల్లరథినీ నాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁజేసి, యెలమిన్ జేపట్టి మాకిచ్చుటన్
జేతోమోదమెలర్ప రామకథ మున్జెప్పించి, యత్యుత్తమ
ఖ్యాతిన్ బొందితి, నింక నేను దనియన్ గావ్యామృతాస్వాదనన్.

కం॥ భారత పరాంశమని యిం
పారగఁజెప్పుదురు బుధులు హరివంశము, నీ
వారమ్య కథఁదెనుంగుగ
ధీరోత్తమ నిర్వహించి తెలుపుము మాకున్.

ప్రోలయ వేమారెడ్డి యిట్లనగా ప్రహర్ష పులకితదేహుడై ప్రబంధ పరమేశ్వరుడిట్లనెను.

ఉ॥ నన్నయభట్ట తిక్కకవినాథులు చూపిన త్రోవ పావనం
బెన్నఁబరాశరాత్మజ మునీంద్రుని వాఙ్మయమాది దేవుడౌ
వెన్నుని వృత్తమిావు కడువేడుకతో విను నాయకుండ, వి
ట్లెన్నియొ సంఘటించె మదభీప్సిత సిద్ధికి రాజపుంగవా!

సంస్కృత హరివంశము నాంధ్రీకరించునపుడు శంభుదాసుడు భారతాంధ్రీకరణ పద్ధతినే యనుసరించెను. విషయములను సంగ్రహపరచి మాతృకయందలి కథాంశములకు భంగము కలుగనట్లు చూచెను. కాని ఎఱ్ఱన హరివంశమునందులేని ద్యూతక్రీడ, హంసడిభకోపాఖ్యానము నాచనసోముని ఉత్తర హరివంశమునందు కలవు. సోముని హరివంశము నందు లేని జరాసంధుని మధురాక్రమణము, రుక్మిణీ పరిణయము, పారిజాతాపహరణము ఎఱ్ఱన హరివంశమున కలవు. ఆయన తన హరివంశము పూర్వభాగమనియు, ఉత్తర భాగమనియు విభజించెను. పూర్వ భాగమున తొమ్మిది ఆశ్వాసములు కలవు. ఎఱ్ఱాప్రెగ్గడ కొన్నిచోట్ల మూలమునకు కూడ మెఱుగుబెట్టెను. ఉషా పరిణయమున నీతడు వర్ణించిన నూతన వధూవరుల ముగ్ధ శృంగార ప్రణయ భావములును, చిత్రరేఖా పాత్ర పోషణమునిట్టివి. శ్రీకృష్ణుని శైశవ క్రీడావర్ణనము, యశోదా దేవకీదేవుల మాతృభావము స్వభావసిద్ధముగా చిత్రింపబడి పోతనార్యుని భాగవత రచనమునకు నాదర్శము లైనవి. వ్రేపల్లెయందలి పాడిపంటలను, పశుసంపదను వర్ణించిన తీరు ఎఱ్ఱన లోకవృత్త పరిశీలనమునకు తార్కాణము.

ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వము హరివంశమున పండినది. పద్యరచనము శిల్ప భూయిష్ఠమై యొప్పారుచున్నది. ఘంటాకర్ణుడు శ్రీకృష్ణునితో మాటాడిన మాటలు మనోహరములు.

శా॥ వేదాధ్యాయులు గానలేరు, నియమావేశవ్రతుల్ గానలేర్
వేదాంతజ్ఞులు గానలేరు, బహుసంవిత్ తర్క కార్కశ్యబహుసం
వాదులు గానగలేరు, భక్తి వెలిగా భక్త్యేక సంప్రాప్తు, నే
మా దేవున్ హరిఁగాన బోయెదము భాగ్యారంభమెట్లో తుదిన్.

అతడు శ్రీకృష్ణమూర్తిని పొడగని ఆనందావేశముతో నిట్లనెను.

కం॥ హరిఁగంటి, కృష్ణుఁగంటిన్
బరమేశ్వరుఁగంటి, భక్తభయహరుగంటిన్
బురుషోత్తము దచ్యుతుడీ
శ్వరుడభవుఁడు వీఁడె వీఁడె సమ్ముఖుఁడయ్యెన్.

హరివంశమున సృష్టిక్రమాది వృత్తాంతములు నీరసభాగములు పెక్కులు కలవు. కాని రసవత్తర ఘట్టములను ఎఱ్ఱన మనోహరముగా వ్రాసి మహాకవి పదవాచ్యుడయ్యెను. ఒక్కొక్కచోట ఎఱ్ఱన సంస్కృత పదభూయిష్ఠముగా వ్రాయును. మఱియొక్కచోట తిక్కనవలె చిన్న చిన్న మాటలతో పద్యములు వ్రాయును. సింహహతుడైన ప్రసేనుని అతడిట్లు వర్ణించెను.

మ॥ బలవత్ సింహచపేట పాటిత తనుభ్రష్టభూషాంబరా
కులకేశ ప్రకరున్, గరస్ఖలిత ఖడ్గున్, ముక్తకల్యాణ సం
వలిత గ్రీవవికీర్ణ కేశర మృతాశ్వప్రాంత సంస్థున్, రజః
కలుష శ్మశ్రుముఖున్ బ్రసేనుఁగనియెన్ గ్రవ్యాద సంవేష్టితున్.

కుటుంబము వలన బహుబాధలు పడిన దేవేంద్రుడు బృహస్పతికడ గోడుగోడున విలపించెను. అపుడు దేవగురువు దేవేంద్రునితో నిట్లనియెను.

చం॥ అనిన నతండు నీవు నను నక్కటయింతననేల, మున్నయీ
పని యెఱింగించితేని నశుభంబులు నీ దెస జేరనిత్తునే
వినుమిటు సూడు, సర్వమును వేగమె మేలుగ నుద్వహించెదన్
మనమున శంక దక్కు మనుమానము మానుము, లేదు భారమున్.

శ్రీనాథుడు ప్రబంధపరమేశ్వరుని ప్రశంసించుచు

సీ॥ "పరిఢవింతుఁ బ్రబంధ పరమేశ్వరునిఠేవ
సూక్తి వైచిత్రినొక్కొక్క మాటు"
అని యన్నమాట యదార్థము.

## చిమ్మపూడి అమరేశ్వరుడు

కవిసార్వభౌముడు శ్రీనాథుడంతటివాడు చేతులెత్తి మ్రొక్కిన కవి చిమ్మపూడి అమరేశ్వరుడు. ఇతనిని శ్రీనాథుని నుండి రాజరాజభూషణుని వరకు గల మహాకవులెల్లరు స్తుతించిరి. అయినను అమరేశ్వరుని తల్లిదండ్రులెవ్వరో అతని జన్మభూమి యేదియో, ఆశ్రయించిన రాజెవ్వడో, ఏ కృతులు రచించెనో మనకు తెలియదు. శ్రీనాథునితో పాటు అనంతామాత్యుడు, కొఱవి గోపరాజు

స్తుతించిరి. గావున అమరేశ్వరుడు వారికి పూర్వుడు కాదగును. ఎఱ్ఱనకు సమీప కాలము వాడని చెప్పవచ్చును.

ఇతర విషయములేవియు తెలియక పోయినను అమరేశ్వరుడు రచించిన "విక్రమసేనము" అను రసవత్కావ్యము నందలి పద్యము లేబదినాల్గు లభించుచున్నవి. పెదపాటి జగ్గన్న అనుకవి తన "ప్రబంధరత్నావళి" అను సంకలన గ్రంథమున "విక్రమ సేనము" నుండి పద్యముల నుదాహరించెను. కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసార సంగ్రహమున కొన్ని పద్యములను తార్కాణించెను. విక్రమ సేనమను పేరును బట్టియు, నుదాహృత పద్యములను బట్టియు కందుకూరు వీరేశలింగముగారు

"మాళవదేశము నందలి యుజ్జయినీ నగరమునకధిపతియైన విక్రమసేనుని కథయై సమస్తవర్ణనల తోడ నిండియున్న శృంగారకావ్యమైనట్లు కనబడుచున్నది" అని వ్రాసిరి. లభించిన పద్యములలో ఇష్టదేవతాస్తుతికి, పురవర్ణనములకు, అష్టాదశ వర్ణనమునకు, నాయక వర్ణనమునకు సంబంధించిన పద్యములు కలవు. అమరేశ్వరుని చంద్రోదయ వర్ణనము చమత్కారముగా నున్నది. అతడు చంద్రుని యోగితో పోల్చెను.

తే॥గీ॥ తనరి రాజిల్లి ముక్తుడై తరతరంబ
నిర్మలత్వంబు పొందుచు నీరజారి
పరమయోగియుఁబోలె సత్పథమునందు
నడువఁగాఁజొచ్చెఁ గువలయానందమొసగ.

అంత్యానుప్రాసముతో అమరేశ్వరుడు కైలాస వర్ణనము గావించెను.

మత్తే॥ అదె కైలాసము, దిగ్విలాసము, విహాయశ్చారిణీ సమ్మద
ప్రదవిన్యాస, ముదగ్రభాసము, మరుద్భామానదాధ్యాసమ
భ్యదయన్యాస, మసన్నిరాసము, మయూరోదార నిధ్వానబి
భ్యదహి వ్రాతకృత ప్రవాసము, త్రినేత్రావాసమూర్వీశ్వరా!
మన్మథుని స్తుతి గావించెను.

## విన్నకోట పెద్దన

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి అను అలంకారశాస్త్ర గ్రంథమును రచించి చాళుక్యవంశీయుడగు విశ్వేశ్వర భూపతి కంకితము గావించెను. తొమ్మిది యుల్లాసములు గల ఈ గ్రంథమున లక్ష్యములన్నియు విశ్వేశ్వర భూపతి పేరుమీద నున్నవి.

విన్నకోట పెద్దన కాలమును గూర్చి చరిత్రకారులలో భిన్నాభిప్రాయములు కలవు. ఇతడు క్రీ.శ. 1300 ప్రాంతమువాడని కందుకూరి వీరేశలింగముగారు నిర్ణయించిరి. కాని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు విశ్వేశ్వరభూపతి శాసనమును బట్టి క్రీ.శ. 1400 ప్రాంతము వాడని నిర్ణయించిరి. అట్టిచే నీతడు శ్రీనాథునకు సమకాలికుడగును. కాని లక్ష్మీరంజనముగారీతనిని ఎఱ్ఱన యుగమున చేర్చిరి.

పెద్దన పుర వర్ణనమున కుదాహరణముగా రాజమహేంద్రవరమును వర్ణించెను. ఆ పద్యముననే చాళుక్య విశ్వేశ్వరుడు రాజమహేంద్రుని యనుగు మనుమడని చెప్పెను. దీనినిబట్టియే కవి రాజమహేంద్రవర నివాసియనియు కృతిపతియగు విశ్వేశ్వరుడు రాజమహేంద్రవర పురాధీశ్వరుడనియు

వీరేశలింగముగారు వ్రాసిరి. వారి మాటలనే లక్ష్మీరంజనముగారు సైతము విశ్వసించిరి. కాని అవి సత్యములు గావు. చాళుక్య విశ్వేశ్వరుడు రాజమహేంద్రవర పురాధీశ్వరుదు కాదు. అతడు యలమంచిలి తాలూకా పంచధారల ప్రాంత దేశపాలకుడు. అతడు రాజరాజనరేంద్రుని వంశములోనివాడు.

ఆంధ్రభాషలో అలంకార శాస్త్రములను రచించిన వారిలో విన్నకోట పెద్దనయే ప్రథముడు. ఈ గ్రంథమున కేవలము అలంకార విషయములే కాక ఛందోవ్యాకరణ విషయములు కూడ ఉన్నవి. కావ్యాలంకార చూడామణి ఏ అలంకారశాస్త్ర గ్రంథమునకు ననువాదము కాదు. ఆయా సందర్భములందు పెద్దన, దండి 'కావ్యాదర్శము'ను, విద్యానాథుని 'ప్రతాపరుద్ర యశోభూషణము'ను, భానుదత్తుని 'రసమంజరి'ని అనుసరించెను. ఇది యొక స్వతంత్ర గ్రంథమువలె భాసించుచున్నది. కావ్యాలంకార చూడామణి సంపూర్ణ సాహిత్య శాస్త్రగ్రంథము కాకపోయినను మొత్తము మీద దీనివలన ఆంధ్రభాషలో అలంకారశాస్త్ర విషయములు తెలిసికొనదలచిన వారికి గొప్ప మేలు సమకూరెనని చెప్పవచ్చును.

పెద్దన ఉత్తమ కవి. అతడు లక్ష్యములుగా చాళుక్య విశ్వేశ్వర భూపతిని నాయకుని జేసి పద్యములు రచించెను. ఆ పద్యములు ధారాళమైన శయ్యతో కూడి రమణీయ భావములతో నొప్పారుచున్నవి. కవితాశక్తిని గూర్చి పెద్దన చెప్పిన మాటలు పరిశీలనార్హములు.

కం॥ ఛందోలంకారాదుల
పొందెరిగిన, నెద్ది లేకపొసగదు కవితా
సుందరత శక్తియది, యా
కందువఁదగ నెఱుగువాఁడె కవివరుఁడెందున్.

తే॥గీ॥ శక్తి వెలియైన కావ్యోక్తి సాధనంబు
లెల్లఁజీకటి యింటిలో నిడిన సరకు,
లెన్ని ఋతువులు కల్గిన నెట్లు పూచు
మహి వసంతాగమము లేక మావి మోక.

చం॥ వినుత యశంబునన్ గలుగు విశ్రుత నాకనివాస, మయ్యశో
జననము శ్రవ్యకావ్యముల సంగతి నొప్పగు, శ్రవ్య కావ్యమున్
దనరుఁగవి ప్రభావమునఁ, దత్కవి సమ్మతిలేని రాజులే
పున విహరింప, రవ్విభులు పోయిన జాడ లెఱుంగఁబోలునే.

## వేములవాడ భీమకవి

వేములవాడ భీమకవిని గూర్చి కవిసార్వభౌముడగు శ్రీనాథుడు

సీ॥ వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండ లీల నొక్కొక్క మాట

అని చెప్పెను. అట్టి పొగడ్తను పొందిన భీమనను గూర్చి చరిత్ర ఏమియు చెప్పుట లేదు. ఈ కవి చరిత్రాంశములన్నియు ననుమానాస్పదములై వివాదాంశములతో కూడియున్నవి. అవి సత్యములా? కల్పితములా? యను సందేహము కల్గించును. ఇంత అగమ్యగోచరమైన కవిచరిత్ర మింకొకటి లేదు. ఈతని చరిత్రను పరిశీలించిన ఈతడు మంత్రతంత్రములు, మాయమర్మములు నేర్చిన

యైంద్రజాలికుడేమో యనిపించును. ఇతడు తన పద్యములచే మానవాతీత శక్తులుగల దేవాంశ సంభూతుడనని లోకము విశ్వసించునట్లు చేసెను.

భీమన యొక ముగ్ధబాల వితంతువునకు దాక్షారామ భీమేశ్వరుని ప్రభావమున జనించినట్లు ప్రతీతి. అతడే యిట్లు చెప్పికొనెను.

మత్తే॥ ఘనుడన్, వేములవాడ వంశజుఁడ, దక్షారామ భీమేశ నం
దనుడన్, దివ్యవిషామృత ప్రకటనానాకావ్యధుర్యుండ, భీ
మన నా పేరు, వినంగఁజెప్పితిఁ దెలుంగాధీశ! కస్తూరికా
ఘనసారాది సుగంధ వస్తువులు వేగన్ దెచ్చి లాలింపురా!

భీమేశ్వరుని వరప్రసాదముననే యీతనికి నుద్దండకవితాశక్తి యలవడెనట. దక్షారామము తూర్పుగోదావరి మండలముననున్నది. కావున వేములవాడ భీమకవి గోదావరి మండలమువాడని కొందరు చరిత్రకారులనుకొనుచున్నారు. మఱియు తెలంగాణములో కరీంనగర మండలమున వేములవాడయను గ్రామము కలదు. భీమకవి అక్కడివాడని మఱికొందరు చరిత్రకారులు తలంచుచున్నారు. మఱియు చాళుక్యపు చొక్కరాజు రాజరాజ నరేంద్రుని కుమారుదగు కుళోత్తంగుడయ్యేనేని, భీమన చాటుపద్యములలో కానవచ్చు సాహిణిమారడు ద్వితీయ ప్రతాపరుద్రుని సేనాపతిగాక మఱియొకడని యంగీకరించితి మేని భీమకవి క్రీ.శ. 1100 ప్రాంతము వాడగును. మొత్తము మీద చరిత్రకారులు, పండితులు చేసిన పరిశోధనమును బట్టి వేములవాడ భీమకవి క్రీ.శ. పంద్రెండవ శతాబ్దము వాడగుచున్నాడు. కన్నడ బసవపురాణము నాధారముగా చేసికొని కందుకూరి వీరేశలింగముగారు భీమకవి కాలము పదునాల్గవ శతాబ్దమని నిర్ణయించిరి. కాని ఆ నిర్ణయము సరియైనది కాదు.

వేములవాడ భీమకవి రచించిన గ్రంథములేవియు ఇంతవరకు లభింపలేదు. ఇతడు జ్యోతిష గ్రంథమునొకదానిని రచించెనని చెప్పుచున్నారు. దీనికి విస్పష్టమైన ఆధారము లేవియు లేవు.

భీమకవి రాఘవ పాండవీయమను నొక ద్వ్యర్థి కావ్యము రచించినట్లు పింగళి సూరన, అప్పకవి చెప్పిరి. పింగళి సూరన -

ఉ॥ "భీమన తొల్లి చెప్పెనను పెద్దల మాటయె కాని యందు నొం
దేమియు నేయెడన్ నిలుచుటెవ్వరు గానరు..."

అని రాఘవ పాండవీయమున చెప్పెను. ఇక అప్పకవియో తన సహజ స్వభావమును బట్టి యొక కథనల్లెను. భీమన రాఘవ పాండవీయమును రచించి దానిని పరిశీలించుటకై నన్నయభట్టున కిచ్చెననియు, అది ప్రచారమునకు వచ్చినచో తన భారతమునకు ప్రసిద్ధిరాదని నన్నయ దానినణచెననియు, రాఘవ పాండవీయమును నన్నయభట్టు నశింపజేయగా దానికి ప్రతీకారముగా భీమన నన్నయ రచించెనని చెప్పబడు ఆంధ్ర శబ్దచింతామణిని నశింపజేసెననియు వక్కాణించెను. ఇది కేవలము బూటకమనియే చెప్పవలయును. అధర్వణ భారతాదులకెట్టి గతి పట్టియుండునో అట్టి గతియే భీమకవి రాఘవ పాండవీయమునకు పట్టియుండును. ఒక్క రాఘవ పాండవీయముననకే కాదు ఈ భీమకవి కృతములని చెప్పబడు గ్రంథములన్నిటికి కూడ నిట్టి గతి పట్టుట విచారకరమైన విషయము.

భీమన నృసింహపురాణము, శతకంధర రామాయణము రచించినట్లు వీరేశలింగముగారు విశ్వసించిరి. వారే పాల్కురికి సోమనాథుడు రచించిన ద్విపద బసవ పురాణమును వేములవాడ భీమకవి కన్నడ భాషకనువదించెనని సిద్ధాంతీకరించిరి. కాని కన్నడ బసవపురాణకర్త

పితృనామము, భీమకవి తండ్రిపేరు భేదించుచున్నవి. కావున వీరేశలింగముగారి సిద్ధాంతము విశ్వసింపదగినది కాదు.

లక్షణ గ్రంథములందు నుదాహరింపబడిన పద్యములను బట్టి భీమకవి సుమతీ శతకమును, హరవిలాసమును రచియించినట్లు తెలియుచున్నది. కాని ఈనాడు లభించుచున్న యా రెండు గ్రంథములలో లక్షణకర్తలు భీమన పేరనుదహరించిన పద్యములేవియు గానరావు. భీమన కవిజనాశ్రయమును రచించెనని కొందరు పండితులు తలంచిరి. లక్షణకర్తల పద్యమును బట్టి భీమన ఛందశ్శాస్త్రము నొకదానిని రచియించి యుండెనని పండితులెల్లరంగీకరించిరి. అది కవిజనాశ్రయమా యనునదే ప్రశ్నము.

కం॥ జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునన్ జెలువుగ మ
ల్లియరేచన సుకవి జనా
శ్రయుడీ ఛందంబు చెప్పె జనులకు తెలియన్.

అని యొక పద్యము కవిజనాశ్రయములో కలదు. దీనినిబట్టి రేచనయే కవిజనాశ్రయకర్త అని తేలుచున్నది. అతడు సుకవి జనాశ్రయుడగుచే దానికి కవిజనాశ్రయమని పేరువచ్చెనని చెప్పవచ్చును. కవిజనాశ్రయమందచ్చటచ్చట మల్లియ రేచా! యను సంబోధనముకలదు. మల్లియరేచనయే ఆత్మసంబోధనము చేసికొనుచు దీనిని రచించెనేమోయని తోచును. ఇట్లు వ్రాయుట ప్రాచీన కవి సంప్రదాయమే. కాని వేములవాడ భీమకవియే కవిజనాశ్రయమును రచించి ద్రవ్యలోభముచే జైనుడు, వైశ్యుడునగు రేచనపేరుపెట్టెనని పండితులింకను నమ్ముచున్నారు. వారి నమ్మిక హేతుదూరము, అప్రమాణము.

మొత్తము మీద నొక్క కావ్యము గూడ వేములవాడ భీమకవిదని నిశ్చయించుటకు ప్రబల సాక్ష్యమొక్కటియు లభించుట లేదు. భీమకవి ప్రశస్తియంతయు నాతనివని చెప్పబడు చాటువులపై నాధారపడి యున్నది. ఈ చాటువులు భీమకవి తన పద్యములచేతనే ఇతరులను కోపించి శపించుటకును, అనుగ్రహించి దీవించుటకును సమర్థుడని చాటుచున్నవి. అవి భీమన నిస్సందేహముగా మహాకవియనియు ఋజువు చేయుచున్నవి. చొక్క నృపాలుడను వాడొకనాడు ఉద్యానవనములో మల్లెసాల స్తంభము మీద కాలుచాచుకొని కూర్చుండి యచ్చటనున్న భీమకవిని జూచి స్తంభమును వృక్షముగా చేయుమని కోరెనట. అప్పుడు భీమన యొక పద్యము చెప్పి పందిరి గుంజను వృక్షముగా చేసెనట. కాని చొక్కనృపాలుని కాలు వృక్షము లోపల చిక్కువడిపోయెనట. అతడు తన కాలూడదీసికొనలేక మరల నా వృక్షమును మల్లెపందిరి గుంజగా చేయుమని భీమకవిని ప్రార్థించెనట. భీమకవి యొక పద్యము చెప్పి వృక్షమును మల్లెసాల పందిరిగా మార్చెనట. ఆ రెండు పద్యములునివి.

శా॥ ఆనీతాభ్యుపదాన శృంఖల కరాభ్యాలంబిత స్తంభమా
నేనే వేములవాడ భీమకవి నేనిన్ జిత్రకూటంబులో
భూనవ్యాపిత పల్లవోద్భవ మహాపుష్పోపగుచ్ఛంబులన్
నానా పక్వఫలప్రదాయివగుమా నా కల్పవృక్షాకృతిన్.

ఉ॥ శంభువరప్రసాద కవి సంఘవరేణ్యుడనైన నా వచో
గుంభన మాలకించియనుకూలత నొందితనూనభావనన్

గుంభినిఁజొక్కనామ నృపకుంజరు పందిటి మల్లెసాలకున్
స్తంభము రీతి నీ తనువుఁదాలిచి యెప్పటియట్ల యుండుమా.

త్యాగి పోతురాజు భీమకవి గుఱ్ఱమునపహరించెనట. దానిపై కినిసి యతడీ పద్యము చెప్పెను.

చ॥ హయమది సీత, పోత వసుధాధిపుడారయ రావణుండు, ని
శ్చయముగ నేను రాఘవుఁడ, సహ్యజ వారిధి మారుదంజనా
ప్రియ తనయుండు, లచ్చన విభీషణుఁ,డా గుడిమెట్టలంక, నా
జయమును బోత రక్కసుని చావును నేడవనాడు చూడుడీ.

అట్లే భీమకవి కళింగగంగును దర్శింపబోయి కొన్ని పద్యములు చెప్పెను. మొదట కళింగ గంగునకు భీమకవి ద్వారపాలుని ముఖమున నీ క్రింది పద్యము చెప్పి పంపెనట.

కం॥ శాపానుగ్రహ పటువును
జూపాడెడి కవుల నెత్తి జంపంబనగా
భూపాల సభలఁబొజ్యుఁడ
నా పేరే భీముడంద్రు నరవర! వినుమా!

ఈ పద్యమును విన్న కళింగగంగు కార్యాంతర నిమగ్నుడై సందడి తీరిన తరువాత రమ్మని వార్త పంపెనట. భీమకవి యా మాటలకు కోపించి

ఉ॥ వేములవాడ భీమకవి వేగమె చూచి కళింగగంగు తా
సామము మాని కోపమున సందడి దీరిని రమ్ముపొమ్మనెను
మోమును జూడ దోషమిక ముప్పదిరెండు దినంబులావలన్
జామున కర్థమందతని సంపద శత్రులఁజేరుగావుతన్.

ఆ సందర్భముననే భీమకవి కళింగ గంగుని కరుణించి యీ క్రింది రెండు పద్యములు చెప్పెనట.

చ॥ బిసరుహగర్భు వ్రాతయును, విష్ణుని చక్రము, వజ్రివజ్రమున్
దెసలను రామబాణము యుధిష్ఠిరు కోపము, మౌని శాపమున్
మసకపుఁబాముకాటును, గుమారుని శక్తియుఁ, గాలు దండమున్
బశుపతి కంటిమంటలును, బండిత వాక్యము రిత్తవోవునే.

ఉ॥ వేయి గజంబులుండఁబదివేల తురంగములుండ నాజిలో
రాయలగెల్చి సజ్జనగరంబునఁబట్టము కట్టుకోవడిన్
రాయ కళింగ గంగ! కవిరాజు భయంకర మూర్తిచూడఁదా
బోయిన మీన మాసమునఁబున్నమ పోయిన షష్ఠి నాటికిన్.

## నాచన సోమన

నాచన సోమనాథుడను పేరుగల ఈ మహాకవి ఉత్తర హరివంశమును రచించెను. విజయనగర సామ్రాజ్య స్థాపకులలో నొకడగు బుక్కరాయలు క్రీ.శ. 1344లో పినాకినీ తీరముననున్న 'పెంచుకల దిన్నె' యను గ్రామమును అగ్రహారముగా నాచన సోమనకిచ్చెను. ఈ గ్రామమునకు

బుక్కరాయపురమను నామాంతరము గలదు. బుక్కరాయలు క్రీ.శ. 1355-1377 నడుమ విజయనగర సామ్రాజ్యమునేలెను. అన్నయగు హరిహరరాయలు సార్వభౌముడు కాగా బుక్కరాయలు యువరాజుగా నుండెను. యువరాజుగా నున్నప్పుడే అతడు నాచన సోమనకు 'పెంచుకల దిన్నె' గ్రామమును ధారపోసెను. ఈ కారణములచే నాచన సోముడు క్రీ.శ. 1344 ప్రాంతము వాడని విశ్వసింపవచ్చును. కాన నీతడించుమించుగా ఎఱ్ఱనకు సమకాలికుడగును. లక్ష్మీరంజనముగారు నాచన సోముడు క్రీ.శ. 1370 ప్రాంతముననను అంతకు కొంచెము ముందుగను కూడ ఉండి యుండునని నిర్ణయించిరి.

నాచన సోముడు ఉత్తర హరివంశమున అశ్వాసాంత గద్యలో "ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీ మహాభారత కథానంతరంబున శ్రీమత్సకలభాషాభూషణ సాహిత్య రస పోషణ సంవిధాన చక్రవర్తి సంపూర్ణ కీర్తి నవీనగుణ సనాథ! నాచన సోమనాథ ప్రణీతంబయిన యుత్తర హరివంశంబు" అని చెప్పికొనెను. పెంచుకలదిన్నె శాసనమును బట్టి, ఉత్తర హరివంశమును బట్టి నాచన సోముడు సకలాగమవేదియనియు, అష్టాదశ పురాణాభిజ్ఞార్థవేది యనియు, అష్టభాషా కవిత్వశ్రీయుతుడనియు, సకల భాషాభూషణుడనియు, సాహిత్యరసపోషణుడనియు, సంవిధాన చక్రవర్తియనియు, సంపూర్ణ కీర్తియనియు, నవీన గుణ సనాథుడనియు తెలియుచున్నది.

ఇట్టి నాచన సోముడు రచించిన గ్రంథములు మూడు కలవు. 1) ఉత్తర హరివంశము, 2) ఆది పురాణము లేక ఆదిత్య పురాణము, 3) వసంత విలాసము. ఈ మూడిటిలోను ఉత్తర హరివంశమే నేడు లభించుచున్నది. మిగిలిన రెండు గ్రంథముల నుండి లాక్షణికులు, సంకలన కర్తలు పద్యములనుదాహరించిరి. కాని యవి కాలగర్భమున కలసినవి.

ఎఱ్ఱాప్రెగ్గడ ఖిలపురాణమనదగు హరివంశమును సంపూర్ణముగా తెలిగించెను. ఆ హరివంశమున పూర్వభాగమనియు, ఉత్తరభాగమనియు విభజనము కలదు. సోమన రచించిన యుత్తర హరివంశమే లభించినది కదా. అతడు పూర్వ హరివంశమును కూడ రచించెనని భావించిన విమర్శకులు కొందరు కలరు. కాని ఉత్తర హరివంశమును బట్టి చూచినచో నతడు హరివంశమును సంపూర్ణముగా రచించెనని చెప్పజాలము. విచిత్రమేమనగా ఉత్తర హరివంశమునకు నవతారిక లేదు. కావుననే విమర్శకులు కొందరు సోమన పూర్వ హరివంశమును రచించెననియు దానికవతారిక వ్రాసియుండుననియు నూహించుటకవకాశము కల్గినది.

హరివంశమును సంపూర్ణముగా తెలిగించుట నాచన సోముని లక్ష్యము కాదు. సంస్కృత హరివంశమునందలి రసవత్తరమైన కథలను స్వీకరించి మహాప్రబంధమును రచించెను. కావున సోముడు దానికి నుత్తర హరివంశమని పేరు పెట్టెను. ఉత్తర రామచరితమను నామమెట్టిదో యుత్తర హరివంశమను నామము కూడ నట్టిదే.

ఉత్తర హరివంశములో ఆఱాశ్వాసములు గలవు. ప్రథమాశ్వాసమున నరకాసుర వధ, ద్వితీయాశ్వాసమున విప్రకుమార రక్షణ, రుక్మిణీ పుత్రదానము, కృష్ణ తపోయాత్ర, ఘంటాకర్ణ వృత్తాంతము, తృతీయాశ్వాసమున హంసడింభకోపాఖ్యానము, పంచషష్ఠాశ్వాసములలో బాణాసుర వృత్తాంతము, ఉషా పరిణయము వర్ణింపబడినవి. ఇది చంపూకావ్యము. నాచన సోముడు తిక్కన వలెనే తన కావ్యమును హరిహరనాథున కంకితము కావించెను.

నాచన సోముడు కవిత్రయము కంటె గొప్పవాడని భావించినవారు కొందరున్నారు. చిన్నయసూరి తన నీతిచంద్రికలో నాచన సోముని "అలికంబున యక్షిని దాచినట్టి సర్వజ్ఞు" డని పొగడెను.

సూరి శిష్యుడగు బహుజనపల్లి సీతారామాచార్యులవారు తమ "ఆంధ్ర శబ్ద రత్నాకరము"న సోముని హరివంశము సమగ్రముగాc జిక్కకపోయినను, జిక్కినంతమట్టు పరికించి చూడగా నది మిక్కిలి ప్రౌఢముగాను, భారతము కంటె నెల్ల విధముల విశేషించినదిగాను గానంబడుచున్నది. ఇతనిని సర్వజ్ఞుడందురు. అట్లనుటకు సందేహింపcబని లేదు" అని వ్రాసిరి. ఇక కందుకూరి వీరేశలింగముగారు తమ 'ఆంధ్ర కవుల చరిత్ర' లో "సోమనాథుని కవిత్వము మిక్కిలి ప్రౌఢముగాను సర్వవిధముల నెఱ్ఱాప్రెగ్గడ కవిత్వము కంటె మేలైనదిగా నున్నది. ఒక్క ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వమే కాదు, భారతమును రచించిన కవిత్రయములో ననేకుల కవిత్వమును గొన్ని విషయములలో సోముని కవిత్వముతో సరిరాదని నాయభిప్రాయము. ఇతని కవిత్వ పటుత్వ సంపదను బట్టి యీతనికి సర్వజ్ఞుడని బిరుదు పేరు వచ్చినది. ఆ పేరున కితడు తప్పక తగినవాడే" అని వ్రాసిరి. ఈ ముప్వుర పొగడ్తలు పొందిన నాచన సోముని కవిత్వమంత ఉత్తమజాతికి చేరదని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ఋజువు చేసిరి. వీరు కవిత్వనిరూపణము ననుసరించి ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వమే సోమనాథుని కవిత్వము కంటె మేలైనదని నిర్ణయించిరి. రసగ్రహణపారీణులు రాళ్ళపల్లి వారి వాదము సహేతుకమని యంగీకరించిరి. కాని నడకుదుటి వీరరాజు పంతులుగారు అకారణముగా ఎఱ్ఱనపై ద్వేషబుద్ధి పెంచుకొని ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వము హీనమైనదని వ్రాసిరి. కాని ఆ వాదమును లోకము హర్షింపలేదు.

నాచన సోముదు తన కవిత్వమును గూర్చి చెప్పికొనిన మాటలను బట్టియే అతని కావ్యశిల్పము నెఱుగవలయును. అతడాశ్వాసాంతగద్యలో తన్నుగూర్చి నవీన గుణసనాథుడనని చెప్పికొనెను. నవీన గుణసనాథుడనగా నవీన గుణములతో కూడినవాడని యర్థము. ఈ నవీన గుణములతని వ్యక్తిత్వమునకు గాక యతని కావ్యమునకే సంబంధించిన వని చెప్పవలయును. అతడు వ్యక్తిగత జీవితమునందే యే నవీన గుణములలవరచుకొనెనో మనకు తెలియదు. అతని కవిత్వమునందు మాత్రము అతనికంటె పూర్వమున నున్న కవులలో కానరాని కొన్ని నవీనగుణములు మనకు కనబడుచున్నవి. సోముని కంటె ప్రాచీనులగు కవులలో మనకు ముఖ్యముగా కానవచ్చువారు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, పాల్కురికి సోమనాథుడు, నన్నెచోడుడు. ఆ ప్రాచీన కవులలో లేని, సోముని యందునున్న నవీన కవితా గుణములను పరిశీలించుటకు ముందు కవితా కళయందు సామాన్యముగా కనబడు గుణముల స్వరూపమును తెలిసికొనవలయును.

కవిత్వము నందు ప్రధానముగా నుండెడు తత్త్వములు రెండు. 1) భావము, 2) వస్తువు. ప్రేమకోపాదులు భావములు. ప్రకృతియందు కానవచ్చు వివిధ పదార్థములు వస్తువులు. భావములు మన మనస్సునందు పుట్టక యున్నప్పుడు, వస్తువు మన యెదుట లేని యపుడు వానిననుభవించునట్లు చేయుట, వీనిని సాక్షాత్కరించునట్లు చేయుట కవి ప్రతిభకు తార్కాణము. భావము, వస్తువు అను రెంటిలో మనుష్యుడు వస్తువు కంటె నెక్కువగా భావములకు లోబడి పరవశించుచున్నాడు. ఏలయన భావములు ప్రాణిధర్మములు. ప్రాణులలో నుత్తమోత్తముడగు మానవునకు భావములు ముఖ్య ధర్మములైనవి. ఆ భావము లెక్కడ కానవచ్చినను అతడు వానిని సులభముగా గ్రహించి అనుభవింపగలడు. భావ వస్తువులకు తోడుగా కవిత్వమునందు మూడవ తత్త్వము కలదు. అదియే రచన. భావములను వెల్లడించుటకు, వస్తువులను వర్ణించుటకు కవి ఉపయోగించు వాక్యముల యందలి పదములు, ఆ పదముల కూర్పు, ఛందస్సు మొదలగువాని సముదాయ స్వరూపమే రచన. ఉత్తమ కవితాకళ భావప్రధానము. దానికి వస్తువు లోపడి యుండును. భావ వస్తువులకు రచన లోపడి యుండును. భావమెంత తీవ్రముగా, సూక్ష్మముగా నున్న మనకునంత యానందము కలుగును. వస్తువెంత సహజముగా,

విపులముగా వర్ణింపబడిననంత తృప్తి కలుగును. రచన యెంత అపురూపముగా, కష్టముగా నున్న మనకునంత యాశ్చర్యము కలుగును.

ఆంధ్రసాహిత్యము ప్రారంభమగునాటికి సంస్కృత సాహిత్యము సర్వతోముఖముగా నభివృద్ధి చెందినది. అది యప్పటికే భావము, వస్తువు, రచన అను మూడు దశలను దాటినది. ఆంధ్రసాహిత్యము ప్రారంభమగు సరికి సంస్కృత సాహిత్యములో భావ వస్తు కళలు వెనుకబడి రచనాకళ ఎక్కువ వ్యాప్తిలో నుండెను. కావున తెలుగు కవులు భావవస్తువుల రెంటి నుపేక్షించి రచనా కళకే ప్రాధాన్యమిచ్చునవకాశము కల్గినది. నన్నయాదులు పురాణేతిహాసములను తెలిగించుటకు పూనిరి కావున వారిలో భావకళయే ప్రధానముగా నున్నది. నన్నెచోడునిలో భావకళ కంటె వస్తుకళ మించినది గాని రచనా కళ ముందునకు రాలేదు. ఇక నాచన సోమనాథుడో సంస్కృతమున గొప్ప పండితుడగుటచే అందలి ప్రాచీనమైన భావకళను వదలి వస్తుకళను కొంత వరకు రచనా కళ నధికముగా నాంధ్రభాషలో నెక్కువ ప్రచారమునకు తీసికొనిరాగా ప్రయత్నించి తరువాతి వారికి మార్గదర్శకుడయ్యెను. ఇదియే అతని కవితా మూలతత్త్వము. ఇదియే ఆతని నవీన గుణ సనాథబిరుదమునకు మూలము.

సోమన తిక్కన వంటి భావకళాచక్రవర్తిని గురువుగా భావించెను. ఆతని దైవతమగు హరహరనాథునకే తన కావ్యము నంకితము గావించెను. ఆశ్వాసాంత గద్యలలో నా మహనీయుని పేరుచెప్పి తరువాత తన పేరు చెప్పుకొనెను. ఇంత చేసియు నతడు భావకళకు ప్రయత్నించినవాడు కాడు. ప్రయత్నించియే యున్నచో తిక్కనయంతటి వాడయి యుండునని యూహించుటకు తనగి ఘట్టము లక్కడక్కడ ఉత్తర హరివంశములో కలవు. హంసడింభకులు దుర్వాసునవమానించిరి. అతడు శ్రీకృష్ణునొనద్దకు బోయి వారు పాడుచేసిన కమండలువు మొదలగు వస్తువులు చూపి యిట్లు వాపోయెను.

సీ॥ ఈ కమండలు పంక్తి నెటు చూతు, నిట్ల త
త్పాప మస్తంబులు పగులకున్న
నీ దండ నివహంబు నెటు చూతు, నిట్ల త
ద్దూర్త హస్తంబులు తునియకున్న
నీ వల్కల వ్రాత మెటు చూతు, నిట్ల త
త్కపట చర్మంబులు కాలకున్న
నీ శిఖ్య సముదాయమెటు చూతు, నిట్ల త
ద్వేషణాంత్రంబులు త్రెవ్వకున్న.

తే॥గీ॥ నకట మోమోట లేక, తారంత చేసి
బ్రదికి పోయిరె, పులి పేదవడినఁబసుల
వాండ్రె యెక్కాడి రను కత వచ్చె నాకు
మునుల లోపల నాలుక ముల్లు విఱిగె.

హంసుడు మరణించినపుడు డిభకుడు వర్ణించిన తీరును సోమన భావకళా ప్రధానముగా వర్ణించెను. కాని యుత్తర హరివంశములో నిట్టి సన్నివేశములు అరుదుగా కన్పట్టును.

భావములతో నెక్కువ సంబంధము లేకున్నను సోముడు వర్ణించు వస్తువులు చాలసత్యములనిపించి మనకు తృప్తి కలిగింపగలవు. వస్తువుల యొక్క అంగములలో ఒకటి రెండు మాత్రమే వర్ణించి సోమన తృప్తిపడడు. ఆ వస్తువుల సర్వాంగములను వర్ణించి మన హృదయముల యందు ముద్రపడునట్లు చెప్పు శక్తి సోమనకు విరివిగా కలదు.

సీ॥ వికృతాననంబులు, విరళ దంతంబులు
నిడుపైన దవడలు నిక్కు మెడలు

అనుచు నతడు పిశాచద్వయమును వర్ణించిన తీరు దీనికి తార్కాణము. ఇట్లే కోటను ముట్టడించుట, గదాయుద్ధము, జూదము మొదలగువానిని వర్ణించునపుడందలి సర్వాంగములను సాధ్యమైనంతవరకు వివరించి చూపును.

ఒక్కొక్కసారి సోముడేదేని ఒక భావమును వెల్లడించుటకు నర్థమును కల్పింపవలసి వచ్చినప్పుడు దానినెన్ని విధముల సాధ్యమో యన్ని విధముల కల్పించును. ఆ యర్థమును తెల్పుట కెన్ని పదములుపయోగింప వలయునో అన్ని పదములుపయోగించును. దీనివలన సంగ్రహముగా నుండదగిన రచన విస్తృతి గాంచును. శ్రీకృష్ణుడు పాంచజన్యమును పూరించెను. దాని ధ్వనికి ప్రపంచమంతయు తల్లడిల్లెను. దానిని సోముడెంతయో విస్తరించి

సీ॥ వడకు పన్నగరాజు పడగలమీద, స
ర్వంసహాకాంత పేరణము చూప
నుఱ్ఱూతలూగెడు నుదయాస్తగిరులతో
నాకాశలక్ష్మి కోలాటమాడ

అను సీసపద్యములో వర్ణించెను. అల్పాక్షరములతో ననల్పార్థ రచన చేయుట ఉద్ధతుడగు నాచన సోముడెఱుగడు.

ఒక భావము తీవ్రముగా పాఠకుల మనస్సులలో నాటించుటకు నొక యర్థము చాలదు. అనేకములు కావలయును. ఇది మొదటి నుండియు కవులందరు గమనించిన కళారహస్యమే. కాని ప్రాచీనులలో భావమునకు అర్థరచన లోబడినది. తరువాతి వారిలో అర్థ రచనకు భావము లోబడినది. అర్థము నందువలెనే శబ్దము నందును సోమన మితిమీరి పోయెను. ఉదా॥ "ఇట్లు గదా విహారమున, హంస హలధరులు రుధిరధారాసారంబునన్ దడిసి, చెడక, వారింపక, యోసరిలక, యోలంబు గొనక, పంకింపక, పాదుకొనక..."

ఇక పద్యరచనలో సోముడు చూపిన గుణములకు లెక్కలేదు. అతడు కేవల మొక్కొక్క చోట ధారాళమైన శయ్యకిచ్చిన ప్రాధాన్యము భావమున కిచ్చుటలేదా యనిపించును.

మత్తే॥ "గనయంబున్ గొనయంబు నెన్నెదుముతో కర్ణావతంసంబుతోఁ
జనుదోయిన్ గనుదోయి సాయకముతో సంధానహస్తంబుతో"

చెప్పవలసిన మాటలెల్ల సాధ్యమైనంతవరకు చమత్కారముగ చెప్పుటయను నవీన గుణము సోమనాథునిలో నధికము.

తే॥గీ॥ తలఁపునకుఁజిక్కనుండెడు తలఁపులేదు
లజ్జపోఁద్రోవ లజ్జకు లజ్జలేదు

సీ॥ అభ్రంకషంబయిన యాలపోతునితండు
త్రుంచినాడీతడు పెంచినాడు

సీ॥ కుజము కుంజరముచే కూలునో కూలదో
కూలు కుంజరము నీ కుజము కూల్చె

57

సీ॥ పన్నగంబుల రాజు పగవాడు కూడి నీ
శయనంబు పయనంబు సంతరింప

శబ్ద రచనలో సోముడు పలుతెఱగుల పనితనమును చూపెను. అనుప్రాసములు, అంత్యప్రాసములు ఈతని కందుకున్నట్లు చేతికి జిక్కును. ఒక్కొక్కసారి యమకమున్న దున్నట్లుగా వచ్చి చోటుచేసికొనును. పద్యమందును, గద్యమందును జంటజంటలుగా ఏకనాదములు గల పదములు దొరలుచుండును.

కం॥ ద్విరదంబులు, నరదంబులు
హరులు నరులు నిక్కునుక్కు నలవున్ నెలవున్

వ॥ శరంబులు రాలినను శిరంబులు వంపక, కుంతంబులు పడినను పంతంబులు వదలక, ప్రాసంబులు వెడలినను రోసంబులు సడలక...

సోముడు పద్యములందు కంటె గద్యములందు నెక్కువగా శ్లేషలను ప్రయోగించెను. ఆశు, బంధ, గర్భ, చిత్ర కవిత్వములను చతుర్విధకవితలందురు. సోముడు చిత్ర కవిత్వమును చెప్పక పోలేదు. ఉత్తరహరివంశమున నిరోష్ఠ్యపద్యమొకటి కలదు.

చం॥ చని చని కాంచెనంత ఋషి సంహతి సారసకేసరాంతరా
సన సరసాళి సంగఁదట చందనశాఖి చలత్తరంగఁ గాం
చన సరసీ జలార్ద్రయతి సంచిత సైకతలింగ, గంగ, నం
జనగిరి గాధ గంధగజ సంగత శృంగరథాంగ నత్తతిన్.

ఈ విధముగా నాచన సోమునిది భావ ప్రాధాన్యము లేక వస్తువు, రచన అనువానికి చేరిన కళ. ఆ కాలమున తెలుగు సాహిత్యమునకిది నవీనము. రసానందము నిచ్చు శక్తి లేకున్నను తృప్తిని, ఆశ్చర్యమును కలిగించు మనలనుల్లాసపఱచు సామర్థ్యము దీనికి గలదు. ఇది మనుష్యులభినయించు నాటకము కాదు. మఱి కొయ్యబొమ్మల యాట. దీనికి లోబడనివాడు లేడు. కాని నిదానముగా యోజించినపుడింతకంటె మంచి కళ కలదని తలపని వాడును లేడు.

## ఎఱ్ఱన - సోమన

ఇప్పటివరకు లభించిన సాక్ష్యమును బట్టి ఎఱ్ఱన సోమనలిరువురును సమకాలికులని చెప్పవచ్చును. ఎఱ్ఱన లక్ష్యము సంపూర్ణ మహాభారతమును తెలుగువారి కందిచ్చుట. ఆ లక్ష్యసిద్ధికై యాతడు ఆరణ్యపర్వశేషమును పూర్తిచేసెను. ఖిల పురాణమనదగు హరివంశమును తెలిగించెను. హరివంశమును చేర్చిన గాని భారతము మహాభారతము కాదు. నాచన సోముడు హరివంశమును సంపూర్ణముగా తెలిగింపలేదు. హరివంశ పురాణములో నక్కరకు రాని నీరస సందర్భములనన్నింటిని వదలివైచి రసభావములు గల ఘట్టములను స్వీకరించి వానిని రసమయములుగా నిర్వహించి యతడు ఉత్తర హరివంశమును రచించెను. ఉత్తర హరివంశమునైనను సమగ్రముగా వ్రాయుట సోమన లక్ష్యము కాదు. శ్రీకృష్ణుని కృత్యములను మాత్రము వర్ణించుటయే అతని లక్ష్యము. ఆ శ్రీకృష్ణుని కృత్యములందును రసపోషణ సంవిధానమున కనువగు భాగములను మాత్రమే సోముడు స్వీకరించెను. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశములో హంసడింభకుల సంహారమును గూర్చి సూచనయే లేదు. నాచన సోముడీ కథను ప్రత్యేకముగా నొక యాశ్వాసమున విపులముగా వ్రాసెను. ఈ విధముగా నుత్తర హరివంశములో నన్నియు రసవంతములగు ఘట్టములే. ఎఱ్ఱన హరివంశములో రసవద్భాగములతో పాటు నీరస

భాగములు కలవు. వంశావళి, స్తోత్రములు, ధర్మములు మొదలగు చప్పిడి విషయములతో పాటు రసవద్ఘట్టములను కూడ ఎఱ్ఱనకు వ్రాయక తప్పలేదు. దీనినిబట్టి హరివంశమునకు, సోమన ఉత్తర హరివంశమునకు విషయ వ్యత్యాసమెంతయో కలదని తెలియుచున్నది.

ఎఱ్ఱన కవితా మార్గము సహజ సుందరము. శబ్దాడంబరము, సమాస బాహుళ్యము, క్లిష్టాన్వయము మున్నగునవి దానిలో నుండవు. శైలి ద్రాక్షాపాకము. సోముని కావ్యమో యొక మహా ప్రబంధము. ఉత్తర హరివంశము శ్లేషయమకాది శబ్దార్థాలంకార పూర్ణమై వక్రోక్తిమయమై యుండును. ఎఱ్ఱన సంగ్రహముగా వ్రాసిన భాగములను సోమన పెంచి వ్రాయును. ఊర్వశీ నరకాసుర ఘట్టమును ప్రబంధ పరమేశ్వరుడు రెండు పద్యములలో ముగింపగా సాహిత్యరసపోషణ సంవిధాన చక్రవర్తియగు సోమన దానినిరువది యాఱు పద్యములకు పెంచెను.

భావములను ప్రకటించుటకు ఎఱ్ఱన కేవలము సహజమైన సరళమార్గముననే పోవును. ఆయన ఏ విషయముననైన నిర్వక్రముగా నిదానముగా నూహించును. సోమనాథుడు భావములను తళుకుబెళుకులతో చమత్కారముగా ప్రకటించును. అతడు వానిని సహజసుందరముగా వెల్లడింపడు. సోముడు నాగరిక కవి. నగరవాసులకు, పల్లీయులకు గల తారతమ్యము సోమన, ఎఱ్ఱనలకు గలదు. స్వచ్ఛమై, స్వాభావికపుష్టి కృత్రిమ లక్షణములించుకైనను సోకనిది ఎఱ్ఱన కవిత్వము. సహజములైన భావములను కావ్యాలంకారభూషణములచే పోషించి సోముడు చమత్కారమును కల్గించును.

ఎఱ్ఱన హరివంశము మొత్తము తెనిగించుటచే నందు కొన్నిచోట్ల అతినీరసములైన ఘట్టములు కలవు. వానిని గతిలేక వ్రాయవలసివచ్చెనే యని ఎఱ్ఱన వ్రాసెను. కాని యెక్కడ వర్ణింపబడు విషయమునకు, నతనికి మానసిక సంబంధము కలదో యా ఘట్టము నాతనివలె ధారాళముగ తీక్ష్ణముగ వ్రాయగలవారరుదు. సోమునకు గూడ నట్టి రసపోషణ శక్తి కలదనుటలో సందేహము లేదు. కాని యతడాశక్తి నుపయోగించుకున్నవాడు కాదు. అతని కాలముననకే సంస్కృతవాఙ్మయమున మాఘుడు, బాణుడు, సుబంధుడు మొదలగువారు కల్పనా ప్రధానమైన యాలంకారిక శబ్దార్థరచనతో కావ్యములు రచించిరి. సోముడా రచనకు దాసుడయ్యెను. కాని రామరాజభూషణుని వంటి వారి మాదిరిగా దానికి పూర్తిగా లొంగలేదు. అందుచేతనే అతని హరివంశము రసికుల నాకర్షించుచున్నది.

కవితాకళ సత్త్వరజస్సుల లీల. జగత్సృష్టికి రజోగుణము కారణము కాగా, సత్త్వగుణము దాని మర్యాదాపాలనమునకు కారణము. అట్లే కవితాసృష్టికి రజస్సు, దాని మర్యాదాపాలనమునకు సత్త్వగుణము కారణములగుచున్నవి. ఆవేశము, తీక్ష్ణత మొదలగు కవితా గుణములు రజోగుణము వలన విజృంభించుచుండగా వాని మాలిన్యమును క్షాళనమొనర్చి సముచితస్థానమును మీరనీయకుండ నానందము కలిగించునది సత్త్వగుణము. ఎవని కవిత్వమున నీ సత్త్వగుణము లేదో, వాని దెంతయుజ్వల రచన యైనను అనౌచిత్యమునకు వశమగుచునే యుండును. ఈ ధర్మమును బట్టి చూచినచో ఎఱ్ఱన కవితలోగల సత్వశుద్ధి సోమన కవితలో లేదు. సోమన భావావేశము విశృంఖల విహార మొనర్చుచుండగా ఎఱ్ఱన భావము సత్వగుణముతో తన వక్రోక్తి వలనను, చమత్కారార్థము వలనను పాఠకుల హృదయములను ఆశ్చర్యచకితమొనచ్చును. ప్రశాంతమైన రససిద్ధి కలిగించి తన్మయులను జేయు శక్తి యతని కవిత్వమున లేదు. పారవశ్యమునకు సోమన కవిత్వమునకు పొత్తు లేదు. ఆ పరమానుభూతి ఎఱ్ఱన సుకరముగా కలిగించును. కాని ఎఱ్ఱన కవిత్వమున గలుగు పారవశ్యము అక్కడక్కడ కొన్ని ఘట్టములలోనే సంభవించుచుండగా సోమన కల్గించు నాశ్చర్యము ప్రతిపదమున గోచరించును. దీనికి వారిరువురు స్వీకరించిన ఇతివృత్తముల తీరే కారణము.

శృంగార రసాధిదేవత ఎఱ్ఱనకు వలె సోమునకు స్వస్వరూపముతో కానరాలేదు. దాంపత్యమును పరమ పవిత్రముగా నొనర్చు ప్రణయ వాత్సల్య, దాస్య, సాహచర్యాది మధుర కోమల భావములు శృంగార కవులందరు నెఱుంగరు. కాళిదాసు భవభూతుల వంటి జగదేక కవులకే ఆ పవిత్రమూర్తి గోచరించెను. తక్కిన లోకసామాన్య కవులకు శృంగారమనగా నాయికానాయకుల శరీర సంయోగమే కాని వేఱు కాదు. ఎఱ్ఱన యా జగదేక కవుల వర్గమున చేరును. సోమన లోకసామాన్య కవుల వర్గములో చేరును. ఎఱ్ఱన శృంగారమునకు ప్రేమ బీజము. సోమన శృంగారమునకు కామము బీజమని నిస్సందేహముగా చెప్పవచ్చును. సోమన నాగరిక మర్యాదలెరిగిన మేటి. ఎఱ్ఱన సమగ్రముగా నెరిగినది పల్లీయుల భాష, జీవితము. గోకులమును మిషగా గైకొని ఎఱ్ఱన చిత్రించిన నిరాడంబర గ్రామీణ జీవితము ముగ్ధమనోహరముగా నున్నది. యుద్ధాదులను వర్ణించునపుడు సోమనదే పైచేయి. కాని సందర్భోచితమును, ప్రసన్నమును, రసమయమునగునట్లు కథను నడుపు నేర్పు సోమనకు లేదు. అతని భాష కూడ కంటకశిలా ప్రదేశములలో ప్రవహించు ఝరీవేగమున పరుగిడును గాని, ప్రసన్నగంభీరముగా నడవదు. సోమన భారతము వ్రాయవలసి వచ్చుచో యుద్ధ పంచకమున కొన్ని ఘట్టములను వ్రాయగలడేమో కాని తిక్కన వలె తుది పర్వములను, ఎఱ్ఱనవలె నారణ్యపర్వమును వ్రాయలేడు. ఆ రచన కావశ్యకమైన నిగ్రహమే యాతని చిత్తమునకు లేదు. సంస్కృతమున వ్యాసవాల్మీకి కాళిదాసాది మహాకవులకును, నైషధాది కావ్యకర్తలకును ఏ భేదము కలదో ఆ భేదమే తెలుగులో కవిత్రయము వారికినితర ప్రబంధ కర్తలకు కలదు.

## రావిపాటి త్రిపురాంతకుడు

రావిపాటి త్రిపురాంతకుని వాడుక పేరు తిప్పన్న. ఆంధ్ర కవులలో నీతని చరిత్రము బహు సులభముగా వ్రాయవచ్చును. ఏలయన ఇతని పేరు తప్ప తలిదండ్రుల పేర్లు గాని, కులగోత్ర విద్యా విషయములు గాని తెలియవు. త్రిపురాంతకుని కృతులు సంపూర్ణముగా దొరకినచో నాతని చరిత్ర కొంత తెలియునేమో. కాని యాతని గ్రంథములయందలి కొన్ని పద్యములు మాత్రమే నేడు లభించుచున్నవి. తిప్పన్న రచించిన త్రిపురాంతకోదాహరణము సమగ్రముగా లభించుచున్నది. దానిని మానవల్లి రామకృష్ణకవిగారు క్రీ.శ. 1912 వ సంవత్సరమున వెల్లడించిరి.

శ్రీ రామకృష్ణ కవిగారు త్రిపురాంతకుడు ద్వితీయ ప్రతాపరుద్రుని కాలము వాడని వ్రాసిరి. త్రిపురాంతకుడను కవి ద్వితీయ ప్రతాపరుద్రుని యాస్థానమున నున్నట్లు ప్రతాప చరిత్రమున కలదు. కాకతీయ చక్రవర్తులలో కడపటి వాడగు నీ ప్రతాపరుద్రుడు క్రీ.శ. 1295 నుండి 1326 వరకు తెలుగునాటి నేలెను. కావుననే త్రిపురాంతకుడు ఆ కాలము వాడు కావలెను.

కాని దీనికొక ప్రతిబంధము కలదు. అప్పకవి అనుస్వారసంబంధ యతి కుదాహరణముగా మ॥ "సరిబే సైరిపుడేల భాస్కరులు భాషానాథ" అను పద్యము నుదాహరించెను. ఈ పద్యము మహాదాతయగు రాయన భాస్కరునకు సంబంధించినది. ఇది త్రిపురాంతకునిదని అప్పకవి చెప్పెను. రాయన భాస్కరుడు క్రీ.శ. 1386 సంవత్సర ప్రాంతమున రాజమహేంద్రవరమును పరిపాలించిన కాటయవేమారెడ్డి ఆస్థానమున నుండినవాడు. రాయని భాస్కరుని స్తుతించిన త్రిపురాంతకుడు క్రీ.శ. 1380 ప్రాంతము వాడు కావలెను. ఇదియే సమంజసము. ఏలయన శ్రీనాథమహాకవి రచితమై వల్లభరాయని కృతిగా పేర్వెలసిన క్రీడాభిరామము నందు త్రిపురాంతకుని ప్రశంస కలదు.

ఉ॥ నన్నయ భట్టు, తిక్కకవినాయకుఁడన్న, హుళక్కిభాస్కరుం
దన్నను, జిమ్మపూడి యమరాధిపుఁడన్నను, సత్కవీశ్వరుల్
నెన్నుదుటన్ గరాంజలులు నింతురు "జే" యని, రావిపాటితి
ప్పన్నయు నంతవాడ తగునాయిటు దోసపు మాటలాడగన్.

త్రిపురాంతకుడు సంస్కృతమున 'ప్రేమాభిరామము'ను రచించెను. ఆంధ్రమున అంబికా శతకము, చంద్రతారావళి, మదన విజయము, త్రిపురాంతకోదాహరణమునను కావ్యములను రచించెను. వీనిలో నొక్క త్రిపురాంతకోదాహరణమే సమగ్రముగా లభించినది.

ప్రేమాభిరామము లభింపలేదు. కాని పెదకోమటి వేమారెడ్డి రచించిన ప్రేమాభిరామము నందలి రెండు శ్లోకములుదాహరింపబడినవి. శ్రీనాథుడు ప్రేమాభిరామమును క్రీడాభిరామముగా ననువదించి వినుకొండ వల్లభరాయని పేరుబెట్టెను. క్రీడాభిరామములో ఇప్పుడు లభించుచున్న ప్రేమాభిరామ శ్లోకముల కనువాదములగు పద్యములు రెండు కలవు.

తిప్పన రచించిన అంబికా శతకము సంపూర్ణముగా లభింపలేదు. ప్రాచీన సంకలన గ్రంథములలో నీ శతకము నందలి యేడు పద్యములు ఉదాహరింపబడినవి. ఈ శతకమున పార్వతీనాయికాగుణ వర్ణనాదులు రసజ్ఞుల కింపుగా మృదుమధుర భాషతో కూర్పబడినవి. ఉత్తమ దేవతలైనను అంబికా శివుల పరస్పర శృంగార రసోన్నతి వర్ణింపబడినది గాని ధ్వనికారుల మతమున రసాభాసమనునది యెచ్చటను కానరాదు.

ఉ॥ లాచి పరాంగనల్ వరవిలాస మనోహర విభ్రమంబులన్
జూచినఁజూడ దుత్తముఁడు, చూచినఁజూచును మధ్యముండు, తాఁ
జూచినఁజూడకుండినను జూచు కనిష్ఠుడు, నన్ను వీరిలోఁ
జూచినఁజూడకుండు గుటిఁజూచిన చూపున చూడు మంబికా!

ఇరువదేడు పద్యములు గల కావ్యమును 'తారావళి' అను కావ్యభేదముగా ప్రాచీనులు గుర్తించిరి. త్రిపురాంతకుడు చంద్రతారావళిని రచించెను. అతడు రచించిన ఇరువదేడు పద్యములలో నాలుగు మాత్రమే లభించినవి. అవి చంద్రుని గూర్చి రోహిణీ వల్లభా! యను మకుటముతో సంస్కృత పదబంధురముగా నున్నవి. చంద్రుని యందలి మచ్చను త్రిపురాంతకుడిట్లు వర్ణించెను.

మత్తే॥ రతినాథుండను మాయజోగి, చదలన్ త్రైలోక్యవశ్యాంజనం
బతి యత్నంబునఁ గూర్చి, మౌక్తిక మయంబైయున్న పాత్రంబునన్
మతకంబేర్పడఁబెట్టి దాచెనన మీ మధ్యంబునన్ మచ్చ సం
తతమున్ గన్నుల పండువై వెలయుఁజంద్రా! రోహిణీ వల్లభా!

కామశాస్త్ర సంబంధముగా త్రిపురాంతకుడు మదన విజయమను కావ్యమును రచించెను. అదియు లభింపలేదు. దీనియందలి రెండు పద్యములను మాత్రము మానవల్లి రామకృష్ణ కవిగారుదాహరించిరి.

కం॥ సతి గుణవతి యగునేనియుఁ
బతికది రత్నంబు, ప్రాణబంధువ, యమృతం
బతివయ దుర్గుణియగునేఁ
బతికెడపని చిచ్చు కాలుపక యదికాల్చున్.

ఆంధ్రభాషలో కొక్కోకమును రచియించిన కూచిరాజు ఎఱ్ఱన తన కావ్యమున త్రిపురాంతకు స్తుతియించెను. కావున ఈ మహాకవి మదన విజయమును రచించెనని చెప్పవచ్చును.

ఆంధ్ర వాఙ్మయమునకు ప్రత్యేక విశిష్టత ప్రతిపాదించిన గ్రంథములలో ముందుగా నెన్నదగినవి యుదాహరణ కావ్యములు. సామాన్యముగా నుదాహరణములు భక్తి భావ భరితములు. ఆంధ్రమున లభించిన యుదాహరణములలో ప్రప్రథమము పాల్కురికి సోమనాథుని బసవోదాహరణము ద్వితీయము అయినను గుణమును బట్టి అద్వితీయము.

ఉదాహరణ కావ్యములలో సంబోధన విభక్తితో నెనిమిదియగు విభక్తులతో నెనిమి పద్యములును, కళికలు, ఉత్కళికలు నుండును. కళికోత్కళికలు రగడల వంటివే. త్రిపురాం కోదాహరణమున శ్రీశైలమునకు తూర్పు వాకిలియగు త్రిపురాంతక క్షేత్రమున వెలసిన త్రిపురాం దేవుని మహిమ వర్ణింపబడినది. సందర్భోచితముగా శైవభక్తుల కథలును ప్రస్తావింపబడినవి. లఘ కావ్యమే అయ్యు త్రిపురాంతకోదాహరణము చాల వ్యాప్తిని పొందినది. కావుననే పోతన, పినవీరభద్రుడు తెనాలి రామకృష్ణుడు వంటి మహాకవులందలి పద్యముల ననుకరించిరి.

మొత్తము మీద త్రిపురాంతకుడు భక్తి భరితమగు దివ్యశృంగార కావ్యములను రచించి శివకవి శిఖామణియని చెప్పనొప్పును.

(1. ప్రాఙ్నన్నయ, 2. నన్నయ, 3. శివకవి, 4. తిక్కన, 5. ఎఱ్ఱన యుగములు)

(ఇంతటితో ప్రాఙ్నన్నయ యుగము నుండి ఎఱ్ఱన యుగము వరకు వ్రాయబడిన 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర' - ప్రథమ సంపుటము రచన పూర్తియైనది.)

శ్రీః

త్వరలో ద్వితీయ సంపుటము.

శ్రీనాథాది మహాకవులు...




# తెలుగుగోష్ఠి

రాంనగర్, హైదరాబాదు

ఈ గ్రన్థము గుంటూరు జిల్లా, వట్టిచెరుకూరు వా॥లు
శ్రీ రావి వెంకటసుబ్బయ్య, సీతారామమ్మగార్ల ఆర్థిక సహాయంతో
ముద్రింపబడినది.

